# మేఘరంజని

[నవల]

శార్వరి

ప్రకాశకులు:

పద్మశ్రీ అండుకో, చిత్తూరు.

# అనురంజితమ్: శ్రీ తిరుమల రామచంద్ర

లేడీ చాటర్లీ తరతమాలు, కాల దేశ వర్తమానాలు గమనించక తోటమాలితో చెట్లక్రింద రాలిన ఎండుటాకులమీద, కాపలా గుడిసెలో, ఎగుడు దిగుడు నేలమీద సురత విలాసాలు సాగించినట్లు డి. హెచ్. లారెన్స్ వర్ణిస్తే, "ఏం జేస్తుంది పాపం! మొగుడేమో అవుడు. మాతృత్వవాంఛ మనస్సులో ముప్పేటగా అల్లుకుంటున్నది. ఎంత చక్కగా ఆ వాంఛను చిత్రించాడు లారెన్స్!" అని సమర్థిస్తారు మనపాఠకులు.

ఏ జీన్ పాల్ సార్త్రేవో ఏహోటల్ వెయిట్రెస్ జిన్నెట్టో తన నెచ్చెలికి "మొగుణ్ని విడిచి పెట్టేయవే. ఎంతకాలం ఆశిఖండితో కాపురంచేస్తావు? నీవూ కోరికలు, కామనలు ఉన్న ఆడదానివే. ఏమిటి ఈ పాతివ్రత్యం?" అని ఉపదేశించేట్టు వ్రాస్తే, "ఆహా! ఏమి స్త్రీత్వచిత్రణం! ఎంత సహజంగా ఉంది? ఎంత కాలం పడుతుంది పేడివాడిపక్కన పడుకునేబాధ?" అనికారణాలు అన్వేషిస్తారు మనధర్మ శాస్త్రజ్ఞులు.

ఏ మపాసావో ముక్కూ మొఖం తెలియని ఓ ఇటలీ సుందరి ఏ పారిస్ నవనాగరికునితోనో రైలు పయనం పరిచయం లోనే ప్రణయం కట్టి బసచేసిన హోటలుగదిలో నగ్నంగా పడుకుని, తన ఒంటి వంపులన్నీ ఇంపుగా చూపుతున్నట్టు, పక్కకు జరుగమని_ఇంతో అంతో ధర్మభీతిగల ఆ నాగరకుడు పైనబడే సాహసం చేయలేక పక్కకు జరుగమని—కోరినప్పుడు నగలు ఒలికిస్తూ మరింత వంపులు తిరిగినట్టు వర్ణిస్తే "ఎంత సౌందర్య పిపాస! ఆడదానిఅందం తెలియాలంటే దిసమొలగా ఉన్నప్పుడే సుమా!" అని లొట్టలువేస్తారు మన కళాహృదయులు

'లొలితా' లో లాగ "అరువ నామెత బాలిక" కోసం తల్లిని మొదట ప్రేమించి, తల్లి మరణిస్తే చాలునని రోజూ కోరు కుంటూ, కసుగాయ కరచిచూచే వ్రాతలు ఏ విదేశీ ప్రవాసి తుషో వ్రాస్తే, ఆహా! అని ఆనందిస్తారు మన శృంగారప్రియులు.

ఏ నో డౌన్ పేమెంట్ లో లాగ సుసంస్కృతు లన బడేవారే యువతిని చూచీ చూడగానే, రెచ్చిపోయి మానభం గానికి పాల్పడినట్టు వ్రాస్తే, "నిజమే ఏం అలాంటివి జరుగవా? అమెరికా అయితే జరుగదా! సంస్కృతి మనోదఘ్నం కావాలి గాని, చర్మస్పృక్కుగా ఉంటే అంతే" అని ఎక్కడి కక్కడే వాదిస్తారు మన న్యాయనిపుణులు.

ఏ అమెరికా రచయితో ఏ విపరీత కాముకుని అయోని వియోని సంభోగాలను తు. చ. తప్పక వర్ణిస్తే, "ప్రపంచంలో అలాంటివారున్నారు. వాటిని చెబితే తప్పేముంది! చెప్పిన విషయాన్ని కాదు మనం చూడవలసింది. చెప్పేతీరును" అంటారు మనసాహిత్య విమర్శకులు.

కాని, "సావిట్లో నిలబడిన సావిత్రమ్మ ఏదో జ్ఞాపకం వచ్చి ఒక్కసారి చేతులెత్తి ఒళ్లు ముచ్చటగా విరుచుకుని, సడలిన పైటలోకి రెండుచేతులూ పోనిచ్చి, రవికెముడి విప్పి పొంగిపోతున్న చనుకట్టును బిగించికట్టుకుని, ఒక్కసారి చూపులు సారించింది అని కాని, "గాఢపరిష్వంగంలో కరిగించి నిమ్నోన్నతాలు పుణికాడు" అనికాని మనరచయిత ఎవడైనా వ్రాశాడనుకోండి. "బూతు! బూతు! ఏమీ ఎరుగని పిల్లలు చదువుతారనే బుద్ధి ఉండనక్కరలా!" అని చీదరించుకుంటారు మన నీతిపరులు.

నీతివిషయంలో కొలబద్దవిదేశాల కొకటీ? మనకొకటీనా? విషయోద్రేకాలు పొంగించే సాహిత్యం ఎక్కడైనా అంత సమాదరణీయం కాజాలదన్నమాట వాస్తవమే. సంఘపు కట్టుబాట్ల వైవిధ్యంవల్ల ఆచారవ్యవహారాలలోను, ఆలోచనా నిర్ణయాలలోను వైవిధ్యం ఆపాతతః కనిపిస్తే కనిపించవచ్చునేమో గాని, ప్రధాన శీలసిద్ధాంతస్వరూపం, మూల ధర్మసూత్రాలస్వరూపం ప్రపంచంనాలుగంచులా చాలవరకూ సరూపమే. విషయవాసనలు కాదని అనాగరికవృత్తితో అడవులు పట్టిన బౌద్ధభిక్షువులు కూడా, ఆశలు మోసులెత్తగా, గుహాలలోనే తమ కళాహృదయం కుమ్మరించారు. ఆ చిత్రాలలో, శిల్పాలలో విషయవాసన వేయిపాయలుగా పారినా, కళాకారుల పరమదృష్టి తథాగతుని ధర్మదేశనవిస్తృతే గనుక ప్రేక్షకులు విషయలోలులు కాలేదు; కారు. అంటే, దృక్పథం ప్రధానమన్నమాట. విదేశసాహిత్యాన్ని ఇంత ఉదారదృష్టితో చూచే మనపాఠక విమర్శకులు మన సమకాలిక రచనలనూ ఆచల్లనిచూపుతోనే చూస్తే బాగుండును.

మన సమకాలిక రచయితల రచనలు పాశ్చాత్యరచయితల రచనలవంటివే. మానవునిలోనిగూఢమైన దుష్ప్రవృత్తి మాత్రమే చిత్రించినవారూ మనవారిలో లేకపోలేదు. వారిని [illegible]పైలెక్కపెట్టవచ్చు. దుష్ప్రవృత్తిని, సంఘంలోని అవినీతిని విచ్చలవిడిగా వర్ణించినా, మానవునిలక్ష్యం అది కాదని, దానికి అతీతమైన సంఘమర్యాద, గార్హస్థ్యజీవితం, సమాజశ్రేయస్సు ఉన్నవని ధ్వనింపజేసిన రచయితలే హెచ్చు. "తొంభయితొమ్మిది పాళ్ళూ చెడు చెప్పి, మిగిలిన ఒక్కపాలూ నీతివాక్యాలు వల్లిస్తే

ప్రభావం ఏముంటుంది? ఈగ లాగ మురికిపైనే పూర్తిగా మనసుంచి, ఒక్కమారు ఏపూవుమీదికో రెక్కలు విదిల్చినంత మాత్రాన ప్రయోజనం ఏమిటి?" అని ఆక్షేపించేవారు ఉంటారు. నిజమే. ఒక్క ధర్మపన్నంతో ఏమీ జరగదు. అది కాంతా సమ్మితంగా చెప్పడమనే కళారీతి కాదు. పాఠకుని ఒప్పించడం రచయిత కలంబలంపై ఆధారపడిఉంటుంది. అలాటి బలమున్న వారే నిలవదొక్కుకుంటారు. ఆ బలం ఈ 'మేఘరంజని'లోను కనిపిస్తున్నదనే నేనంటాను.

మేఘరంజని అనగానే నాకు 'వానకాలపు చదువు' అనే పెద్దల వెక్కిరింపుమాట జ్ఞాపకం వస్తుంది. వానకాలపు చదువు ఎలా మెదడుకు పట్టదో, తాత్కాలికపు వెలిచవ్వులుగూడ హృదయానికి పట్టవనే సత్యాన్ని స్పష్టంగా చెప్పడానికే శ్రీ శార్వరి మేఘరంజని అని ఈ నవలకు నామకరణం చేశారు.

అవారాగా తిరిగే సుందరం చిన్ననాటి మిత్రుడు, పత్రికా రచయిత అయిన సదానందం సహాయంతో ఒక పత్రికలో ఉద్యోగం సంపాదించి, జీవిక సమస్యనుంచి విముక్తుడవుతాడు కడుపునిండగానే కన్ను మరొకదానిమీద పడుతుంది. తను ట్యూషన్ చెప్పిన రజని అంటే అదివరకే కొంత అభిమానం ఉంది. సదానందం భార్య లీల సౌందర్యం అతనిని ముగ్ధుని చేస్తుంది. కాని, ఆమెను గురించి అలా భావించడం మిత్రద్రోహమని మనస్సు చివుక్కుమంటుంది. లీల నెచ్చెలి శకుంతల, మగనాలి, భర్త ధనవంతుడు, ఒక పిల్లతల్లికూడా. శకుంతల సుందరాన్ని ఆకర్షిస్తుంది. ఆమెముందు రజని ఏపాటిసి. ఆమెను లొంగి పోయి దొంగచాటునా, క్రమంగా ఫ్యామిలీ ఫ్రెండుగానూ

ఆమెను అనుభవిస్తాడు. ఇంతలో సదానందం క్షయతో మంచం పట్టి మరణశయ్యపై లీలభారం సుందరానికి అప్పగిస్తాడు.

లీల వింత మనిషి. అందరికీ అందనిపువ్వు. ఎన్నో నెలలు ఆమెను చేపట్టడానికి వేచివుంటాడు సుందరం. పైకి అందరూ అనుకోవడమేమో లీల సుందరంభార్య అనే. ఈ తెర చాటుజీవితం అయోమయంగా అర్థరహితంగా ఉంటున్నాడు. అంతేకాక, అడుగడుగునా లీల సదానందాన్ని స్మరిండమూ, పాత మిత్రుడు ప్రసాద్ వచ్చినప్పుడు ఆమె చూపిన సంబరమూ సుందరం మనస్సు విరిచివేశాయి. లీలఅంటే అసహ్యం వేసింది.

ఇక శకుంతలని పెండ్లాడే ప్రశ్నే లేదు. "ఆమె కులట, జారిణి, అవునోకాదో నిజంగా తనకు అనవసరం. తనవిషయంలో ఆమె కాలుజారింది. పతిత అయినా, తనేదో పవిత్రురాలన్నట్టు తనను తూలనాడింది పెళ్ళిసాక్షిగా. జాణతనంతో తనను వశపరచుకుంది." ఇక ఆమె చెల్లెలిని పెండ్లాడదామనుకుంటే శకుంతల వదినగారా ... ! ఛీ ఛీ ఎవరూవద్దు. పెళ్ళివద్దు, పెటాకులూ వద్దు అని నిర్ణయించుకొని హాయిగా ఉంటాడు.

ఇంతలో రజని — టైఫాయిడులో మంచంపట్టిన రజని— ఉత్తరం అందుతుంది. ఆమెను చూచినతర్వాత బతకాలనే ఆశ బలవత్తరమవుతుంది.

దారితప్పిన మానవుడు ఎన్నటికైనా సరైనదారికి రాక తప్పదన్నది, ఈ నవల చిత్రీకరణగా నాకుతోస్తున్నది. అవ్యాజానురాగంతో పరిచితులకు ఉపకారంచేసే సదానందం వంటివారు,

ఉపకారం పొంది, మొగుడికి మిత్రుడు మగువకు మిండడుగా మెలిగే సుందరంవంటివారు, అందినట్టే ఉండి అందరినీ ఊరిస్తూ తమ వెంటతిప్పుతూ గొప్పవారుగా చెలామణీఅయ్యే లీలవంటి వారూ, 'పూవులసందున ఎన్నిపూవులు పెట్టినా పెట్టవచ్చునన్న' సామెతగా మగనిచాటున అడ్డమైన గడ్డీ కరిచే శకుంతలవంటి వారూ, వగలకుపోక అనురాగం పరమావధిగా ప్రవర్తించే రజనివంటివారూ నేడు మనకు అంతటా కనిపిస్తారు. వారిలో ఎవరు ఎవరో తెలుసుకొని నిర్ణయించుకొనడంలోనే ఉంది జీవికకీలకం. సుందరం ఆకీలకం ఆఖరుకు తెలుసుకున్నాడు.

'రోదసి' వంటి కవితాసంపుటితో తన అభ్యుదయ భావుకతను రోదసికి వ్యాపింపజేయడానికి ప్రయత్నించి, 'ఆరాధన' లో కవితను ఆరాధించి, నిజానిజాలు, బ్రతుకుబాట, పిచ్చిలోకంవంటి నాటకాలలో లోకంలోని నిజానిజాలను ప్రస్తరించి, ప్రియురాలు, అజంతా, ప్రేమపంచమి, మధుర యామిని వంటి నవలలలో చిత్రవిచిత్రసాంఘిక చారిత్రిక పాత్రలను చిత్రించి, స్వర్గసీమ, ఎర్రభూతంవంటి కథాగుచ్ఛాలతో పాఠకులను రంజింపజేసి గడిదేరిన శ్రీ శార్వరి కలం ఈ 'మేఘరంజని' లోని పాత్రలను తీర్చిదిద్ది, తన వక్తవ్యాన్ని పాఠకుల హృదయాలపై ముద్రించిందని నా నమ్మకం.

నవల అన్నదినేడు ప్రాచీన మహాకావ్యంస్థాయిని అందుకున్నది. అది నేటి మహాకావ్యమన్నాసాహిత్య శాస్త్రజ్ఞులు కాదన రనుకుంటాను. ఈ సాహిత్య ప్రక్రియా విస్తృతికి, ఉన్నతికి శ్రీ శార్వరి రచనలూ తోడ్పడుతున్నాయని, తోడ్పడగలవని నమ్ముతున్నాను.

---

౧

# మేఘరంజని

ఈశానాంజగతో౽స్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్.॥

ఆకాశం ఆవులించి కన్నెర్ర చేసింది. దిగంతాలు ఎర్రడాలు వేసినవి. మురిసిన మబ్బులు క్రమంగా ప్రిదిలిపోయినవి. క్రమ్ముకున్న కారుమబ్బులు కలగి, చెరగి పోవడంతో, వస్తున్నదనుకున్న వాన రాకుండానే ఆగిపోయింది. కుండపోత కాదుగదా, జడివాన కూడా లేదు. ఆకాశం ఆసరాగా సాయంత్రిపు సీరెండ కిరణాలు చరణాలుగా, ఛాయలుగా పాకుతున్నాయి. ఇంద్రసీలాద్రి వెనుకగా అస్తమించనున్న సూరీడు ఎర్రగా, కసిగా, బెజవాడ వైపు చూచి, తప్పనట్లు దొంగగా, చల్లగా జారుకున్నాడు. అందుకే ఎర్రబడ్డ ఆకాశం భయంకరంగా వుంది.

మిగిలిన చిల్లర జేబులో తురుముకుంటూ హోటలు నుండి బయటకు నడిచాడు సుందరం. నాలుగురోజులనాడు కట్టిన ఇస్త్రీ బట్టలు ముడికిగా, బాధగా, దరిద్రుని హృదయంలా అవుపిస్తున్నాయి. ఎంత జాగ్రత్తగావాడినా, అజాగ్రత్త జీవితంలా, డబ్బు కర్పూరంలా హరించుకుపోతూనేవుంది. ముందుచూపు చూస్తూ, నిరాశ నిట్టూర్పులే పొగమంచుకాగా, మునిగిపోయి ఈమధ్య గడ్డంమీదికి ధ్యాస మళ్లించుకోలేకపోయాడు.

బ్రతుకు, చీదరగా, దురదగా వుంది. అయినా ధ్యాస వేరుగావున్నప్పుడు వేరుపనిచేయ బుద్ధిపుట్టదుకదా! అవే సుందరంచుట్టూ నిర్మించుకున్న అడ్డుగోడలు. మనసు అల్లకల్లోలం కాగా, విరిగిపడే కెరటంలా, ఎగసిపడే పడవలా తట్టుకోవడానికి ఒడ్డుచేరడానికి సుందరం చేసే చివరిప్రయత్నం అది. అదే చివరకొచ్చింది.

అదేవీధిలో—పర్సు బరువుగావున్న రోజుల్లో దర్జాగా తిరిగాడు. ఒక్క సుందరమేకాదు, సౌందర్యాన్ని, సుఖాన్ని ఆశించేవారెవరైనా; డబ్బిచ్చి కొనుక్కోదలచినవారెవరైనా విచ్చలవిడిగా చీకటిలో షికారు సాగిస్తారక్కడ. ఎదురుగావచ్చే అమ్మాయిల్నీ, రిక్షాల్లో పోతున్న వన్నెల విసెనకర్రల్ని, సీతాకోక చిలుకల్ని ఎగాదిగా చూచి సుందర స్వప్నాల్నే కన్నాడు సుందరం. బ్రతుకు ఎప్పుడూ ఒకలావుండదు. బ్రతుకుకూ గతుకులున్నాయి, ఎగుడుదిగుళ్లున్నాయి. నిన్ననేడుకాదు, నేడు రేపు వుండదు. అంతా అగమ్యం, అగోచరం, అయోమయం. అస్థిమితంగా ఆలోచనారహితంగా నడుస్తున్న సుందరానికి ఇద్దరు

ముగ్గురు సుందరాంగులు ఎదురైనారు. మరొకరిద్దరు ప్రక్కనే రాచుకుంటూ కవ్విస్తూ వెళ్ళిపోయారు. అతనికా క్షణంలో ఆ దృష్టి లేదు. మరొక దృష్టి, మరొక దిదృక్షు. మనసు ఆ క్షణంలో వైకల్యంచెందలేదు. ఆలోచనలు వ్యభిచరించనూలేదు. జీవితంలో తొలిమలుపు వక్రిస్తే, వలపు చిగురించకపోతే, ఒక లయ, ఒక శృతి కుదరకపోతే అంతేనేమో! వెతలమయం బ్రతుకైతే పరిస్థితులకు మానిసి బానిసకాక ఏమవుతాడు.

పోతూపోతూ అర్ధాంతరంగా ఆగి ఆలోచించాడు. క్షణ మాత్రం అచలుడుగా వుండిపోయాడు. ఇంక ఏంచేయాలి? ఎండాకాలం సెలవులుకావడంతో చేతిలోవున్న ట్యూషన్లు అయిపోయాయి. జేబులో చిల్లర తప్ప మిగిలినది లేదు. రేపు భోజనం, కాఫీ ఈ ఖర్చులన్నీ ఎట్లా వెళ్లమారిపోయేట్లు....మహా వస్తుపడుకుంటేమాత్రం మూడునాలుగురోజులు వుండగలడు. అయిదవరోజున? ఎలాగో క్షుద్బాధ తీరాలిగదా. ఎలా? జవాబు లేని ప్రశ్న. ఈ ప్రశ్న ఇంతదారుణంగా, నగ్నంగా లోగడ ఎన్నడూ తన జీవితంలో తారస పడలేదు.

ఏ ఆలోచనాపోక నెమ్మదిగా క్రిష్ణవడ్డుకు నడకసాగించాడు. అప్పటికే బాగా చీకటిపడ్డది. రెగ్యులేటర్ వంతెనమీద బారులు తీర్చిన లైట్లు, కనకదుర్గమ్మ గుడిమీద వెలిగే దీపాలు-అన్నీ ఏదో ఆశగా వెలుగు ప్రసాదిస్తున్నాయి. వాటిని అలాగే చూస్తూ నిరాశగా ముందుకు నడుస్తున్నాడు. మనుష్యుల్ని తప్పించు కున్నాడు. మమతలకు దూరంకాలేకపోతున్నాడు. పోనుపోను కృష్ణాతటం నిర్మానుష్యంగావుంది. ప్రపంచాన్ని ఎదిర్చి, పోరాడి,

ఓడిపోయి, పారిపోయినవాడిలావున్నది సుందరం స్థితి. బజారుల్లో నడచినంతసేపు బళ్లు, కార్లు, మేడలు, మనుషులు అందరూ తనని వెక్కిరిస్తున్నట్లే బాధపడ్డాడు. జీవితపోరాటంలో ఓడిపోయిన ఓ సైనికుడు తను. ఓ క్షతగాత్రుడు.

ఎండాకాలమేమో పట్నం మరీ కుతకుతలాడిపోతున్నది. ఎక్కడా గాలిలేదు. రాత్రిళ్లు తపనతో కాగిపోతున్నాయి. కృష్ణలో దూరంగా మెరిసే నీటిపాయల్ని చూస్తుంటే కొంత సేదతీరుతోంది.

ఓ ఇసికదిబ్బమీద కూర్చుని చల్లగాలి అనుభవిస్తున్నాడే గాని, ఏంచేయడానికి తోచలేదు. ఏదో చేయాలని ఆత్రం. ఎలాగో జీవితాన్ని సాగించాలనే ఉబలాటం. ఏదో సాధించాలి. ఏమిచేయాలన్నది అర్థంలేని ఆలోచన. ఏదో చేయాలి, చేసితీరాలి అనే సమస్య. అందుకే ఆలోచనకు బలంలేదు. మూడునెలలుగా ముందుచూపులోనేవున్నాడు సుందరం. ప్రతి రోజు ఉదయంనుండి సాయంత్రంవరకు అదే తలపోత. ఏదేనా ఉద్యోగం సంపాదించుకోవాలి. కూటిదో, గుడ్డదో ఓ ఆలంబనం అంటూ వున్నదిగనక ఇంతకాలం బండి దొర్లింది. ఇప్పుడో?

జేబు కాళీఅయింది. వల్లమాలిన ఉద్రేకంతో, ఉద్వేగంగా నరాలు ఉప్పొంగుతున్నాయి. చీకాకుగావుంది. ఏమీ తోచడంలేదు. అంతా అయోమయం. కృష్ణాతటంగానీ, మలయానిలంగానీ అతని హృదయానికి, హృదయగతభావాలకు సేద తీర్చలేకపోతోంది. కళ్లు బైర్లుకమ్ముతున్నాయి. పొంగివచ్చే దుఃఖంలో దారి కన్పించడంలేదుకూడా. అలాగే నడక సారించి ఊళ్లోకి బయల్దేరాడు.

ఆ వీధులన్నీ విలాసవతులకు నిలయాలు. డబ్బు వెచ్చించి సుఖాన్ని కొనుక్కోవచ్చు. తాముగా ఆహ్వానించే పడుపుకత్తెల ఆహ్వానాలు, వారి శృంగారచేష్టలు, విలాసాలు మామూలుస్థితిలోవుంటే ఉత్సాహాన్ని రంగరించేవేకానీ.... సుందరం మానసికస్థితి వాటి కతీతంగావుంది. చీకటిబజారుల్లో, వీధిమూలల్లో మెరిసే కళ్ళతో, రేగే కోర్కెలతో, తెల్లటి బట్టలతో ఆహ్వానాల విలాసాలు.

తాను ఆమెకోసం, ఆమె పొందుకోరి, సుఖంకోసం వచ్చినట్లే భ్రమించింది ఓ విలాసవతి. అందుకే వయ్యారంగా, సుతారంగా చూస్తూ, వెనుతిరిగి చూస్తూ, పిలుస్తున్నట్లు అభినయిస్తూ ముందుకు దారితీస్తోంది. కానీ సుందరం ఆమెని అనుసరించలేదు. ఎవరి కక్కుర్తి వారిది. తనూ కడుపునింపుకోవడంకోసం ఏం చేయాలి అని ఆలోచిస్తున్నాడు. వాళ్లూ అంతే. వారికి ఓ ఆలంబన అంటూ వున్నది. అది మంచిగానీ, చెడ్డగానీ, నీతిగానీ, అవినీతిగానీ లెక్కలేదు. బ్రతకాలి. అదీముఖ్యం. సంఘంఏమైనా, ఏమన్నా, వేలెత్తిచూపినా లెక్కలేదు. మాదవకబళంకోసం బయలుదేరిన బిచ్చగాన్ని లోకం నానామాటలూ అనవచ్చు. అతను తన వృత్తి మానుకుంటాడా....కుక్కకన్న కనాకష్టమైనదే కావచ్చు అతని బ్రిదుకు. తన జీవితం అలాంటిదే అయింది. తనకు, ఆ విలాసవతికి, బిచ్చగానికీ తేడాలేదు. డబ్బుకోసం, కడుపునింపుకోవడంకోసం పడుపువృత్తి సాగిస్తున్న ఆ వనితల్ని చూస్తే జాలివేసింది. "ఓ స్త్రీ నువ్వు ఉన్నతురాలివి" అన్న సూక్తి ఏమిటో అర్థంలేదు. వారి అభినయాల్ని, ఆహ్వానాల్ని

చూచి జాలిపడ్డాడు. కాని అసహ్యించుకోలేదు. అసహ్యించు కునే శక్తిగానీ, బలంకానీ అతనిలో లేదు. సమాజం విస్మరించి, చిన్నచూపు చూచిన వ్యక్తులు వారు—తానుకూడా. తనకంటే వారే ఉన్నతులేమో!

వీధిలో చిన్నచిన్నదీపాలు. గదుల్లోంచివచ్చే అగరువత్తుల వాసనలు మత్తెక్కించడానికి బదులు, మనస్సును ఆరాటపరుస్తు న్నాయి. వాకిళ్లలో ద్వారానికి ఒకరుగా నిలబడ్డవారు, చీకట్లో పోల్చుకోలేని అందం, విడదీయరాని సౌందర్యం, ఆకర్షణ' సుఖం పెనవేసుకుని ప్రతిఒక్కరిలో వున్నాయనిపించింది.

సుందరానికి జాలివేసింది. మరోరోజు అయినట్లయితే మరోలా భావించేవాడు. చప్పున ఏ యింట్లోకో జొరపడాలనిపిం చేది. కాని ఈరోజు చేతిలో డబ్బులేదు. మనసులో ఉత్సాహం లేదు. ఆ అగరు గుబాళింపులు మనసును మత్తెక్కించలేక పోయాయి. వారంతా స్త్రీలు, పతితలు. డబ్బుపుచ్చుకుని సుఖా న్నిస్తారు. తాను ఉన్నతకుటుంబంలో పుట్టినవాడు. ఉన్నత విద్య నభ్యసించినవాడు. ఉన్నతంగా జీవించాలని ఉబలాటపడ్డవాడు.

బిసెంటురోడ్డులో అడుగుపెట్టేసరికి జనప్రవాహంలో కలిసిపోయినట్లయింది. ప్రక్కనేవున్న హోటల్లోంచి వచ్చేజనం, పోయేజనం; ఫుట్‌పాత్‌ల నిండుగా దండిగా నడుస్తున్నారు. అందరిలోనూ ఆత్రుత, ఆదుర్దా, దేనికోసమో పరుగు. క్షణం ఆలస్యమైతే లోకం తల్లక్రిందులౌతుందేమోనన్న తీవ్రత ప్రతి ఎదలోనూ అవుపిస్తుంది. హోటళ్లలో రంగురంగులదీపాల్క్రింద.... టేబుళ్లకు ఎడాపెడా జనం.

సుందరానికి ఆకలవుతున్నట్లు తోచింది. ఒక్కసారి జేబు తడివిచూచుకున్నాడు. ఓ పావలా మిగిలింది. నెమ్మదిగా ఓ హోటల్లోకి జొరపడ్డాడు. అవి ఇవి తినుబండారాలు చూస్తుంటే ఆకలి మరీ ఎక్కువవుతోంది. కానీ తినడానికి వీల్లేదు. జేబులో వున్నది పావలామాత్రం. సుందరం బ్రతుకు విలువ పావలా ఆ క్షణాన.

రాత్రి పదయింది. బజార్లు కొంచెం పల్చబడ్డాయి. సినీమాలకువెళ్ళే జనం, వొచ్చేజనం ఆనందంకోసం అఱ్రులుచాచి, తనివితీరక నిరుత్సాహంతో ఇంటికి తిరుగుముఖంపడుతున్నవారు. వాళ్ళందర్నీ చూస్తుంటే అంతులేనికోపం ముంచుకొచ్చింది సుందరానికి. వాళ్ళ జేబుల్లో నిండుగా డబ్బు. కొందరి వ్రేళ్లకు రాళ్ల ఉంగరాలు. ఈ నడిచే ప్రతివాడిదగ్గర దండిగా డబ్బు వుండే వుంటుంది. తనలా లేనివారు లేరనే అనిపించింది ఆక్షణాన. అందుకే అందరిమీద కోపం. కొట్లు కట్టేసే వేళ. షావుకార్లు కాష్ టేబిల్సదగ్గర నోట్లు లెక్కబెట్టుకుని కట్టలు కట్టుకుంటున్నారు.

ఒక్కసారిగా దీపాలన్నీ ఆరిపోతే...

ఒక కొట్లో జొరపడి, జేబులనిండా కరెన్సీ తురుముకుని పారిపోతే ఎంతబావుండును. కొన్ని వేలు—ఎంతలేదన్నా కొన్ని సంవత్సరాలు నిశ్చింతగా గడపవచ్చు. ఏశ్రమాలేకుండా సుఖంగా బ్రతికవచ్చు. ఉద్యోగంలేదన్న చింతవుండదు. తాను కలవానిలాగా, పెద్దమనిషిగా ఛలామణికావచ్చు. క్లబ్బులలోచేరి పేకాడవచ్చు. హోటళ్ళలో రాత్రిళ్లు విలాసంగా గడపవచ్చు.

16

## 2

స్మృతిపథంలో గడచిన జీవితం మెదిలింది. బాధ్యతారహితంగా తిరిగిన రోజులు అవి. కాలేజీలో చదివినంతకాలం ఎంత హాయిగావుంది. ఎన్నిసుఖస్వప్నాల్ని, సుందరస్వప్నాల్ని కన్నాడు. పెద్ద ఉద్యోగం సంపాదించగలనని ఎన్ని వెర్రికలలు కనలేదు! అవన్నీ కరగి నీరై పోయాయి. తనతో చదువుకున్న సత్యం, సీతాపతి మంచి ఉద్యోగాల్లో వున్నారు. సత్యవతి చక్కగా పెండ్లి చేసుకుని భర్త పరిష్వంగంలో స్వర్గసుఖాలు అనుభవిస్తుంటుంది. ఛస్...సత్యవతి...ఆమె తనని ప్రేమించిందనే భ్రమతోనే చదువు చెడగొట్టుకున్నాడు. ఇప్పుడు తెలిసివచ్చింది ప్రేమఫలం. అటు చదువూ పూర్తిగా అబ్బలేదు, సత్యవతీ దక్కలేదు. అదంతా ఓ కల—పీడకల.

జీవితం నగ్నంగా ఇపుడిపుడే కళ్ళకు కట్టినట్లు తోస్తోంది. అర్థంకాని ఓ జటిల సమాసంలా వుంటోంది. చదువుకున్నా ప్రయోజనం లేదు. అదృష్టరేఖ వక్రిస్తే, మనిషి ఎలా మారతాడో తెలిసివస్తోంది సుందరానికి. "ఎంత విజ్ఞానమున్నా, ఎన్ని తెలివితేటలున్నా, ఎంత మేధస్సువున్నా ప్రయోజనంలేదు. అన్నీ నిరర్థకాలే. మనం అనుకున్నంతసాఫీగా బండి సాగదు. కోరికలు

తీరవు. వాంఛలు నెరవేరవు. ఆనందం అనుభవించలేం. సంతోషం మృగ్యం. న్యాయం, ధర్మం అర్థంలేని పదాలు. అపుడు బ్రతుకే ఒక ఉన్మాదం అవుతుంది. యుక్తాయుక్త విచక్షణ వుండదు." ఇలా ఆలోచించుకున్నాడు సుందరం. రెండురెండు నాలుగు సంవత్సరాలు ఎడారిజీవితమే రుచిచూచాడు. ఎడారిలో ఒయాసిస్సుల్ని నిర్మించుకుని, వాన్నిపక్కనే కలలుకంటూ బ్రతికాడు. తన ప్రయాణం దారీతెన్నూలేని ఎడారిలో. వీచేవి వడగాడ్పులు. ఆ ప్రయాణంలో ఏదో సాధిద్దామనే వాంఛ. ఆ వాంఛకి పరితృప్తిలేదు. నిజానికి నిష్టదరిద్రుడు తను.

బ్రతుకు ఎడారితనాన్ని ఊహించుకుని నిట్టూర్చాడు.

జనాన్ని తప్పుకుని నడుస్తూ ఆలోచిస్తున్నాడు. 'ఈ వెధవలందరికీ డబ్బెందుకుండాలి, తనకెందుకు లేకపోవాలి. అయినా వారి మధ్యలోనే తనూ నడవాలి. వారిలో ఒకడుగానే జీవించాలి. ఈ సాంఘిక వ్యవస్థ, ఆర్థికవ్యవస్థ అర్థంకాని పజిల్.

వచ్చివచ్చి, సెంటరుదాటి రవీస్‌కాలువ వంతెనమీద నిలబడ్డాడు. వంతెనక్రిందుగా పారే కాలవ వయ్యారాలు పోతోంది. కాలువనీటిలో స్వచ్ఛంగా మెరిసిపోతున్న చంద్రబింబం చలికి వణికిపోతోంది. ఆ చందమామ స్థితి తనలా అస్థిమితంగానే వున్నది. తీరని వేదనతో, ఆవేదనతో కుతకుతలాడిపోతున్నాడు. గడియారం ఎక్కడో ఖంగుఖంగున మోగింది. యమునిమహిషపులోహ గంటలచప్పుడు కాదుకదా అది. ఒక్కసారిగా తననుతాను సంబాళించుకున్నాడు సుందరం.

మళ్ళీ ఓసారి బజారుచివరంటా నడిచాడు. చివరకు వచ్చే సరికి ఒకాయన ఎదురైనాడు. బొద్దుగావున్నాడు. ఎక్కడో ఎప్పుడో చూచిన జ్ఞాపకం. ఎక్కడ చూచిందీ, ఎవరైందీ స్పష్టంగా జ్ఞాపకం రావటంలేదు. అలా ఆలోచిస్తూ కొంతదూరం వెన్నంటి నడిచాడు స్మృతుల్ని నెమరువేస్తూ.

"ఈయన్ని ఎక్కడచూచానబ్బా!" అనుకున్నాడు పాటికి పదిసార్లు.

అవును. అతనే పొరపాటులేదు.

"హలో....సదానందం?" పిలిచాడు.

అతను వెనుదిరిగిచూచాడు. తనను కాదన్నట్లు రెండడుగులు ముందుకువేశాడు.

సుందరం ధైర్యంచేసి పిలిచాడు.

"సదానందం!" అని.

ఆగాడు. ఎవరో జ్ఞాపకం లేనట్లు, చీకట్లో గుర్తించనట్లే చూచాడు.

తాను పొరపడలేదుగదా అనే పశ్చాత్తాపం కప్పుకున్నాడు చుట్టూ. కానీ అతను సదానందమే. అందులో పొరపాటులేదే! పోలికలన్నీ అతనివే.

"నేను సదానందం. సుందరాన్ని....గుర్తించలేదా?"

"జ్ఞాపకం లేదు."

"మీరు సదానందం అవునా?"

"ఆ..."

"అయితే నేను పొరపడలేదు. నా పేరు యస్. సుందర్. విశాఖపట్నంలో కలిసి చదువుకున్నాం జ్ఞాపకంవుందా. విశాఖలో చదివే రోజుల్లో సుందర్ అనేవాడొకడుండేవాడు జ్ఞాపకం వుందాండీ సదానందం మహాశయా" యుక్తిగా, వ్యంగ్యంగా అన్నాడు సుందర్.

"ఓరి నువ్వటోయ్. ఎప్పుడొచ్చావ్? బావున్నావా! చాలా మారిపోయావురా సుందర్."

"ఆ బాగానే వున్నట్లే!"

"ఎక్కడ వుండడం? ఏమిటి విశేషాలు?"

"ఇక్కడే!"

"ఆమధ్య హాస్పటల్‌లో వేశారని విన్నాను!"

"ఆ అవును. ఆ సత్యవతికోసం బుర్ర చెడగొట్టుకున్నాను. పిచ్చెక్కిందని హాస్పిటల్‌లో వేశారట. ఇంతవరకూ అలా బలహీనంగానే వుంటోంది. అనారోగ్యంవల్లనే పరీక్ష పోయింది. ఇంక చదివే అవకాశం, ఆర్థిక స్తోమత, ఓపిక ఏవీలేవు. అందుకే మానేశాను. ఆ ఆలోచనే రావటంలేదు."

"మరి ఇప్పుడేంచేస్తున్నావ్? ఏమైనా ఉద్యోగమా?" అడిగాడు సదానందం.

"మొన్న మొన్నటివరకు ఏవో ట్యూషన్లు చెప్పుకుంటుండేవాణ్ని. ఇపుడు అవీలేవు."

తర్వాత సదానందం తన చరిత్ర చెప్పుకున్నాడు.

"నాకు ఈమధ్య ఆరోగ్యం అంత బావుండటంలేదు. ఆ మందులు ఈమందులు తీసుకుంటూనేవున్నాను."

"కవిత్వం రాసేవాడివి. ఇంకా ఆ జాడ్యం వొదల్లేదా ?"

"ఆ జాడ్యమే ఇప్పుడు నాలుగుడబ్బులు సంపాదించడానికి ఆస్కారం అయింది. ఇక్కడే ఓ పేపరులో సబ్_ఎడిటర్‌గా వుంటున్నాను. జర్నలిస్టునోయ్...ఒకవిధంగా పరిస్థితి బాగానే వుంది."

సదానందాన్ని చూస్తే సుందరానికి ఆశ్చర్యంవేసింది. "కోకిలా, ప్రేయసీ" అంటూ విలపించే సదానందానికేనా జర్నలిస్టు ఉద్యోగం అయింది. కట్టుకున్న బట్టలు, తాగుతున్న గోల్డు ఫ్లేక్ సిగరెట్ టిన్నుచూస్తే పరిస్థితి పైలాపచ్చీసులాగానే వున్నట్లుంది. సంఘంలో, సభ్యప్రపంచంలో పెద్దమనిషిగా, మర్యాదస్తుడుగా చెలామణీఅవుతున్నాడు. ఇదివరకు సన్నగా, పొడుపారుగా, అల్లరిగా వుండేవాడు. ఇప్పుడో ఇంత లావై పోయినాడు. పైగా బట్టతల అయింది. నడకలో ఎంతో నిండుతనం, హుందాతనం కనిపిస్తున్నాయి. మాటల్లో, నడకలో గర్వం, ఠీవి అగుపిస్తున్నాయికూడా. జర్నలిస్టుగా మారిన సదానందం జీవితవైఖరే మారిందనవచ్చు. మహావున్నా అతనికి ముప్పయిఏళ్లకు మించి వుండవు.

"అయితే ఎక్కడికి వెళుతున్నావు సుందర్" అడిగాడు సదానందం.

"ఫలానా అనిలేదు. నిద్ర ముంచుకువచ్చే సమయానికి రూంకి చేరుకుంటా. ఈలోగా ఇలా షికారు."

"ఒంటరిగానే వుంటున్నావన్నమాట ?"

"ఒంటరిగా వుండటమే దుర్భరంగావుంటే జంటకోసం ఆరాటం ఎందుకుంటుంది బ్రదర్."

"అయితే నడు పోదాం" అన్నాడు సదానందం. సుందరం వెంట నడిచాడు మంత్రముగ్ధునిలా.

"అలావెళ్ళి బేకరీలో టీతాగి పోదాం. నాకు ఇంకొంచెం డ్యూటీవుంది. పేపరు వచ్చిందాకా వుండాలి."

"రాత్రంతా ఇలాగే వుండాలా మేల్కొని."

"ఆహా ! బయటకువచ్చేసరికి తెల్లవారుజామున నాలుగున్నర అవుతుంది" అన్నాడు సదానందం.

బేకరీలో టీ తాగుతూ అడిగాడు:

"మరేమైనా ఉద్యోగం ప్రయత్నం చేయకపోయావ్. ఈ ట్యూషన్లు నమ్ముకుని ఎంతకాలంబ్రతకటం సీజను టికెట్టులాగా."

"అదే ఆలోచిస్తున్నాను సదానందం. బ్రతకటమే కష్టమైపోతోంది. చేతిలో కానీలేదు. తెల్లవారితే కాఫీకి, భోజనానికి ఎలాగా అని చింత, ఆలోచన. అసలు తెల్లవారకుండావుంటే ఎంత బావుణ్ను అనిపిస్తోంది."

"బావుందిరా సుందర్. నీచేతిలో డబ్బులేదని తెల్లవారకుండా వుంటుందా పిచ్చివాడా."

సుందరం తన వెర్రికి తానే నవ్వుకున్నాడు.

"ఏంచేయమంటావ్. ఏదైనా ఉద్యోగం చేయాలంటే, అడగాలంటే ఎవరూ సరిగా తెలియదు. అప్లికేషన్లకు ఉద్యోగాలు దొరకవుగదా! ఎవరూ 'నా' అనేవాళ్లు లేనివాణ్ని. అదే పెద్దలోపం అయింది."

సదానందం ఆపాదమస్తకం ఓసారి సుందరాన్ని కలయ చూచాడు. తలవంచుకుని టీ సిప్ చేస్తూ అడిగాడు. "అవును సుందరం. ఈరోజుల్లో అదొక గొడవైపోయింది. ఒక మినిస్టర్ కావటం తేలికేమోగానీ, డెబ్భయిరూపాయల గుమస్తా ఉద్యోగం దొరకటమంటే ప్రళయంలావుంది. అయినా దేనికైనా చొరవ కావాలి. పరిస్థితుల్ని నీకు అనుకూలంగా మార్చుకుని జీవితాన్ని లొంగదీసుకోవాలి. అలాచేసుకోలేవూ నీ ట్యూటర్ ఉద్యోగమే నీకు మహాప్రసాదం."

"ప్రయత్నించలేదంటావా సదానందం. ఎన్నిప్రయత్నాలు చేశానని. ఏదీ ఫలించలేదు కర్మ. ఇప్పుడు మిగిలిందల్లా ఒక్కటే. కృష్ణలో దూకటం ఆత్మహత్య చేసుకోవటం. అదీ ప్రయత్నించాను ఈ పూట. కానీ అంత ధైర్యంలేకపోయింది. అలాంటి విషయాల్లో మనకంటే ఆడవాళ్ళే నయం. అందుకే ఓడిపోయిన వాడిలా తిరిగివస్తున్నా" అన్నాడు సుందరం దిగాలుపడి.

"హుఁ అచ్చంగా అసమర్థునిలా మాట్లాడావు మిష్టర్. అలాంటి వెర్రిమొర్రివేషాలువేస్తే, పిచ్చిచేష్టలుచేస్తే ఈరోజుల్లో

హర్షించేవారెవరూలేరు. సత్యాగ్రహానికి ఎంత విలువున్నదో ఆత్మహత్యకూ అంతేవున్నది. ఇపుడు ఎవరూ దయతలచరు సరిగదా 'అయ్యో పాపం!' అనికూడా అనరు. ఏపనైనాచెయ్యి, ఏ ఉద్యోగమైనా చెయ్యి, నెలకు వందపైగా సంపాదించి మనిషిలా బ్రతకటం కావాలి. అది చేయలేనినాడు నీవు అసమర్థుడివి. లోకం నిన్ను గుర్తించకపోగా అవమానిస్తుంది. నీ ప్రయోజకత్వం ఎవరూ శ్లాఘించరు. కూటికీ గుడ్డకూ కొరగాని ప్రయోజకత్వం వుండేం, లేకేం. సమాజంతోపాటు, నాగరికతతో పాటు ముందుకుసాగని మనుషులు మనుషులేకాదు. హోటలులో కాఫీ అందించినా బ్రతుకే- కాదనం. కానీ నిజాయితీ కావాలి."

ఓ క్షణం ఆగి అడిగాడు సదానందం.

"డిగ్రీ లేదుకదూ?"

"లేదు. పరీక్షకు కూచోలేదు."

"పోనీ ఫరవాలేదు. డిగ్రీలేనంతమాత్రాన కొంపమునిగింది లేదు. డిగ్రీవుంటే నీకు దక్కేది గుమాస్తాగిరే. లేకుంటే మినిస్టరువు కావచ్చు. అందుకే డిగ్రీలేదనే శంక చించిపారేయ్"

"సదానందం దృష్టిలో గడ్డిపోచలావుంది" అనుకున్నాడు సుందరం. సమాజంపట్ల, వ్యక్తులపట్ల, వ్యవస్థపట్ల ఎంతటి నిర్లక్ష్యం.

"నాకు టైం అవుతోంది నడుద్దామా?" అన్నాడు.

సదానందం వెన్నంటినడిచాడు సుందరం.

## 3

పత్రిక ఆఫీసు ఎలావుంటుందో అంతవరకు ఎరగడు సుందరం. ఏవో రోజూ పేపరు అంటూ వస్తుంది. ఏ లైబ్రరీలోనో, కాఫీ హోటల్లోనో కూచుని చదువుతాడు. కానీ అది తయారయ్యే కర్మశాల, ఘర్మజలశాల ఎలావుంటుందో ఎరగడు. అందులో వారి కష్టనిష్ఠురాలెలాంటివో ఎరగడు సుందరం అనేకమందిలాగానే.

సదానందం ముందుకునడుస్తుంటే, వెనకనే ఆయనతో పేపరు ఆఫీసులో అడుగిడటం ఒక కొత్త అనుభవం, అనుభూతి అయిందతనికి. గేటుదాటుతూండగానే, గేటు జవానుదగ్గరనుండి ఎదురైన ప్రతివొక్కరూ సదానందానికి నమస్కారం చేసేవారే. అదేదో కొత్త ప్రపంచంలో అడుగిడరానిచోట అడుగుపెడుతున్నట్లు లోపల బాధపడ్డాడు.

"రా సుందరం...అలా కూర్చో" అని లోపలకు ఆహ్వానించి ఓ కుర్చీ చూపించాడు.

అదేదో మరోప్రపంచంలాగా వున్నది. బారుగాఉన్న బల్లకిరువైపులా పదిమంది కూర్చొని వొంచినతల కూడా ఎత్తకుండా వ్రాసుకుంటున్నారు. యంత్రాలు జ్ఞాపకం వచ్చాయి వారిని చూస్తుంటే, సుందరానికి సిగ్గేసింది. ఇంత తీక్షణంగా మనుషులు

పని చేయడం అతనెరగడు. నిజంగా యంత్రంలో చక్రాలకు వీరికి తేడాఏమిటి? నిమిషాలమీద పని జరిగిపోతోంది. వ్రాస్తున్న కాగితాలు ఒక్కొక్కటే అచ్చుకు వెళ్ళిపోతున్నాయి. అవన్నీ కలిసి మరో కొన్నిగంటల్లో పేపరుగా తయారవుతుంది. కొన్ని వేలమంది ఆత్రంగా చదువుకుంటారు. అన్నివేలమంది, లక్షల మందికోసం ఈ పదిమంది అహోరాత్రులు కష్టపడటం_ తన తెలివితక్కువతనానికి సిగ్గేసింది. పైగా తనంత బద్ధకస్తుడు లోకంలో వుంటాడా అనిపించిందికూడా. "వీళ్ళకు కాగితాలు, సిరాలు అందిస్తున్నా జీవితం ధన్యం అవుతుంది" అనుకున్నాడు.

"కూర్చో సుందరం వస్తాను అయిదునిమిషాల్లో" అని చెప్పి సదానందం మాయమైనాడు.

సుందరానికి నిజంగా ఏమీ పాలుపోలేదు. అక్కడి వ్యక్తుల్ని గడియారాలతో పోల్చుకున్నాడు. యంత్రం చెడిపోతే తప్ప గడియారం ఆగిపోదు. వీరూ అంతే. నిమిషాలతో, క్షణాలతో పోటీపడి కలాల్ని పరుగెత్తిస్తున్నారు. ఎవరెవరో వస్తున్నారు పోతున్నారు. ఎవరూ కొత్తవార్నిగురించి పట్టించుకోటంలేదు. తమ పనేమో! తామేమో!

వీరిలో చాలామందిని తాను ఎక్కడోచూచాడు. అవును వారు సామాన్యులే ఒకరకంగా. బజారుల్లో తిరుగుతారు. హోటల్లో తారసపడతారు. అయితే ఫలానా అని తెలియనపుడు గుర్తించడం కష్టం. గుర్తించినపుడు ఫలానా అని తెలిస్తే ఆరాధన కలుగుతుంది.

సదానందం తిరిగి వచ్చాడు. సుందరం ఈ ప్రపంచంలో పడ్డాడు. కుర్చీలో ఓ ప్రక్కగా ఒదిగ కూర్చున్నాడు. అతనంటే అపూర్వమైన ఆరాధన, భక్తి, ప్రేమ కలుగుతున్నాయి ఆ క్షణంలో.

"సుందరం నీవుకూడా మా పేపర్లో చేరకూడదూ?" అడిగాడు సదానందం సిగరెట్ ఒకటి వెలిగించి, ఒకటి సుందర్ కి అందిస్తూ:

సుందరానికి నిజంగానే ముచ్చెమటలు పోసినయ్. నోట మాటరాలేదు. బజార్ల వెంట గాలిగా తిరుగుతూ, గాలిలో తేలి పోతున్నట్లు తోచింది. మరోక్షణంలో యంత్రంలో బిగించిన ఒక సీలలా బిగుసుకుపోయాడు సుందరం.

"రాయటం అలవాటులేదు" అన్నాడు ప్రయత్నించి బాధగా. . బడిలో పిల్లలు, పుస్తకాలు జ్ఞాపకం వచ్చాయి. మొఖం నల్లబల్లగా మారింది.

"ఏరేం ఫరవాలేదు. ప్రయత్నిస్తే సాధించలేని దేంవుం టుంది. ఇక్కడ వున్నవారంతా మహాకవులు, మహా రచయితలు కారులే... తెలుగు బాగా రాయటం, ఇంగ్లీషు చదివి అర్థం చేసుకోవటం వస్తే, అదృష్టం నరిస్తే చాలు. అయితే కొంచెం పత్రికా జ్ఞానం, భాష కావాలి. ఏమంటావ్. ఇష్టమైతే ఎడిటర్ కి రికమెండ్ చేస్తాను" అన్నాడు.

"ఇష్టానికేం ఇష్టమే. కాని. . ."

"అయితే రేపొకసారి కలువు. ఎడిటర్‌గారు చాలా మంచివారు. నే చెపితే కాదనరు."

"కానీ !"

"జీతం విషయం నేను ఏర్పాటు చేస్తాగా... ఇదిగో ఈ పాతిక చేతిలోవుంచు తర్వాత చూచుకుందాం... కొంచెం మంచిబట్టలు వేసుకొని రేపురా.. తప్పకుండా ఉదయమే ఓ సారి కలువు" అని పంపేశాడు...

4

తెల్లవారిన దగ్గరనుండి సుందరం మనసులో ఆత్రుత ఎక్కువైంది. పదిగంటలకల్లా వెళ్లి సదానందాన్ని కలుసుకోవాలి. ఈలోగా...

ఈలోగా ఆవిషయం రజనిచెవిలో వేయాలనిపించింది. తన సంతోషం రజనితో పంచుకుంటే అదొక సంతృప్తి. రజ. అంటే సుందరంకి అదొకవిధమైన అనురాగం. సూర్యారాని పేటలో ఒకచిన్న డాబాలో వుంటుంది ఆమె తల్లి సహాయంగా ఇంటర్ వరకు చదివింది.

మనసు ఉరకలెత్తగా, పరుగు పరుగునే వెళ్లాడు. సుందరం వెళ్లేసరికి రజని ఈజీచైర్‌లో కూర్చుని ఏదో పత్రిక చదువు కుంటోంది. అడుగులసవ్వడి విని తలెత్తి చూచింది. ఒక్కసారి ముఖంపై సంతోషరేఖలు తొందరించగా లేచినిలబడ్డది. ఆహ్వాన పూర్వకమైన చిరునవ్వే చిలకరించింది. మాగజైను ప్రక్కనేపెట్టి ఎదురునడిచింది.

సుందరంఅంటే రజనికి అదొక రకమైన మోజు. ఇంటరు పరీక్షకు చదువుతున్న రజనికి అతనుట్యూషన్ చెప్పాడు. ఆమెకు తండ్రి, బంధువులు అంతగాలేని కారణంగా తల్లి, రజని ఇద్దరూ సుందరాన్ని అభిమానించేరు. ఆపరిచయం, అభిమానం ఇద్దరిమధ్యా పరీక్షలైనా, ఆమె పాసయినా అతను రావడం మానుకోలేదు. ఆమెవొద్దనీ అనలేదు. పైగా రావాలనీ, అతను కావాలనీ ఆరాట పడుతుంది.

"నీవంటే నాకు అనురాగం, ప్రేమ... అందుకే నీకోసం, నిన్ను చూడాలని వస్తున్నా" అని అతనూ అనడు. అది ప్రేమ అవునో కాదో అతను నిర్ధారించుకోలేదు ఇంతవరకు. ఏదో ఉబుసుపోకకు వస్తాడు. రజనిని చూడాలనీ, ఆమెతో భాషించాలని అనిపిస్తుంది. మనసు తహతహలాడుతుంది. చూడకుండా వుండ లేక పోతాడు కొన్ని పరిస్థితుల్లో... అప్పుడు రెక్కలుకట్టుకొని వచ్చి వాలతాడు.

"ఎందుకు వస్తున్నార"ని రజనీ అడగదు. తనకోసం అతను రావటమే ఆమెకు సంతృప్తి. రాకుండావుంటే తహతహలాడు తుంది. ఏమైనారో, ఎందుకురాలేదో అని బాధపడుతుంది. వస్తే పండుగ చేసుకొంటుంది మనసులో వయసులోని రజని. కొన్ని రోజులు వరసాగా రాకపోతే ఏమీ తోచదుకూడా.

"ఏం మాస్టారూ! చాలా వుషారుగా వున్నారు" అడి గింది అమ్మవచ్చి అందించిన కాఫీకప్పు చేతికిస్తూ.... తానూ చప్పరిస్తూ....

"ఎప్పుడూ ఈకాఫీ చప్పరించటమేనా రజనీ. . .ఇంకేమీ ప్రోగ్రెస్ లేదా!" అన్నాడు రసికత్వం తొణికిసలాడేలాగు.

ఆ సుతారపు చూపుకే రజని బుగ్గల గులాబీలు విరబూసినయ్. మనిషి మల్లెమొగ్గ అయింది.

"కాక మరేం కావాలంటారు?" అన్నది చిలిపిగా సినిమా నటిగా.... అనగూడదనుకొంటూనే.

"సాకీ.... మధుపాత్రా!"

"అబ్బ . . . ఎంత ఆశ . . ." కిల కిలమన్నది. కోకిలలు కూసినవి. ఆ అదృష్టానికే నిజంగా ఎదురుచూస్తోంది. ఆమధుర క్షణాలకోసమే కలలు కంటున్నాడు సుందరం కూడా.

"నాకు ఉద్యోగం అయింది అల్లరిపిల్లా!" అన్నాడు కనుకొలకుల్లోకి కొంటెగా ఒంటెగా చూస్తూ.

"అదృష్టవంతులం. అంతకన్నా కావలసింది ఏముంది మాష్టారూ. అందుకేగా కళ్లు కాయలుకాచేలాఎదురుచూడటం?"

'అంతేనంటావా?'

"అవునుకానీండి. మరి ఇంత సంతోషవార్త అయితే తెచ్చారుగానీ. ప్రజెంటు ఏం తెచ్చారు" అడిగింది, నిజంగానే అల్లరిపిల్ల అయింది.

"నిజంగా కావాలా?"

"ఇస్తే వద్దంటానా మాష్టారూ"

"అయితే రా ఇస్తా" అని లేచిదగ్గరగా వెళ్లాడు. వెళ్లి అటు ఇటు ఎవరూ లేరుగదాఅని నిర్ధారించు కొన్నాడు. అమాంతం కౌగిల్లోకి తీసుకొని బుగ్గమీద ముద్దుపెట్టుకొన్నాడు.

"ఛీ. వుండండి. ఎవరైనా చూస్తే"

"ఓ స్. చూస్తేగదా అభ్యంతరం... గ్యారంటీగా ఎవరూ చూడలేదు."

"ఉండండి, సిగ్గేస్తోంది...."

"ఆడపిల్లలకు సిగ్గేమిటి?"

"కాక మీకా?"

"నేనంటే యిష్టంలేదా రజనీ........"

"మరీ పసిపిల్లవాడిలా మాట్లడకండి ఎవరైనా వింటే నవ్విపోతారు?"

"సీ అంత బాగా నవ్వగలరా ఎవరైనా"

దూరంగా వెళ్లి కుర్చీలో కూర్చున్నది...ఒదిగి.... తనకుర్చీని దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు సుందర్. రజని కూడా ఒళ్లంతా పూలుతొడుక్కొని కబుర్లాడడం ప్రారంభించింది. ప్రతి మాటకు చిలిపిగానవ్వడం ప్రతినవ్వుతో వాలు చూపు విసరడం....మనసును మత్తెక్కించడం...నిజానికి సుందర్ ఏంచేసినా ఆమెకు అభ్యంతరం లేదు. అతన్ని పెళ్లిచేసుకో గలిగితే ఈజన్మ చరితార్థమైనట్లే భావిస్తోందికూడా".

"మాస్టారూ! ఇకనైనా రూంమార్చకూడదూ" అడొకలా నవ్వాడు సుందరం.

"ఆరోజు వచ్చినవుడు తప్పకుండా మారుస్తాను రజనీ"

"మా మీద నమ్మకంలేదా?"

"లేక కాదు. మరీఎక్కువగావుంది ... అదే చిక్కు".

"సరేలెండి, మీదయ"

"రజనీ ... నీవు ఎప్పటికైనా నాదానివేసుమా..... కొంచెంస్థిమితం చిక్కగానే తప్పకుండా మనం పెళ్లిచేసుకుందాం. నిన్నుకాదని మరొకర్ని ఈ జన్మలో చేసుకోను తెలుసా?

సంతృప్తిగా అతన్ని చూచి కళ్లుదించుకుంది రజని. కనుకొలకుల్లోంచి జారిన నీటి బిందువుల్ని సుందర్ గమనించనే లేదు.

"వస్తా రజనీ .....సాయంత్రం వస్తాలే" అంటూ బయల్దేరాడు.

5

తొమ్మిది కావస్తోంది. ఒకసారి సదానందాన్ని కలుసుకోవాలి. సదానందం అంటే నిన్నటి ఆత్మీయత ఈరోజు లేదు. నిన్న మిత్రుడుగా వున్నాడు. ఈరోజు ఒక పెద్దఅధికారిగా అవుపిస్తున్నాడు అతన్ని చూస్తే వినయ విధేయతలు అభినయించవలసివస్తోంది. మిత్రునిలా పలకరించడానికి అవకాశం లేదు. ముందు ప్రవేశించగానే నమస్కారం చేయాలి. కూర్చోమనే వరకూ నిలబడి విధేయత చూపించాలి. ఎంతైనా [illegible]యినా, తనకు ఉద్యోగం యిప్పించనున్న మహాపురుషుడు.

సదానందం ఇల్లు సమీపిస్తున్నకొద్దీ సుందరానికి కాళ్లు పట్టు తప్పుతున్నట్లనిపించింది. ఒక ప్రక్క ఆనందం ఉరకలు వేసి, కట్లు తెంచుకొంటూంది. సాధ్యమైనంతలో బాగా డ్రెస్ చేసుకొన్నాడు. నీటుగా టక్ చేసుకొన్నాడు. కొన్ని నెలలుగా, ఇంత బాగా డ్రెస్ చేసుకోలేదు, తను కాలేజీ వదిలాక టక్ చేయలేదు ఎప్పుడూ అవసరంకూడా కలగలేదు నిజానికి, బూట్లు నున్నగా పాలిష్ చేసుకున్నాడేమో ధగ ధగ మెరుస్తున్నాయి. లోపల భయంవల్ల, బాగా చెమటపట్టేస్తోంది. అయినా మరొక ప్రక్క ఆశ .... ఉత్సాహం.... సంతోషం

మేడమెట్లు ఎక్కుతూవుంటే గుండెవేగంగా, టక టక లాడింది. లోపల కుత కుతకగావున్నది. ఏదో కలవరం. వెనక ఒక సారి ఇలాంటిస్థియే యూనివర్సిటీలో ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్లిన పుడు ఏర్పడ్డది. ఎందుకో కారణం తెలీదు. కాళ్లలో వణుకు నరాలబాధ.

తనలో తనే గొణుక్కున్నాడు. స్టేజీమీదికి వెళ్లబోయే నటుడు తన పోర్షన్ భాగాన్ని పునశ్చరణ చేసుకుంటో, లో లోపల గొణుక్కునే ధోరణిలో ఏలా ప్రవర్తించాలి, అడిగేప్రశ్న లకు ఎలా సమాధానం చెప్పాలి. అని రిహార్సల్ వేసుకుంటు న్నాడు. కదలకుండా కూర్చోవాలి, అంత సీరియస్‌గా మొఖం పెట్టకూడదు. పైగా 'నువ్వునాకు తెలిసిన సదానందానివేగా అన్నట్లు తన ప్రవర్తన వుండకూడదు. నవ్వొచ్చినా, అణచు కొని చిన్నగా నవ్వాలిగాని, వెకిలిగా నవ్వకూడదు. ఏమన్నా తనకు అంగీకారం అన్నట్లుగానే మాట్లాడాలి. సదానందం తన వాడే. అయినా ఇప్పుడో అతనిహోదా వేరు. అతనే దేవుడు తనపాలిట. సదానందమే నిన్నటిరోజు తటస్థపడకపోతే ఈ రోజు తను ఏమిటి? తనస్థితి ఏమిటి? అనుకొని విచారించాడుకూడా ఆక్షణంలో.

దర్వాజా దగ్గరగావెళ్లి నిలబడ్డాడు. నీలి తెరలవెనక ఏమి వున్నదీ స్పష్టంగా అగుపించటంలేదు. గొంతు తడారిపోతున్నదా అనిపిస్తోంది. జీవితంలో ఒక కొత్త అనుభూతి, అనుభవం పొంద బోతున్నప్పటి బాధ, ఆనందం. కన్నకలలన్నీ చిత్తరువుల్లా ఎదురు

పడితే కలిగే తొట్రుబాటు అతనిలో ఆక్షణంలో. ధైర్యంచేసే అడుగు ముందుకు వేశాడు. తెర వొత్తిగిలించుకొని చూచాడు.

ఓ స్త్రీమూర్తి నిశ్చలంగా కూర్చునివుంది సోఫాలో. గది అందంగా అలంకరించబడివుంది. నాలుగు సోఫాలూ, మధ్యన ఓచిన్న టీపాయ్. ప్రక్కనే ఎత్తయిన బల్లమీద ఫ్లవర్ వేజ్. రేడియోలోంచి వినిపిస్తున్న సన్నని సరళ సంగీతం. అద్దంలా వున్నది గది. గదికి నాలుగుమూలల్లో పుస్తకాల బీరువాల తెరలు. పత్రికలు అదొక చిన్న స్వర్గం అనిపించింది. చుట్టూ పరికించిన సుందరానికి.

ఆమె అప్పుడే తలంటుకున్నట్లున్నది. గాలికి రేగిపోతోంది అ జుట్టులోంచి ఒకప్రక్కగా అవుపించే తెల్లనిముఖం చంద్ర బింబంలావుంది, నవ్వే పెదాలు, బహుశా సదానందం భార్య అయి వుంటుంది. అనుకున్నా నమ్మలేకపోతున్నాడు. అతనిసతి ఇంతచక్కని అపురూప లావణ్యవతి అనుకున్నాడనటం లేదు. విశ్వాసం అంతకన్నా కలగడంలేదు. తనభావన నిజంకాదేమో సదానందం ఏమిటి ఇంతచక్కని కుందనపు బొమ్మను భార్యగా పొందటం ఏమిటి? అనుమానం. అది దుర్లభమైన విషయం అన్న అనాలోచన. అదీ ఆమెను చూడగానే స్ఫురణ.

"సదానందం!" అని పిలిచాడు.

ఆమె తలెత్తి ఓరగా దోరగా చూచింది. గోముగాలేచి నిలబడ్డది.

"నమస్కారం మీరేకదూ సుందరం!"

"అవునండీ" అన్నాడు తలగూడా అనుగుణంగా ఊపుతూ.

"రండి, కూర్చోండి. ఇందాక మీగురించి చెప్పారు. చాలా సంతోషం. మీకు వారి ఆఫీసులో ఉద్యోగం అయిందటగా— వారికె మిత్రులని చెప్పారు"

"ఇంకా కాలేదు. అవుతుందనే ఆశ" అని అందామని నోటిదాకా వచ్చి అనలేకపోయాడు. తనచెవులనే తను నమ్మలేక పోతున్నాడు. కళ్లకు పని ఎక్కువ కావడంతో, నోటిమాట పెగలటం లేదు. సౌందర్య దాహం, కళ్ళతో ఎంతతాగినా తనివి తీరిందికాదు.

కుర్చీలో కూర్చున్నాడేగానీ, ఏమీ తోచడంలేదు. ఎంతకీ సదానందం రాడు తనను ఆపదనుండి కాపాడడానికి. ఆర్తత్రాణ పరాయణుడిలా. నారాయణుడిలా ఆమె సోఫాలో వెనక్కువాలి సుతారంగా కూర్చోంది. కాశ్మీర్‌చీర ఒంటిమీద వుండనని నమ్మకంచేస్తోంది మాటిమాటికీ జారిపోతూ. "అబ్బ; ఆమెడ క్రిందపెట్టాడు భగవంతుడు అందమంతా" అనుకున్నాడు. కానీ అక్కడ చూడటం ఇబ్బందిగావుంది. ఆమె తనకు కొత్తకావటం వల్ల, అలా ఎగబడిచూస్తే సభ్యత చెరిగిపోతుంది. సంస్కారం తెలివితప్పుతుంది.

అదేదో తనకు తెలియని కొత్తజీవితానికి దివ్యభవనానికి మొదటి తలుపులు తెరుచుకున్నట్లు భావనకలిగింది. అక్కడ వీచే మలయానిలం కొద్ది కొద్దిగా హృదయానికి తాకినేద తీరుస్తోంది. తావుల గుబాళింపు నరాల్ని తాకుతోంది.

తలెత్తి చూచాడు. ఆమె తననేపే చూస్తోంది.

సుందరం అలాగలయెత్తి చూచినపుడు కాశ్మీర్ చీరలో దాగిన సౌందర్యం సిగ్గుతో మల్లెమొగ్గలా పులకరించింది. ఆచంద నపు బొమ్మ కుందనపుబొమ్మ అయింది. కుంచించుకుపోయింది. తెల్లగా, పాలమీగడలావున్న శరీరాన్ని కృత్రిమ వస్త్రాలు కప్ప లేకపోతున్నాయి. అందాన్ని మరుగుపరచలేక పోతున్నాయనే చెప్పాలి. అందంఅనేది అణచిపెడితే, దాచిపెడితే దాగనిది అని ఆమెనుచూస్తే ఇట్టే రుజువవుతుంది. ఆమెనుచూస్తుంటే ఏవేవో కోర్కెలు, అసహజంగానే కలుగుతున్నాయి. ఓ యువతినిచూస్తే వొళ్లు పులకరిస్తుంది. కోర్కెలు వాంఛలు గుబాళించి, పరిమ రాలు వెదజల్లుతాయి. సాజం. ఆమెను చూచినపుడు అలా చెల రేగిన కోర్కెల గుర్రాలస్వారి అసహజం కాదేమోననిపించింది. అలాంటి కోర్కెలు కలగటం తప్పుకాదు, పాపం కాదు. పాపమే అయితే ఆకోర్కెలు కలగకుండానే వుండాలి. మనస్సు వైకల్యం చెందకుండానే వుండాలి. కారణం తెలీదు ఆకర్షణకి. "రజని. ఈమె కళ్ళలోవున్న తేజస్సు రజనిలోలేదు. ఈశరీరం వొంపులు, వయారం, విన్నాణం రజనికి లేవు. ఈ ఆకర్షణ, పవిత్రత వేయి వొత్తులు పెట్టి వెతికినా రజనిలో దొరకదు. రజని. రజని... అనాకారి, అనాకర్షణి.... అనాఘ్రతమేకావొచ్చు. కానీ ఈమె వికసిత కుసుమం. గుబాళిస్తున్న పరిమళం. మత్తెక్కించే సౌందర్య జ్యోత్స్న.... పిచ్చివాణ్ణిగా మార్చేయగల వాలు చూపు— అహా! వరూధినీ! నీవు నిజంగా అందాలరాశివే

అయివుండాలి. ఓహో హెలెన్ నీసౌందర్యం యుగయుగాలకు ఆరాధనీయమే." అనుకున్నాడు. ఆ పెదాల సంపెంగలు, ఆ చెక్కిళ్ళ గులాబులు, చాలదూ! అందుకే సదానందం కవి కాగలిగాడు.

అందుకే అతగాడి కవిత్వం రాణిస్తోంది. అందుకే "స్త్రీ మత్తెక్కించే మధు కలశం" అన్నాడు.

"మీరు ఇక్కడే వుంటున్నారా!" అన్నది అతని ఆలోచనలను త్రుంచివేస్తో.

ఒక్కసారిగా కలల బరువుకు కుర్చీలోకి దించుకుపోయిన సుందరం తనకుతానే సంబాళించుకొని ఈ లోకంలో పడ్డాడు.

"ఆఁ కొద్దినెలలుగా ఇక్కడే వుంటున్నాను. ఏవో ట్యూషన్లు చెప్పుకుంటూ బ్రతుకుతున్నాను. మీదయవల్ల ఉద్యోగం అయింది."

ఆమె నిగర్వంగా నవ్వింది. ఆ నవ్వులోంచి మల్లెపూల గంప బోర్లా దొర్లినట్లయింది. నందనవనంలోని దేవమందారాల్ని పాదాలమీద క్రుమ్మరించినట్లయింది.

"అవునవును." అన్నది అలవోకగా.

ఎవరో మేడమెట్లు ఎక్కుతున్న చప్పుడైంది. మరో క్షణంలో ఒకామె ప్రవేశించింది.

"హలో లీలా!"

'ఓహ్. శకూ, నీవా. కమిన్ ... కమిన్ ' అంటూ సోఫాలోంచి లేచి ఎదురువెళ్ళి ఆహ్వానించింది.

ఆవచ్చినామె సుందర్ని చూచి గతుక్కుమన్నది. కొత్త వ్యక్తి, అందులో పురుషుడు . .

'సారీ లీలా' నువ్వేదో బిజీగావున్నావు. ఒక్కర్తివే వున్నావనుకొని వచ్చాను. యక్స్‌క్యూజ్ మీ" అన్నది

"మరేంఫరవాలేదు లే శకూ. అంటోంది."

శకూ! శకుంతలకానోపు 'ఎంత అందమైన పేరు. ఆమె కూడా కాళిదాసు సృష్టికి కొత్తవెలుగు ఇస్తున్నట్లుగానేవుంది. పచ్చని పల్చన శరీరం, నల్లని కురుల్లో ముడుచుకొన్న ఒంటి గులాబీ, మెడలో ఒంటిపేట రాళ్ళనెక్లెస్ ధగధగలాడుతూ కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. నడకలో హంసగమనం. ఆకుపచ్చ జార్జెట్ చీర కట్టుకుంది. అంచులు బరువుగావుండి జారిపోతున్నాయి. తలలో ఆ గులాబీని చూస్తే మక్కువైంది సుందరానికి. ఆ చీర సింగారింపు ఫ్రష్ మనసైంది. ఎంత సింపిల్‌గా వున్నదీ శకుంతల అనుకున్నాడు. కణ్వాశ్రమంలో పాదులకు నీరుపెడుతూ, జింక పిల్లల్ని ఆడిస్తో, ఒంటిగా తిరిగే తాపసకన్య శకుంతల. ఇంత కన్నా అందమైందా అనిపించింది. శకుంతల వెనకగా ఒకజ చిన్ని పాప. ఆరేళ్ళది, తెల్లనిగౌను వేసుకుంది.

"గుడ్‌మార్నింగ్ దీ దీ" అన్నది లీలను చూడగానే "హాలో పాపా కమాన్ కమాన్" అంటూ ఎత్తుకొని ముద్దులలో ముంచేసింది లీల. శకుంతల సుతారంగా చూస్తూపోయి రేడియోట్యూను చేసింది. యువకులను చూస్తే యువతులలో కలిగే చలనమే ఆమెలో.

"ఇలారా, శకూ. వీరిని ఇంట్రడ్యూసు చేస్తాను. సదానందంగారి ఫ్రెండు సుందర్ అని, ఆనర్సుదాగా చదివారు. ఈమె మా ఫామిలీ ఫ్రెండు, నా క్లాసుమెంటు. మా ఇద్దరికీకూడా ప్రియమైన వ్యక్తి"

"అదేమిటి లీలా కొత్తాపాతా లేకుండా"

"కాదా? మాకు ప్రియమైనదానివేగదూ! పైగా వారికి నీవంటె ఎంత ప్రేమ, కాదంటావా"?

"అది ఒకనాటి సంగతి. నీవు ఈ నందనోద్యానంలో ప్రవేశించకముందు సంగతి గదా! ఇప్పుడు ఆసింహాసనం నీదేగా చేచేతులా నీకిచ్చేశానుగా"

'నువ్విచ్చేదేమిటి. ఒకపుష్పం చేజారిపోయింది. మరొకదాన్ని వెదుక్కున్నారు. అంతేగదా''

'పోనీ అంతేననుకుందాం. ఇప్పుడెందుకాగొడవ'

''సుందర్‌గారూ! మా శకుంతలంటే అరమరికలు లేని ఆడది అని అర్థం తెలుసా. మహామంచిది. స్నేహమయి. కంపెనీకి బెస్టు''

'అలాగా' అన్నాడు సుందర్ మరేమీ అనలేక; అన దలచినా, అనే ధైర్యంలేక.

అతనికేమీ పాలుపోవడం లేదు. ఈ కంపెనీ ఈ పరిచయాలు గమ్మత్తుగావున్నాయి. ఏదో మత్తుగావుంది కూడా.

అంతలో సదానందం రానేవచ్చాడు.

"ఓహ్! అంతా ఇక్కడేవున్నారే. హాపీడే.... సుందర్ ఆలస్యమైంది క్షమించు. ఆఫీసునుంచి ఫోను వస్తే వెళ్లాను. అన్నట్లు ఎడిటర్‌గారితో నీవిషయం చెప్పాను. వచ్చి జాయిన్ కమ్మన్నారు. ఆఫీసుకి వెళ్లి ఆర్డర్ తీసుకోవచ్చు. అంతా రెడీ అయిపోయింది".

"థాంక్స్. మీ మేలు ఎన్నటికీ మరచిపోను" అన్నాడు సుందర్, కళ్ళు ఆనందంతో నిండిపోగా.

అందరిలో సుందర్ కొంచెం సిగ్గుపడిపోయాడు. ఒదిగి కూర్చున్నాడు. సదానందం, శకుంతల, లీల అందరూ కబుర్లలో పడ్డారు చిరకాల పరిచయస్తులు గనక. శకుంతల రేడియో ఆపి వచ్చి కావాలనే సుందరం కూర్చున్న సోఫాలో కూర్చున్నది. సుందరం శరీరం పులకరించింది. ఎటూచూడబుద్ది కావటంలేదు. ఏమీ మాట్లాడడానికి తోచటంలేదు. మాట్లాడాలన్న ఉత్సాహం, ధైర్యంకూడా లేవు.

'శకూ! ఓపాటపాడకూడదూ' అన్నాడు చొరవగా సదానందం. 'మరీమోనోటనస్‌గావుంది'.

"వారు బాగా పాడతారేమిటి?" అడిగాడు సుందరం

'ఏవోలెండి పిచ్చిపాటలు ఇంతకీ మా పార్టీ ఎప్పుడు? ఉద్యోగం వచ్చిందికదా మరి' అన్నది.

'ఓ. దానికేం. తప్పకుండా'

"శకుంతల బాగా పాడటం, పాడకపోవటం అనేది ఆమెలో వుండదండీ" కల్పించుకొని అన్నది. 'పాట పాడితే, ఆపాటని మెచ్చుకొని, ఆనందించగలిగే హృదయ రసజ్ఞతమీద ఆధారపడివుంటుంది. మీరు నిజంగా సరసులే అయితే ఆమె మిమ్మల్ని రంజింపజేయ గలుగుతుంది. అపుడు మీ దృష్టిలో ఆమెగొప్ప గాయకురాలవుతుంది. అలాగే కథలు, సాహిత్యం అనేవికూడా. ఉదాహరణకుమీరు ఓ పాట వ్రాశారనుకోండి లేదా ఒక కథ, ఓనవల వ్రాశారనుకోండి. దాన్ని నేను చదివి, ఆనందించి, నీ కథలోని పాత్రలతో తాదాత్మ్యం పొందగలిగితే, దాన్ని నేను సంపూర్ణంగా అనుభవించగలిగితే, నా దృష్టిలో మీరుగొప్ప కథకులు, నవలాకారులు. అలా మరొకరి దృష్టికి కాకపోవచ్చు. అలాగే చిత్రకళ. మీకు పిచ్చిగీతలుగా అవు పించే ఒక చిత్రంలో నాకు ఎన్నో అనుభూతులు కల్గవచ్చు. అందులోనాకు కళారాధన, తపస్సు ద్యోతకంకావచ్చు. అలా అది మరొకరికి అవుపించక పోవచ్చు. కొందరి హృదయాలు ఏ అనుభూతాలు పొందకపోవచ్చు. ఆ చిత్రం మీలో ఎలాంటి వికారాన్ని కల్గించకపోవచ్చు. అంతమాత్రాన ఆ చిత్తరువు మంచిదికాదని చెప్పడం శుద్ధ తెలివితక్కువ అవుతుంది. అలాగే

మా శకూపాట ఆమెపాట కిన్నెరుల్ని, గంధర్వుల్ని మరి పించక పోవచ్చు. ఆమె లతామంగేష్కర్‌ని తలదన్నకపోవచ్చు కానీ ఆమెపాట మనుష్యుల్ని తన్మయుల్ని చేస్తుంది. మిమ్మల్ని చేయవచ్చనే నా అభిప్రాయం. ఏమంటారు?" అన్నది సుందరం వైపు ప్రశ్నార్థకంగాచూస్తూ....

సదానందం కల్పించుకుని అన్నాడు. "లీల అభిప్రా యాలు కాదనే ధైర్యం ఈ తెలుగు దేశంలో ఎవరికీ లేదు సుందరం! లీలవ్రాసే వ్రాతలు, నవలలు నీవుచదివివుంటే అలా అనవు. ఆమె రచనలు చదివితే అమాంతం కావిలించుకోవాలనీ, ఆరాధించాలని అనిపిస్తుంది ఎలాంటివారికైనా. ఈ దేశంలో రచయితలకు, పిల్లకవులకు లీలఅంటే అమితమైన ప్రేమ. నుంత బద్దలు కొట్టినట్లు సత్యం చెప్పేస్తుంది. "అబ్బే. ఇంత వెకిలి మని షేమా" అనిపిస్తుందికూడా. లోపల అనుకున్న విధంగా, పైకి వ్యక్తంచేయటం, ప్రకటించటం, అలా ప్రకటించగల దమ్ము ఏ తెలుగు రచయితకీ లేదనే చెప్పాలి. అంతసుళువుగా నిజం చెప్పేస్తుంది. ఒప్పేసుకుంటుంది. కనకనే లీలను నేనుప్రేమించ గలిగానేమో! ఆమెను అంతా ప్రేమిస్తారు, ఆరాధిస్తారు. కానీఅర్థం చేసుకోరు. ఆమెలోని సత్యాన్ని ఒప్పుకున్నాను కనకనే నేనంటే లీలకు వాత్సల్యం కలిగిందనుకుంటాను.

"వాత్సల్యమంటే ప్రేమకాదు!" అన్నది శకుంతల. ఆశ్చ ర్యంగా ఇదేదో కొత్త మాట వింటున్నట్లు.

"నిజం శకుంతలా, దాన్ని వాత్సల్యమనే అంటాను నేను. నన్ను దయదలచింది. కనికరించి, వాత్సల్యం చూపింది. అదే మోతాదు మించి అనురాగం అయింది. అంతేగాని"

"అంతేగానీ ప్రేమించలేదంటారు? లీల మిమ్మల్ని ప్రేమించలేదని అంటారు అవునా?"

"లీల ప్రేమించదు, ఆమె ఈలోకంలో ఎవర్నీ ప్రేమించదు సత్యాన్ని తప్ప. నిజంగానే శకుంతలా. . . లీల నన్ను ప్రేమిస్తున్నదని అబద్ధం చెప్పే ధైర్యం నాకు లేదు. ఒక్క లీలే కాదు. చాలా మంది స్త్రీలు పురుషుల్ని ప్రేమించరు నూటికి ఏ ఒక్కరో ఇద్దరో తప్పహా. మిగిలిన వారు, పురుషుల దీనావస్థ చూచి జాలిపడి, కోర్కెలు నెరవేరుస్తుంటారు. అడిగింది కాదనక ఇస్తుంటారు. అదంతా తనమీద ప్రేమవల్లనేనని ఆ పురుషుడు భ్రమ పడుతుంటాడు. . . మా సంబంధం అలాంటిది కాదు. అనురాగ పాశంతో కట్టి, వాత్సల్యంతో ముడివేసి తనవాణ్నిగా చేసుకొన్నది నన్ను . . . ఆమె ఆదరణ అనే అమృత కలశంలో ఒక బిందువు లభించింది నాకు. అదీ లభించనివారు వందలు, వేలు వున్నారు"

పోనీండి, ఏ పేరు పెట్టినా, ఏ పేరుతో పిలిచినా క్రియ ఒక్కటేగదా . . . ఎందుకు వాదన"

"కాదు శకుంతలా! అక్కడే పొరబడుతున్నారంటాను. ప్రతిదీ సరిపెట్టుకోవడం లోకం రివాజైంది. కాని అనుపానులు

తెలుసుకోవడం అనవసరం అని అనుకుంటున్నారు ప్రతివిషయం లోనూ అంతే. మా ఇద్దర్నిచూచి మీరంతా, లోకమంతా భ్రమపడుతున్నది అక్కడే. దీన్ని 'ప్రేమ' అనరు, అనకూడదు కూడా. అంతపెద్ద పవిత్రమైన పదాన్ని మనకు అన్వయించుకో కూడదు కూడా. 'ప్రేమ' అనే పదంచాలాగొప్పది. పరాకాష్ఠ నందుకున్న అనురాగాన్నే ప్రేమఅనాలి. మేమిద్దరం కొన్ని అను భూతుల సారూప్యతవల్ల, కొన్ని అభిమతాల తాదాత్మ్యంవల్ల ఒకటి అయినాం. ఒకగూటిలోచేరాం. 'దిబర్డ్స్ ఆఫ్ ది సేమ్ ఫెదర్' అంటామే అలాంటిది మా సంబంధం.''

ఇంతమాట్లాడుతున్నా, ఇన్ని [illegible]వాదాలు వాద ప్రతివా దాలు జరుగుతున్నా, సుందరం ఏ సందర్భంలోనూ తెగించి 'నా అభిప్రాయం ఇది' అని చెప్పలేదు. వినీ విననట్లుగానే ఊరు కున్నాడు. చూచి చూడనట్లు ప్రక్కనేవున్న శకుంతల కేసిచూడ టం, తన్మయం చెందడం అతనిపని. శకుంతలలో ఓ ప్రత్యేకత వుంది. తానుగా ఏ విషయాన్నీ విమర్శించదు. ఏమాట చెప్పినా ఆలోచించి తూకంగా చెబుతుంది. అదే తనకు నచ్చింది. తనూ అలాగే ప్రవర్తిస్తాడు. సాధారణంగా తన అభిప్రాయాలను వ్యక్తంచేయడు.

''ఏం మరీ పలుకే బంగారమైపోయింది. మాట్లాడకూడ దనుకున్నారా లేక మాట్లాడ తగనివారమనుకున్నారా'' అన్నది సుందరంకేసి చూచి.

అలాంటి మాటకోసమే ఎదురుచూస్తున్నాడు సుందరం. ఆమె తనవేపు తిరగాలని, ఆమెను తనవేపుకు ఆకర్షించుకోవాలనీ

ప్రయత్నం చేయలేదు కానీ, అభిప్రాయపడ్డాడు. శకుంతల ఆ మాట అనగానే పెదాలపై చిరునవ్వు తెచ్చిపెట్టుకొని 'గివ్ దై ఇయర్ బట్ నాట్ దై టంగ్' అన్నారుగా అన్నాడు.

శకుంతల తనలో తనే నవ్వుకున్నది కానీ మరోమాట మాట్లాడలేదు. అందరిలోను సదానందమే ఆనందంగావున్నాడు.

'లీలా ... ఇలారా' అంటూ లోపలకు పిలిచాడు సదానందం. ఈలోపుగా ఎప్పుడు వెళ్లిందో పాప వెళ్లి రేడియో త్రిప్పుతున్నది. అదిమరీ అపభ్రంశంగా రెండు స్టేషన్ల మధ్య పడి కర కర మని నలిగిపోతున్నది.

శకుంతల స్థితీ ఆలాగేవుంది. సదానందం, లీల లోపలకు వెళ్లడంతో, సుందరం ప్రక్కన వుండడం మరీ ఇరుకుగావుంది.

"పాపా, ఇల్లారామ్మా ... అది చెడిపోగలదు" అని పిలిచింది.

వస్తున్న పాపను దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టుకొన్నాడు సుందరం. అనుకోకుండానే అలాచేసినందుకు కాదు కానీ, అలాచేస్తూ శకుంతలవైపు చూచినందుకు. . . ఆమె పెదాలు సిగ్గుతో చలించగా, కొంచెం చలించాడు. పాపం శకుంతల ఏమైనా అనుకున్నదేమో! నిజంగా ఆమె ఏమీ అనుకోరాదనే వాంఛ.

సుందరం ముద్దుపెట్టుకొన్నచోట, బుగ్గనుచేత్తో తుడుచు కొంటూ అమ్మదగ్గరకు వెళ్ళికూర్చుంది బుద్ధివంతురాలుగా పాప. ప్రక్కనే కూర్చున్న పాప తలనిమురుతూ అన్నాడు:

"నీపేరేమిటి పాపా" అంటూ కొంటెగా శకుంతలకేసి చూపు సారించాడు.

"నీకెందుకు? ... చెప్పను" అన్నది పాప బుంగ మూతి చేసుకుని.

"పాపకు సిగ్గు ఎక్కువండీ మగాళ్ళదగ్గర చనువులేదు" అన్నది శకుంతల.

ఆమాటకు గతుక్కు మన్నాడు. చనువులేక పోవడం ఏమిటి?

"వాళ్ళనాన్న దగ్గరకు కూడా వెళ్ళదా" అడిగాడు. శకుంతల తలవంచుకొని నేలచూపులు చూచింది. ఆశించిన సమాధానం రాకపోవడంచే స బుడే అయినాడు సుందరం.

"పాపా, నీపేరేమిటో చెప్పు. అడిగినపుడు చక్కగా చెప్పాలి" అన్నది విషయం మారుస్తూ పాపమీదికి త్రిప్పి.

"ఉహూ, నే చె ను" అని బిగించింది మూతి.

సదానంద ...లనుండి వచ్చాడు. సిగరెట్ పొగ సుతారంగా వదులుతూ ...

"నేను వెళ్ళొస్తానండీ" అన్నాడు సుందరం, "ఏవోయ్ సదానందం" అనే ధైర్యం, సాహసం లేవిపుడు.

"ఎప్పుడన్నా వస్తూవుండు సుందరం ... ఆఫీసుగొడవలో మునిగిపోతున్నానని చెప్పక" అన్నాడు సదానందం.

"అలాగే నండీ."

వెళిపోతున్న సుందరం వీపుమీద శకుంతల చూపులు గ్రుచ్చుకున్నాయి. వెనుతిరిగి చూచాడు.

"మళ్లీ ఎప్పుడు కలుస్తామో అన్నంత విచారంగా వున్నది" శకుంతల భావం, చూపులు . . . లీల భావనారహితంగానే వుండి పోయింది.

"వస్తానండీ" అంటూ అందరివద్ద సెలవు తీసుకుని మేడ మెట్లు దిగాడు సుందరం.

ఆనందసాగరంలో తేలిపోతున్న వానికి తిమింగిలం ఎదురైతే ఏమవుతుందో అదే అయింది సుందరంకి. ఉద్యోగం అయిందన్న పరమానందం ఓ ప్రక్క పరాకాష్ట దశలో వున్నది. మొదటిరోజు కావటంవల్లనేమో చేతిలో నిండుగా పనిలేదు. చేసినా చెయ్యకపోయినా సరిపోయింది ఆరోజు. సాయంత్రం తీరాబయటకు పోయేసమయంలో ఎడిటర్ తన గదిలోకి పిలిచి చెప్పాడు. "రేపు రవీంద్ర వర్ధంతి" సందర్భంలో ఒక ప్రత్యేకానుబంధం ప్రచురించాలనుకుంటున్నాం. మేటరు కొంచెం తక్కువయ్యేట్టుంది వ్యాసం ఒకటి వ్రాయండి" అన్నాడు.

వ్రాయను అనీ కానీ, వ్రాయలేను అని కానీ చెప్పే ధైర్యంలేదు. ఎడిటర్ తననేపిలిచి వ్యాసం వ్రాయమని ఎందుకు అడిగాడో అర్థంకాలేదు. చేయితిరిగిన రచయితలు, సబ్-ఎడిటర్లుగా ఎంతోమంది వుండగా తననే ఎందుకు అడగాలి? తన మేధస్సునీ తెలివితేటల్నీ పరీక్షించడానికా! తను వ్రాయలేననే విషయం తాను రచయిత కాదనే విషయం ఆయనకు సదానందం చెప్పలేదేమో! చెబితే అలా అడిగివుండడు. ఏది ఏమైనా ఆక్షణంలో సరేననకతప్పలేదు. ఆయన 'వ్రాయండి' అన్నాడు కానీ,

వ్రాస్తారా అని వ్రాయగలరా అని అడగలేదుగదా మరి, రవీంద్రుడు అంటే పేరు తెలుసుకానీ, ఆయన రచనలు తానేమీ పట్టుమని చదవలేదు కూడా.

వీధిలో కొచ్చాడుగానీ సుందర్‌కి ఏమీపాలుపోలేదు. ఎడిటర్ అడిగిన తీరుచూస్తే, అవి తలెపుకువస్తే కళ్లనీళ్ల పర్వతం అయింది. ఏంచేయాలో తోచటంలేదు. ఉద్యోగం అయినందుకు సంతోషమే, కానీ ఇరవై నాలుగు గంటలన్నా తిరక్కముందే గొంతులో వెలక్కాయ పడ్డట్లయింది ఈ సమస్య. సంతోషంలో అరవాలనిపించింది. కానీ ఎవరైనా చూస్తే! డాన్సుచేద్దామనిపించింది. వెర్రిగా తాగి తందనాలాడాలనిపించింది. వేధపది మనది భారతదేశం అయిపోయింది, అనుకున్నాడు. కనీసం హైదరాబాదు, పూనావో అయివున్నా బావుండిపోను. తాగి తందనాలాడేపని. విజయవాడఅయిపోయింది.

వ్యాసం వ్రాయాలన్న ఆలోచన రాగానే రూముకువెళ్లిపోవాలనిపించింది. సందుగొందులు దాటి తనగదివేపు ప్రయాణం సాగించాడు. పట్నంలో ఓ మూల పదిరూపాయలు పెట్టి అద్దెకు తీసుకున్నాడు అది. ఆవీధిలో వున్నవి చాలాభాగం పూరిళ్లే, లేబరు ఎక్కువ. రిక్షావాళ్లు, ఫాక్టరీకూలీలు, కార్మికులు శ్రామికులు ఎక్కువ అక్కడ, పైగా వీధిలు చాలా మురికిగా వుంటుంది. మురికి గుంటల్ని దాటుకుంటూ గది చేరుకున్నాడు అలవాటు కనక బురదలో కాలు వెయ్యలేదు. లాంతరు వెలిగించి పెట్టుకున్నాడు. గదంతా నానా గలీజుగావుంది. నిండా సిగరెట్ పీకలు . . . . దుమ్ము, ధూళి అసహ్యంగా వుంది.

"మంగీ . . . ఓ మంగీ" అని కేకవేశాడు

"వొత్తున్నా బాబూ" అన్నది, గోడ అవతల గుడిసెలో వుండే మంగి.

మంగి సుందరం గదివూడ్చి, కావలసినవి తెచ్చి యిస్తుంది. మంగి బాబు రిక్షాత్రొక్కుతాడు. ముసలివాడు. మంగి నాలు గిళ్లలో పనిచేసుకొని పదిరూపాయలు తెచ్చి బాబుకు ఆసరాగా వుంటుంది.

సుందరం మంగిని నెలకు ఓరూపాయి యిస్తానని చెప్పి పనికి కుదుర్చుకున్నాడు. రోజూ ఓసారివచ్చి గదితుడిచి ఓ కూజా నీళ్లు తెచ్చిపెడితేచాలు. అదీ రోజూవుండదు. అతని కిష్టమైతే పిలిచి తుడిపిస్తాడు. ఒక్కొసారి నాలుగురోజులవరకు ఆ అవసరం గు ర్తించడు. కూజాలో నీళ్లు అయితేగానీ మంగి జ్ఞాపకంరాదు. అప్పుడప్పుడు మూలమీద తడికల కాఫీహోటలుకు వెళ్లి కాఫీ సిగరెట్లు తెచ్చియిస్తుంది. ఓ అణా, బేడా వున్నప్పుడు యిస్తాడు సుందరం.

"ఏం బాబా పిలిచారు" అన్నది తడిచేయి పరికిణీకి తుడుచుకుంటూ వొచ్చినిలబడి.

"గది తుడుస్తావా?" అడిగాడు.

"అట్టాగే బాబూ . . . నాలుగురోజులైంది తుడిచి. వొస్తే సమయానికి మీరుండరు"

ఎఱ్ఱ పరికిణీ, వోణీవేసుకొని, పచ్చని జాకెట్ వేసుకున్న మంగిని చూస్తే సుందరంకి జాలి. మంచిపిల్ల! కానికులంలో పుట్టిందేమా అనుకొంటాడు.

"మంగీ! నువ్వుచాలామంచిదానవు" అంటాడు ఆనందంగా వున్నపుడు.

ఆమాటతో మంగికి వొళ్లు పూలు పూస్తుంది. సిగ్గుల మొగ్గై పోతుంది

"పోండి బాబూ ... మీరెప్పుడూ అంతే అంటారు"

"ఏం తప్పుగా అన్నానా ... నిజంగా నువ్వు అందంగా లేవా చెప్పు" అడిగాడు.

"మాఅందం ఏటి విలువబాబూ ... ఏటిపాటైన ఎన్నాలేగా ... వోరుచూస్తారు అందం" అన్నది.

"ఎవరుచూడాలి. నేచూస్తున్నాగా చాలదా!"

మంగికి అర్థంకాదు ఆభాష.

"ఇంద. రూపాయి పట్టుకెల్లి రెండుసిగరెట్లు పెట్టెలు, కాఫీ పట్రా. ఓ బేడాపెట్టి నువ్వు పూలుకొనుక్కో. మల్లెపూలు నీతల్లో బావుంటాయి" అన్నాడు ఓ రూపాయి ఇస్తో.

"మా బాబుగారు ఈయూల మాంచి కుశాలుగా వుండారేం" అని చెంగు చెంగున పరుగెట్టింది.

"ఈడులోవున్నది పాపం. అభమూ శుభమూ తెలియ దింకా" అనుకున్నాడు. ఓ క్షణంలో మంగి వెళ్లినవేపే చీకట్లో చూపులు సారించాడు.

గదిలో వాసన, దోమలు భరింపరానంతగా వుండ టంతో ఇంత సాంబ్రాణిపొగవేసి, పదిఅగరువత్తులు వెలిగించి

పెట్టాడు. ఎదురుగా వున్న కృష్ణుని పటానికి ఓ నమస్కారం పడేసి, కలం కాగితం తీసుకున్నాడు.

దక్షిణపు వేపు కిటికి దగ్గరగా కూర్చోవడంవల్ల కృష్ణ మీదనుండి వచ్చే చల్లగాలి హాయిగావుంది. రోదసిలో చందమామ రోహిణితో సరాగా లాడుతున్నాడు.

"ఇంక ప్రారంభిద్దాం" అనుకుని కలంతీశాడు. శ్రీరామ అని పెట్టి వ్యాసానికి నామకరణం చేశాడు. ఓ బొత్తి కాగితాలు దగ్గరగా పెట్టుకున్నాడు. కాని ఎంత ఆలోచించినా అక్షరం పడ టంలేదు 'రవీంద్రుడు; కవీంద్రుడు' అన్నమాటలు మినహా.

ఏం వ్రాసేట్లు, ఆయన ఏంచేస్తే ఎవరికక్కరవాలి, అసలు ఆ రవీంద్రుడు తనను పరీక్షించడానికే జన్మించాడనిపించింది. కర్మకాలి ఇంట్లోఏమీ పుస్తకాలులేవు. ఉన్నవన్నీ పాతపుస్తకాల షాపుల్లోకి వెళ్ళిపోయాయి. కడుపుబాధ తీర్చడంకోసం చిన్న పుడు చదివినపాఠాలు జ్ఞాపకం వచ్చాయి. ఠాగూర్ బెంగాలులో జన్మించాడు. గొప్పకవి. అదేదో నోబెల్ బహుమతి పొందాడు. గీతాంజలి అని ఓ పెద్ద పుస్తకం వ్రాశాడు. ఎంత ఆలోచించినా నాలుగుపాయింట్లకన్న ఎక్కువదొరకటంలేదు.

మరో రెండు సిగరెట్లు ఖాళీచేశాడు.

ఇంతలో మంగి రానేవచ్చింది కాఫీ తీసుకుని. సిగలో మల్లెలు ముడుచుకొని, మనసున మల్లెల మమతలు మాలలుగా ధరించి. కాఫీ గటగటా త్రాగాడు.

"బావున్నయ్ మంగమ్మా" అన్నాడు.

"ఏటి?"

"కాఫీ"

"కాఫీయా! మల్లెమొగ్గలేమో ననుకున్నా" అన్నది.

"ఓస్ అదా సంగతి. నీ తలలో కాక మల్లెలు మరెక్కడ బావుంటాయి చెప్పు."

ఆ అమ్మాయి వెళ్ళిపోయింది.

ఏవేవో ఆలోచనలు వచ్చి మనసును గందరగోళం చేస్తున్నాయి. కానీ వాటికి ఒకరూపాన్ని ఇవ్వలేక పోతున్నాడు. వ్రాయటం ఎలాగో అర్థంకావటంలేదు. వ్రాసిన పదివాక్యాలు మరో మారు తిరిగి చదువుకున్నాడు. అదేదో సెంకడు ఫారం విద్యార్థి వ్రాసిన తెలుగు కాంపోజిషన్‌లాగా వున్నది. కానీ పత్రికలలో వచ్చే వ్యాసంలా లేదు.

"నేను వొట్టి అసమర్థుణ్ని. ఈ వ్రాయడం గొడవ నాకురాదు. నన్ను ఈ రొంపిలో ఎందుకు దించావు భగవాన్!" అని బాధపడ్డాడు.

తన అసమర్థతకు కోపం వచ్చింది. పిచ్చిఎత్తినట్లే అయింది. వొళ్లంతా చెమటలుపోసినయి. కణతలు దిమ్మెక్కిపోతున్నాయి.

"వెధవ ఉద్యోగం నేచేయలేను. రేపొద్దుటే రాజీనామా చేస్తాను" అనుకున్నాడు.

అలా అనుకున్నక్షణంలో తేలికపడ్డట్టుగావుంది మనస్సు. రేపు ఈ బాధ, ఆలోచనవుండదు. హాయిగావుంటుంది ప్రాణానికి. నిరుద్యోగికి ఉద్యోగంలేదన్న బాధమినహా, ఏ ఆదుర్దా,

బాధ్యతా వుండదు. ఇంత ఆలోచన ఎవరు చేస్తారు. నేను వ్రాయను. వ్రాయను, వ్రాయలేను అనుకున్నాడు. అయితే రాజీనామా చేసినమీదట ఏంచేయాలి. ఉదరపోషణ ఎలా అన్న ఆలోచన వచ్చి మరి ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. నిరుద్యోగం భవిష్యత్తు దారుణంగా తననుచూచి, ప్రళయకాళిలా వికటాట్ట హాసం చేసినట్లుంది. అనుకున్న ఆనందం క్షణంలో సగకాలం కూడా నిలవలేదు. భవిష్యత్తు అంటే నమ్మకం సడలింది. రాక్షసి ఎదురుగా వింతరూపాలలో ప్రత్యక్షమైంది.

ఏం చేయాలో తోచటంలేదు. మనసు ఖాళీగావుంది. కిటికీ దగ్గరకువెళ్ళి, సిగరెట్టుపొగ వదలి బైటకుచూస్తూ నిలబడ్డాడు కొంచెంసేపు. క్రిష్ణా బ్రిడ్జిమీద రైలుపోతోంది శబ్దిస్తూ. బ్రతుకే ఓ రైలు. ప్రతిస్టేషనులోను ఆగుతుంది. ఎవరు దిగవలసినచోట వారు దిగిపోతారు. కాలంకూడా అలాగే పరుగెత్తేరైలే. నా ప్రయాణంలో నేను దిగవలసిన స్టేషన్ ఇక ఆట్టేదూరంలో లేదు అనుకున్నాడు తనలోతాను.

గలగలా ప్రవహిస్తున్న కృష్ణతరంగాల శబ్దం వినిపిస్తూనే వుంది. వొడ్డుల్ని వొరుసుకొని ప్రవహిస్తూ, సాగరునికోసం తపిస్తూ పరువులు తీస్తోంది విరహిణిలా.

"ఏమిటో జీవితం!" అనిపించింది.

ఎలా అనుకున్నా, ఎలా అనిపించినా జీవితం జీవించ డానికే. ఎలాగో బ్రతకాలనే ప్రతివ్యక్తి ఆపేక్షిస్తాడు.

మరోక్షణంలో చిన్ననాటి స్మృతులు జ్ఞాపకాని కొచ్చినవి. ఆశలకు అనుభవానికి ఎంతదూరం?

సుందరం తల్లీ తండ్రీ గుంటూరు పక్కనేవున్న ఓ పల్లెటూరిలో వుండేవారు. మూడెకరాల పొలం సాగుచేసుకొని సంసారం నెట్టుకొస్తున్నారు. కానీ సుందర్ని బాగా చదివించాలని మొదటినుండీ పట్టు పట్టారు. పీడూ పొలంపనిలో చేరితే ప్రయోజనంలేదని, చదువు చెప్పిస్తే పెద్ద ఉద్యోగంచేసి, గొప్పవాడవుతాడనీ, తమ కష్టాలు తీరుతాయని ఆశించారు. ఆ ఆశతోనే చదివించారు. స్కూలుఫైనలుతోనే ఆగుతానన్నా వినకండా కాలేజీలో చేర్పించారు. ఆతర్వాత విశాఖపట్నంకూడా పంపారు. ఉన్న మూడెకరాలపొలం అయిపోయింది. సుందరం పరీక్ష పోయింది. ఆతర్వాత సిగ్గుతో అతను ఆ ఊరిమొఖం చూడలేదు. తలి దండ్రిలకూ మొఖంచూపించలేదు. వాళ్లు కూలీ నాలీ చేసుకొని జీవిస్తున్నారని విన్నాడు, కానీ ఏం సహాయంచేయలేక పోయాడు.

తనపొరబాటు వల్లనే, తన తెప్పిదంవల్లనే వారలా కష్టపడి జీవించవలసి వచ్చింది. తనే సక్రిమంగా చదువుకున్నట్లయితే, పరీక్ష తప్పేవాడుకాదు. ఈ దారుణస్థితి ఏర్పడేదేకాదు. అనవసరంగా ప్రేమగొడవల్లో పడటం వల్లనే సర్వం స్వాహాఅయింది. సర్వనాశనం అయింది. అలా అయినానని ఇప్పుడు పశ్చాత్తాపపడతాడు అప్పుడప్పుడు.

విశాఖపట్నంలో చదువుకునేరోజుల్లో ఓ గదిలో అద్దెకుండేవాడు. అది ఒక ప్లీడరుగారి ఇల్లు. ఆయనకు పిల్ల పాపా లేరు. పైగా మూడోపెళ్లివాడు. ఆయనభార్య చిన్నది, అందాల

భరిణ, ఇరవై యేళ్ళుండేవి. సుందరం ముందువేపు గదిలో వున్నా స్నానానికి దొడ్డి పెరట్లో బావిదగ్గరకే వెళ్ళవలసి వచ్చేది.

క్రమంగా కమలతో పరిచయం ఏర్పడ్డది. లాయరు గారు పదిగంటలుకాగానే కోర్టుకు వెళ్ళేవాడు. సుందరం కమలతో ప్రేమకలాపాలు సాగించేవాడు. దానితోనే చదువు పాడై పోయింది. కాలేజీ ఎగ్గొట్టి ఇంట్లోనేవుండేవాడు. కావటంతో పరీక్షపోయింది. అసలు ఆ కమలనే లేవదీసుకుపోయి, పెళ్ళిచేసు కుందామనుకున్నాడు. కానీ ఆ అమ్మాయి అంతటి అఘా యిత్యానికి ఒడిగట్టలేదు. ఆ భర్తని వదలి వెళ్ళితే చెడ్డపేరు వస్తుందని భయపడ్డది. అంటుకే ఇంట్లోవున్నంతకాలం సుందరంతో ప్రేమకలాపాలు సాగించడానికి, అతనికి ప్రియురాలుగా వుండ టానికి అభ్యంతరం పెట్టలేదు. తత్ఫలితంగా అతని బ్రతుకు బండల పాలైంది

డాబాపైకి వెళ్ళి చూస్తుండిపోయాడు సుందర్. మధుర స్మృతులు మత్తెక్కిస్తే, మనసు అన్యథా మళ్ళడంకోసం ఆకాశం కేసి చూస్తూ, డాబాపైన కూర్చునే అలవాటు. రోజూ అదే డాబాపైన అలాగేకూర్చుని దూరంగా కృష్ణకేసి, ఆకాశంలో మెరిసే నక్షత్రాలకేసి బ్రిడ్జిమీద రొదచేస్తూ పోయే రైలుకేసి చూస్తూ కలలుగనేవాడు. చల్లగాలి, గాలితో భావనలు హృదయానికి తగిలినప్పుడల్లా 'ఒంటరివాణ్ణిగదా' అని స్ఫురించేది. ఏకాంతం బాధామయంగా తోచేది. కొన్నిక్షణాలు, నిమిషాలు, గంటలు ఏవేవో లోకాల్లో ఎవరెవరితోనో విహరించేవాడు. తనకు నచ్చిన అందాల రాణులతో విహారం చేసేవాడు. సినీమాతారలను, తను

మెచ్చినవాళ్ని, నచ్చినవాళ్ని ఏరి, వారి బాహువుల్లో కరిగి పోయేవాడు. ప్రపంచంలో ఉన్న కోటీశ్వరుల కుమార్తెల ప్రక్కనే తన నూహించుకునేవాడు. పగలు బజార్న పోతు న్నపుడు ఎదురయ్యే అతి సుందరాంగుల్ని రోజూ ఆవేళకు ఊహాలోకాల్లో తనవెంట త్రిప్పుకునేవాడు. అదొక సుందర సుస్వప్నజగతి. అక్కడ దిగులు, విచారం లేదు. అంతా ఆనం దమే.... స్వర్గ మే.

"సుంబరానికి తగని సిగ్గు, బిడియం. ఎవర్నీ తానుగా కవ్వించి, తనవేపు త్రిప్పుకునే నేర్పు లేదు," అని రజని అనే మాగ్ల అనుకునేది అతని అమాయకత్వం, నిరాడంబరత, నిశ్చ లత, నిగ్రహం చూచి. ఊహాలోకాల్లో విహరించటమంటే మహా సరదా, హాయికూడా. మనసు చీకాకుగా వుండటం, చేయవలసిన పని చేయలేకపోవటం....అలాగే పిచ్చిగా ఆలోచిస్తూ, ఆరు బయట ఆకాశంక్రింద పడుకుని నిద్రపోయాడు ఆరాత్రి.

తెల్ల వారకముందే మెళుకువ వచ్చింది. ఆకాశం నిర్మ లంగా వుంది. నిశ్చలాకాశం క్రింద నీరసంగా విజయవాడ నిద్రి స్తోంది యింకా. నిశ్చల నిశీథిలో సమాధిలావున్నది పట్టణం. రాత్రంతా ఆలోచనలబరువుతో, చికాకుగా మైమరచి నిద్రపోవ టంవల్ల పెందలకడనే మెలకువ వచ్చింది. హడావుడిగా డాబాదిగి వచ్చాడు. అయిదుగంటలు దాటింది. సూర్యోదయాత్పూర్వమే స్నానం ముగించాడు. ఎంతఆలోచించినా తెగటంలేదు. నాలుగు వాక్యాలు పెనవేసి అల్లడం కుదరటంలేదు. అంత వ్రాయలేని అసమర్థుడైనట్లు భావించి బాధపడ్డాడు. దూరంగా కొండలు,

కృష్ణానది ఎంతసేపు చూచినా ఉత్సాహంరావటంలేదు. వాటి సౌందర్యం నిరుపయోగంగా వున్నది. వాటిలో శాంతిలేదు. సహాసం లేదు. ఇలాంటిరోజుల్లో ఓ పల్లెటూరిలో వుంటే ఎంత బావుంటుంది. ఈ బస్తీ ఆర్భాటాలు, బాధలు, వ్యామోహాలు లేకుండా ఏ నిర్జన నిశ్శబ్దవాతావరణంలోనో వుంటే ఎంత బావుండును అనుకున్నాడు. తనేదో వ్రాయాలన్న విషయం మళ్ళీ జ్ఞాపకంవచ్చి చలించిపోయాడు.

టేబుల్ ముందు కూర్చుని మళ్ళీ ప్రయత్నించాడు నిష్ప్రయోజనమే అయింది. ఆలోచనలకోసం, భావాలకోసం, మేధస్సునంతా పరిశోధించాడు. కానీ ఏం లాభం? శూన్యంగా గోచరించింది. అయినా ఏదో ఆశ. పూర్తిగా నిరాశకు తావులేదు కూడా. అలాగని 'ఆశ' పడవలసింది అంతకన్నా లేదు. బుర్ర పనిచేయడం లేదు. కాగితంమీదికి కలం పోవడం లేదు. "ఏమో.... ఈ పత్రికావ్యాసంగం మనకేం గిట్టుబాటుకాదుస్మీ....ఎవరైనా తెలిసినవాళ్లు నాలుగు ముక్కలు వ్రాసియిస్తే బ్రతికిపోతాను" అనుకున్నాడు.

మనసులో సదానందం మెదిలాడు. కానీ.... కానీ.... వెళ్లి సదానందాన్ని "నన్ను వ్రాయమన్న వ్యాసం వ్రాయటం నావల్ల కాలేదు. నేను అసమర్థుణ్ణి, నీవే వ్రాసిపెట్టు" అంటే ఏం బావుంటుంది. అయినా తేల్చుకోవాలి. "స్వామీ....నీ ఉద్యోగానికి, నీకూ వేనవేలు నమస్కారాలు. నావల్ల కాదు ఈ రాతలు కోతలు" అని చెప్పివేయడానికి నిర్ధారించుకున్నాడు. ఆ నిర్ధారణ అయినాక మనసు తేలికైంది.

బజారుకొచ్చి టైంచూస్తే, ఎనిమిదిగంటలైంది. ఇంత పొద్దున్నే వెడితే అతను నిద్రలేస్తాడో లేదో .... అతన్ని ప్రొద్దున్నే వెళ్ళి డిస్టర్బ చేస్తున్నట్లు కాదుకదా! ఎంతవరకు భావ్యంగావుంటుందా అనీ ఆలోచించాడు. ఏమో! ఏమైనా అనుకోవచ్చు. ఏదో మిత్రుడు గదాని మొహమాటానికి ఉద్యోగం యిప్పిస్తే ఈ తద్దినం ఏమిటా అనీ అనుకోవచ్చు. ఏమీ తోచక అలా పేవ్ మెంటుమీద నడుస్తున్న సుందరం ప్రక్కనేవున్న ఓ హోటల్లోకి నడిచాడు.

ఓ ప్రత్యేకమైన గదిలో కూర్చుని ఓ కాలేజీ అమ్మాయి అబ్బాయి సరదాగా సరాగాలాడుకుంటున్నారు. మరెక్కడా ఖాళీలేక ఆ ప్రక్కనే కూర్చోవలసివచ్చింది సుందరం సుందర స్వప్నాల్నికంటూ. అతను రావటంతో వారిద్దరూ గుసగుస లాడుతూ బైటకు వెళిపోయారు.

ఆ యిద్దర్నీ చూస్తుంటే సుందరం హృదయం పులకరించి పూలు తొడిగింది. రజని జ్ఞాపకానికొచ్చింది. ఏంచేస్తుందో పాపం! ఆ అమ్మాయికీ తనతో అలా తిరగాలని కోరిక. తనను అలా తనవెంట త్రిప్పుకోవాలని ప్రయత్నిస్తుంది. కానీ తానెప్పుడూ అందుకు అవకాశం యివ్వలేదు. పైగా అంగీకారాన్ని కూడా పూర్తిగా తెలియపరచలేదు. ఆ అమ్మాయి తనను ప్రేమిస్తోం దని తెలిసీ తెలియనట్లే ప్రవర్తించాడు. రజని మనసులోని ఉబలాటం, కోర్కె ఎంత బలమైందో కదా అనిపించింది

తన యవ్వనాన్ని, మరో ఆరాధ్యుడైనవానికి అంకితంచేసి అతని ఆనందంలో లీనమైపోతూ, తల్లీనావస్థను ప్రపంచానికి

ప్రస్ఫుటీకరించాలని ఎంతగా ఉవ్విళ్లూరిపోతుందో .... నిజానికి సదానందం కూడా అంతటి అదృష్టవంతుడే. లీల ఎంత మంచిది. ఎంత గొప్ప సౌందర్యం ఆమెది'' అనుకున్నాడు.

"హలో సుందర్" అన్న పృచ్ఛతో వెనుదిరిగిచూచాడు.

"ఎవరూ ?"

"సదానందం."

"ఓ....మీరా!" ఆశ్చర్యంగా అవలోకించాడు.

"మీకోసమే బయల్దేరాను. అదృష్టవశాత్తు ఇంతలో మీరే తటస్థపడ్డారు."

"ఏం విశేషం ?"

"మరేమీ లేదు. ఎడిటర్‌గారు ఓ వ్యాసం వ్రాయమన్నారు. అది వ్రాయటం నావల్ల కావటం లేదు. ఏం తోచడం లేదు. ఏమైనా...."

అంటూండగానే మధ్యలోనే త్రుంచి అన్నాడు సదానందం.

"మొదట్లో అలాగే ఇరుకుగా వుంటుంది బ్రదర్." భుజం తట్టి మరీ చెప్పాడు సదానందం.

"మా యింటికి వెళ్ళవోయ్, లీల వుంటుంది సాయం చేస్తుంది. లైబ్రరీనిండా పుస్తకాలున్నాయి. ఏంకావాలన్నా తీసుకో. నే పంపానని చెప్తే ఫరవాలేదు."

"వారిని అడగటం ?"

"మరేం ఫర్వాలేదు. అలా అనుకునే మనిషికాదు, అభ్యంతరం చెప్పే వ్యక్తి అంతకన్నా కాదు."

"అయితే వస్తా."

"ఆపిడ నిన్నేం కరవదులే. కొంచెం ఫ్రీగా మాట్లాడు తుంది కంగారు తినకు. ఆమె స్వభావం అది. వ్రాస్తావు కదూ.... ఇదిగో మరీ అంతగా కుదరదనుకో, కొంచెం లీలను బ్రతిమ లాడావో వ్రాసిపెడుతుంది. చక్కగా వ్రాస్తుంది తెలుసా. పేరుకోసం. తాపత్రయపడే రకం కాదు లే.... వెళ్లిరా.... నాకు ఆఫీసుకు టైం అవుతోంది" అంటూ వెళ్లిపోయాడు సదానందం.

63

# 7

సుందర్ గదిలో ప్రవేశించేసరికి, సోఫాలో కూర్చున్న లీల లేచి ఎదురొచ్చింది. స్త్రీ సహజమైన లజ్జ, సిగ్గు ఆమెలో అవుపించకపోవటం అన్నదే ఆమెలోని ఒక విలక్షణం. ఆప్యాయంగా నవ్వుతూ, వొళ్ళంతా పూలు చేసుకుంటూ. కొత్తగా ప్రియుణ్ని కలుసుకునే ప్రియురాలి ఆత్మీయత, ఆదరణ ఆమెలో గోచరిస్తాయి.

"రండి సుందర్....కమాన్" అన్నది ఎదురొచ్చి.

అంత ఆప్యాయంగా తనకు ఆహ్వానం, ఆదరణ లభిస్తుందని సుందర్ పొరపాటునైనా అనుకోలేదు. లీల విషయంలో వేసుకున్న అంచనాలు తలక్రిందులుకావటం అట్టే కష్టమైన విషయంకాదు. ప్రతివారు అలా బోల్తాకొట్టి తీరవలసిందే. నిజంగా ఆ ఆదరణకు చిత్తయిపోయినాడు సుందర్. ఏమో చిరాకు అభినయిస్తుందని భ్రమపడ్డాడు. కసిరి చెంపకాయ కొడుతుందనుకున్న యువతి కరువారా కావిలించుకున్నట్లయింది సుందర్ స్థితి.

"మీకు శ్రమయిస్తున్నందుకు మన్నించండి" అన్నాడు అన్యధా అపోహపడుతూ క్షమాపణ విసిరి.

"నిజంగా శ్రమఇచ్చేవారే అరుదు. దొరికితే అదృష్టమే దొరకటమేలేదుకాని . . , అయినా మీరొస్తారని నాకు తెలుసు గదా . . . అనుకోని విషయం జరిగితేగదా ఆశ్చర్యపడటానికి" అన్నది నవ్వుతూ.

అదేమిటి. ఈమెకేం జోస్యం రాదుకదా అనుకున్నాడు.

"ఎలా అనుకున్నారు వస్తానని?"

"రాకుండా ఎలావుండగలరు?" అన్నది గర్వంగా. తన సౌందర్యాన్ని ఓసారి సమీక్షించుకున్నట్లయింది.

"నాతో పరిచయం కానివారు, పేరుమాత్రం విన్నవారే నాకోసం తహతహలాడిపోతుంటారుగదా! నేను నడిచే వీధుల్లో, తిరిగే ప్రదేశాల్లో నడిచి, జన్మ ధన్యమైందనుకుంటుంటారే! అలాంటిది పరిచయమైనవారు నాకోసం రావటంలో ఆశ్చర్యం ఏముంటుంది."

సుందర్ తలపైన వెయ్యికాండిల్ బల్బులు బ్రద్దలు కొట్టినట్లయింది.

"అలాగా రావాలని రాలేదు. మీరు అన్యథా భావించరనుకుంటాను."

"పోనిండి దానికేం. ఏదోఒకపని కల్పించుకునే వచ్చామంటారు . . . అంతేనా!"

ఏమీ మాట్లాడలేని స్థితిలో పడ్డాడు పాపం.

"ఏదో పనిమీద వచ్చానన్నారూ?" అన్నది లీల అతన్ని ఆ అచంచల స్థితినుండి వెలికి లాగుతూ.

"ఆఁ సదానందం కన్పించి మిమ్మల్ని కలుసుకోమన్నారు. ఓ పుస్తకం కావాలి."

అలమారు చూపించింది.

సుందర్ ఏవో నాలుగు పుస్తకాలు వెదికి తీసుకున్నాడు. వచ్చి సోఫాలో ఎదురుగా కూర్చున్నాడు. లేచి ఎప్పుడు పోదామా అని సుందర్ ఆలోచన.

"అన్నట్లు మీగురించి మా శకుంతల చెప్పింది సుందర్" అన్నది ప్రసంగం పొడిగిస్తూ.

"శకుంతలా? ఎవరూ?"

"అదే నా ఫ్రెండ్. నిన్న మీరొచ్చినపుడు వచ్చింది చూచారూ ఆమె."

"ఆమెకు నాగురించి ఏం తెలుసు. పరిచయం లేదే."

"మీరు చాలా మంచివారటగా" అన్నది.

"బావుంది" అన్నాడు తనలో తనే నవ్వుకుంటూ ఏమీ అర్థంకాక.

"శకు గురించి మీ అభిప్రాయం ఏమిటి?" ప్రశ్నించింది.

"నా అభిప్రాయమా?" అని ఓ క్షణం ఆగి, "ఆ అమ్మాయికేం చాలా మంచిదిగానే కన్పిస్తోంది."

లీల పొట్టచెక్కలయ్యేలా నవ్వింది.

"మీకు బాగా పరిచయమా?" అన్నది.

"లేదు."

"మరి ఎలాచెప్తారు మంచిది అని."

"అలాగని అనిపించింది."

"ఓ అలాగా. మా శకూకు మిమ్మల్ని చూచి అలా అనిపించిందన్న మాట. అందుకు పరిచయం కావాలా సుంద రయ్యా" అన్నది.

సుందర్ క్రుద్ధుడైపోయాడు.

"మీరన్నట్లు శకూ చాలా మంచిది. చాలా అందంగా వుంటుంది" అన్నది.

"మీ అంత అందంగా వుండదుగా" అని అందా మను కున్నాడు. కాని ధైర్యం చాలక, పైకి అనక లోలోపలే స్మరించు కున్నాడు.

"ఎంతో తెలివైంది కూడా. స్వతంత్రురాలు. అందుకే చేసుకున్నవాడు వెర్రివాడైనా, కాలదన్నినా స్వతంత్రంగా బ్రతగ్గలుగుతూంది. దానికి సంగీతమంటే, నాటకాలంటే చెడ్డ పిచ్చి. అవి అతగాడి కిష్టంవుండవు అన్నీ మానుకుని తనకు వండిపెడుతూ కూచోమంటాడు. అలా కూచోడం ఆమె కిష్టం లేదు. అందుకే యిద్దరికీ పొంతన కుదరటంలేదు. కొందరికి మంచి తనం ఎక్కువ మోతాదులో వుండటం నచ్చదు. అందుకనే ఈ లోకం ఆడదానిలోని మంచితనాన్ని అపార్థం చేసుకుంటుంది. నిజాయితీగా, నీతిగా ఆడది వున్నా, చనువుగా ప్రవర్తించినా, సంబంధాలు కట్టేస్తుంది సంఘం. స్వతంత్రతను అసలు అంగీక రించడు మొగుడైనవాడు. నిజానికి తానెంత అసమర్థుడైనా, నిరుపయోగి అయినా, పెనగులాడుతాడు మగతనం కొరడా ఝళిపించడానికి. అందుకే కళాకారులైనవారు ఆడ అయినా, మగ

అయినా పెళ్లి చేసుకోకూడదంటాను నేను. ఇద్దరూ కళారాధకులైతే కుదిరేదది. ఒకరైు, మరొకరు కాకున్నా కుదరదు.

సుందర్‌కి ఈ ఉపన్యాసం నమోలానికంటె ఆశ్చర్యం వేసింది శకు స్వభావం, చరిత్ర వింటుంటే.

"అయితే మీ శకుంతలకు పెళ్ళయిందన్నమాట" అడిగాడు.

"ఆఁ అప్పాలబాల అనుకున్నావా....ఆ వెంటవున్న పాప దాని కూతురే."

"ఆమె భర్త ఏంచేస్తుంటాడు ?"

"ఏమీ చేయడు. ఆస్తివుంది. అంతకుమించి తెలియదు. కానీ అతగాడికి భార్యా, పిల్లలు ఉన్నారంటాడు. ఎంతవరకు సత్యమో తెలియదు. ఇక్కడకు వస్తుంటాడు పోతుంటాడు. అన్ని దురభ్యాసాలుఉన్నాయి. తాగుడు, జూదం, రేసులు పేటికీ ఏం తక్కువలేదు. శకూ అందం, చందం తెలివితేటలు అతగాడ్ని ముగ్ధుణ్ని చేశాయి. ముందు బ్రహ్మచారని భ్రమపడ్డది. పెళ్ళి చేసుకుంటాడనుకున్నది అందుకే అతన్ని వొదలలేదు. పైగా డబ్బున్నవాడుగదా ! కోరినంత యిస్తుంటాడు. కొర్కెలుమాత్రం చూడడు. అయినా అతనంటే దీనికి వల్లమాలిన ప్రేమ. అతనెంత ముభావంగావున్నా కాదనలేదు, రావొద్దనదు.

"పతివ్రత అనుకోంటాను" అన్నాడు సుందర్.

"అవునోకాదో నీవే నిర్ణయించగలవు. పతిత అనగలవు. అందులోని పవిత్రత అర్థంచేసుకుంటే తెలుస్తుంది. పరిచయం అయినంతమాత్రాన అర్థంకాదు శకుంతల తత్వం. ఆమెను

ఎరుగున్నవాళ్లు, ఆమెకు తెలిసినవాళ్లు, ఆమెకింత చరిత్రవుందని ఎరగరు, చెప్పినా నమ్మరు. సంసారిగా భావిస్తారు. చాలా మంచిది. స్నేహమయి అంటారు. పోనీ ఓసారి వెళ్ళి కలుసుకో రాదూ. నీవంటే సదభిప్రాయం వున్నదికూడా" అన్నది.

నిజానికి ఇంకా ఇంకా శకుంతలను గురించి వినాలని, తెలుసుకోవాలని అనిపిస్తుంది. ఎప్పుడూ అక్కడే వుండిపోయి, ఆ శకుంతలను గురించి లీల చెప్పే మాటలు వింటూ కూర్చోవాలనిపించింది. ఆక్షణంలో ఒక అపూర్వానుభూతి కలిగింది. నిజంగా లీల, శకుంతల తనకెంతో ఆత్మీయులుగా అవుపిస్తున్నారు.

అక్కణ్నించి సెలవుతీసుకుని బయటపడ్డాడు. అయినా శకుంతల రూపం మరీమరీ దట్టంగా హత్తుకుపోతోంది. ఏదో తెలియని ఆత్మీయత శకుంతల యెడల కలిగిందికూడా.

జీవితంలో ఒక్కొక్కప్పుడు అనుకోని సంఘటనలు ఎదురవుతుంటాయి. తను రజని సాహచర్యాన్నే కాదన్నాడు, నిగ్రహించుకున్నాడు. ఆమె తనను, తన పొందును కావాలని వాంఛిస్తున్నా, కనికరిస్తున్నా, ఆదరిస్తున్నా కాదంటున్నాడు. ఏమీ తెలియని శకుంతల అంటే లీల మాటల్నిబట్టి ఆప్యాయత, అనురాగం కలుగుతోంది. ఆమెతో నిజానికి తనకు పరిచయం బొత్తిగా లేదు. తనకేమీ కాదు కానీ శకుంతలను గురించిన భావన కలిగినపుడు మనోఫలకంనుండి లీల, రజని చిత్రాలు చెరగిపోతు న్నాయి. ఇదంతా ఏమిటో అయోమయం, ఏమీ తెలియనిస్థితి. మానవుని చేతిలో లేని ఒక మహాస్త్రాయుధం. దానికే మాన వుడు లొంగిపోతుంటాడు. దానికే బానిసైపోతాడు. ఆ బాని

సత్వంలో స్వర్గాలున్నాయని ఊహించుకుంటారు. అదొక ఊహా లోకం, అదొక ఊహాగానం.

ఆ ఆలోచనతోనే రోజంతా గడచిపోయింది. మనసుకు ఊరట లేదు. ఆలోచనలకు అంతుఅంటూ లేదు. చీకటిపడే వేళకు తనకు తెలియకుండానే కాళ్లు రజని యింటివేపు దారితీసినయ్. మసకచీకట్లో గేటువారగా నిలబడిఉన్నది రజని. సుందర్ రాకను గమనించింది. నిగనిగలాడే తెల్లటి జార్జట్ చీర వొంటికి అతికీ అతకనట్లు జారిపోతూవుండగా, కురిసీకురియని వెన్నెలలే వెలుగులో అన్యాక్రాంతంగా అడుగు ముందుకువేయడం గమనించిందేమో రజని 'మాస్టారూ' అని పిలిచింది.

సుందర్ ఉలికిపడి ఈలోకంలో పడ్డాడు.

తలెత్తి చూచాడు.

వెనకనేఉన్న రజనిని గమనించి సిగ్గుపడ్డాడు కూడా.

"ఇల్లు మర్చిపోయినారా మాస్టారూ" అన్నది నవ్వుతో సిగ్గును కప్పిపుచ్చుతూ బిగించి ఇంట్లోకి నడిచాడు. వెనకాల రజని.

"ఏమిటండీ తీవ్రంగా ఆలోచిస్తున్నారు?" అన్నది దగ్గరగా వచ్చి. రజని శరీరం తనకు తగులుతుంటే అదొకరకమైన మత్తు కలిగింది అతనికి. ఏవేవో కోర్కెలు, వాంఛలు, బలంగా ప్రకోపించినయ్. కళ్ళలోకి సూటిగా చూస్తుంటే తట్టుకోలేని సిగ్గుతో ముడుచుకుపోయింది రజని.

"రజనీ ఇలా రా" అన్నాడు మత్తుగా.

దగ్గరగా వచ్చింది రజని.

దగ్గరగావచ్చిన రజనిని మరీదగ్గరగా తీసుకుని చేతుల్లో పొదివి పట్టుకుని, నిలువునా కౌగిలించుకున్నాడు. పెదాలపై బిగ్గరగా ముద్దుపెట్టుకున్నాడు. అధరామృతపానంలో మత్తెక్కి పోలిన రజని . ఆ మధురక్షణంకోసమే ఎన్నిరోజులుగానో కలలు కంటున్నది. "ఉండండి....ఇంకా దీపం వేయలేదు" అన్నది.

అదేదో అభ్యంతరంగా...కానీ, ఆకారణంగా దూరంగా జరిగి, సుఖాన్ని దూరంచేసుకోవాలనిలేదు రజనికి నిజానికి. ఇంకా దగ్గరగా తనలోనే తీసుకుని తనలోకే వశంచేసుకుంటే, ఐక్యమై పోవాలన్నంత వాంఛ ప్రకోపించింది. ఆ మమతకు, వాంఛలు హద్దుల్లేవు.

"రజనీ....నువ్వు అప్సరసవు రజనీ" అన్నాడు.

"ఆమె ఉక్కిరిబిక్కిరైంది. ఆ అదృష్టమేగా కావాలని కోరుకుంటోంది కూడా.

"అబ్బ....ఎంత తీయగా వున్నాయ్ నీ పెదాలు."

ఆమె మరేమీ మాట్లాడలేకపోతోంది.

"రజనీ....రజనీ....నా కోర్కె మన్నించవూ."

"కాదు" అని సమాధానం చెప్పలేక గదిలోకి నడిపించింది.

"రజనీ నేను చాలా బీదవాన్నికదూ."

ఉష్ .... అంటూ పెదాలకు పెదాలు అందించింది. మీదికి వాలి....సోలిపోయాడు.

తొలినాటి అనుభవం రజనిది....సుందర్ ది సుఖస్వప్నమే నేమో!

నెలలు ఇట్లు జరిగిపోతున్నాయి. కాని ఉద్యోగ రీత్యా ఆశించినంత ఆనందం పొందలేకపోతున్నాడు. సుందరం అదేదో ఘనత ఉత్తినే వస్తుందనీ, బావుకుందామనీ అనుకున్నాడు. ఏదో వొరిగి ఒళ్లో పడుతుందనీ అనుకున్నాడు. పత్రికారచన అంటే ఏమిటోనని కలలుకన్నాడు. నిజానికి అనుకున్నట్లు ఏమీ జరగ లేదు. పైగా ఈ ఉద్యోగం తన అభిరుచులకు సరిపడనిదేమో నన్న అనుమానంకూడా అపుడపుడు కలుగుతూవుంది. తన స్థితి, మనుగడ, అంత ప్రశస్తనీయమూ, ఉన్నతమూ కాదన్న అను మానం వేస్తోంది. అలా అనుమానం కలిగినపుడల్లా కళ్ల నీళ్లు తిరిగినంత పనయ్యేది మిగిలిన సబ్-ఎడిటర్లంతా పెద్దపేరున్న రచయితలు, కవులు. తనుమాత్రమే ఏమీకాదు. అనామకుడు. ఇతరులతో తననితాను పోల్చుకొని వారు తనని చిన్నచూపు చూస్తున్నారని భావించుకునేవాడు. ఆ అభిప్రాయం కలిగినపుడు కంపించిపోయేవాడు. నిజానికి జరగటం కూడా అలాగే జరిగింది.

సుందర్ అంటే ఇతరులకు ఒక గౌరవము, ఆదరణ లేవు. కారణం అతనూహించుకున్నట్లు కవీ, రచయిత కాక పోవటంకాదు, కొత్తవాడు కావటం; పైగా సదానందం కూడా వెనకటిలా అన్యోన్యంగా, మిత్రుడుగా వుండటంలేదు. తనంటే ఏదో చిన్నచూపు 'నువ్వు నా చేతికిందివాడివేసుమా' నన్న భావన అతనిలో సుందర్‌కి అవుపించేది. అలా భావించి కుమిలి పోయేవాడు. పైగా డబ్బుకూడా చాలక కటకటగా వుంటోంది.

మనిషిని ఉన్నతుణ్ని చేసేవి ప్రపంచంలో మూడే ప్రక్రియలు. అవి డబ్బు, హోదా, దర్పం. తన విషయంలో

మూడూ కుంటినడక నడుస్తూనే ఉన్నాయి. హోదాకూడా లేదు. డబ్బు అంతకన్నా లేదు. ఆ రెండూ లేనపుడు దర్పంగా బ్రతకటం అసాధ్యం.

"వెధవ ఉద్యోగం మానేసి ఎక్కడైనా నాలుగు ట్యూషన్లు చెప్పుకుంటేపోను" అనుకునే క్షణాలు అనేకం ఎదురయ్యాయి సుందరంకి. అది అయితే బాధ్యత లేదు, స్వేచ్ఛ. కానీ, నిజానికి సుందర్ కి అలాంటి దుస్థితిలేదు. ఆదరించి ఆలింగనం చేసుకోకపోయినా, సదానందం సుందర్ విషయంలో ఆప్యాయంగానే ఉండేవాడు. అతని భవిష్యత్తును తీర్చిదిద్దటానికి గల అన్ని అవకాశాలు పరోక్షంగా కన్పిస్తూనే ఉన్నాయి. అయితే రచనా వ్యాసంగానికి అతను బానిసగా తయారైనవాడు కావటంవల్ల, అంచుల్ని అందుకోలేక, పరిస్థితిని అర్థం చేసుకోలేక సతమతమై పోతున్నాడు సుందర్. తన జీవితానికి బాటలు వేస్తున్నాడనీ, తన ప్రగతికి తోడ్పడుతున్నాడనీ తెలుసుకోలేకపోతున్నాడు.

లీలను చూడాలన్నతలంపు అనేకసార్లు కలిగింది. లీల అదోరకం మనిషి. అందీఅందని పువ్వు. ఓరకంగా నవ్వని నంది వర్ధనం, కవ్వించగల జవ్వని. లోగడ కలుసుకున్నపుడే ఓరకమైన అవ్యాజానురాగం ఏర్పడ్డది. చెరగని చిత్రంలా మనోఫలకంమీద లీల వుండిపోయింది. దాన్ని తొలగించటం, చెరిపివేయటం సుందర్ చేతకావటంలేదు. రోజురోజుకీ మోజు ఎక్కువకావటం వల్ల అది అసంభవమే అవుతోంది. సదానందం ఎప్పుడైనా తనకు తానై ఆహ్వానిస్తే తప్ప అక్కడికి వెళ్ళకూడదనుకున్నాడు. అతను ఎదురుగా ఉంటే అదోక పద్ధతి ఆలోచనలు పిచ్చిగా, వెర్రితలలు

వెయ్యవు. మరో భావనకు అంత అవకాశం వుండదు. లిలను చూడాలనే కాంక్ష లోపల పీడిస్తున్నా సదానందం ఆహ్వానంలేని కారణంగా అది ఒక రూపం దాల్చలేకపోతున్నది.

పోతే శకుంతల, ఆలంబనంలేని లత, దుష్యంతుని వెదుకుతున్న శకుంతలలా అవుపిస్తుంది. "ఎప్పుడైనా రాకూడదా" అన్న శకుంతల ఆహ్వానం అలాగే వుండిపోయింది. అందుకే బహుశ్రద్ధే రాడు ఆరోజు.

"మూడుగంటలలోపు ఎప్పుడైనా రండి. మీకోసం ఎదురుచూస్తుంటాను" అన్నది శకుంతల ఓనాడు ప్రసంగవశాత్తు. రెండుగంటల ప్రాంతంలో వెళ్లాడు.

శకుంతల మేడ గుర్తించగలిగాడు. లోపలకు వెళ్ళాడు. ఒంటరిగా బిక్కు-బిక్కు-మంటోంది. ఎవరూ అవుపించలేదు. కాలింగ్ బెల్ నొక్కాడు అనుమానిస్తో.

పనిపిల్ల తలుపు తెరచింది.

"ఎవరూ లేరా ఇంట్లో" ప్రశ్నించాడు.

"అమ్మగారున్నారు."

"సుందర్ అని ఒకాయన వచ్చారని చెప్పు."

వెళ్ళిపోయింది.

సోఫాలో కూచుని సుందర్ గదిఅంతా కలయచూచాడు. గోడలకు పటాలు, పెద్ద ఫర్నిచర్.... పెద్ద హోదాలో ఉన్నది అలంకరణ.

కొద్దిక్షణాలు అలాగే శకుంతల అంతస్తును, హోదాను ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. అంతలోనే వచ్చింది వన

మయూరిలా శకుంతల. ఆకుపచ్చ సిల్కుచీర ధరించింది. బంగారు జరీఅంచులు కొట్టివచ్చినట్లు కనిపిస్తున్నాయి. దానికితోడు మబ్బు రంగు జార్జెట్ బ్లౌజ్ తొడిగింది. నిజంగా బంగారు శరీరానికి మెరుగులు దిద్దినట్లే ఉన్నది.

"చాలా ఆలస్యం అయింది క్షమించండి. మీరు వొస్తారని తెలీదు. కబురన్నా చేయలేదేం.... మా ఇంటికి రావొచ్చారా, అంత అదృష్టమా అనుకున్నాను సుమండీ నిజంగా మమ్మల్ని మరచిపోయినారనే అనుకున్నాను. పోనీండి. ఇప్పటికైనా జ్ఞాపకం వచ్చాను" అన్నది అలకనవ్వుతో.

"క్షమించండి. జ్ఞాపకం లేక కాదు రావాలనిలేకనూకాదు. కానీ....

"కానీ.... చెప్పండి ?"

"తీరుబడిలేక."

"అవునవును, ఇరవై నాలుగుగంటలూ ఆఫీసులోనే వుంటున్నారటగదూ" అన్నది ఎద్దేవగా.

"కాదనుకోండి. ఏమైనా అనుకుంటారని...."

మల్లెపూల గంప దొర్లించింది. ఆమె నవ్వుతో సుందర్ కూడా లీనమైపోయినాడనే చెప్పాలి.

"రండి. కూర్చోండి" అన్నది తలుపుప్రక్కనేఉన్న సోఫాలో కూర్చుంటూ. కూర్చుని ఆపాదమస్తకం పరీక్షించింది సుందర్‌ని.

"మీరు చాలా మారిపోయారుసుమా.... ఉద్యోగం వంటబట్టింది. ఊ....ఏమిటండీ విశేషాలు ?" ఆప్యాయంగా పలక

రించింది. చిరపరిచయస్తులుగా, ఆప్తమిత్రులుగా కబుర్లలోకి దిగారు కొద్దిక్షణాలలోనే. శకుంతల యిచ్చే ప్రోత్సాహమూ, ప్రోద్బలమే సుందర్‌లో ఉత్సాహాన్ని రేపే ధైర్యాన్నిచ్చింది.

మరికొన్ని క్షణాలలోనే ఇద్దరిమధ్యా అపూర్వానురాగం ర్పడ్డది. ఆత్మీయత అవరించింది. ఓ అయిదునిమిషాల సంభాషణతో విడదీయరాని సన్నిహితత్వం ఏర్పడ్డది.

"మీతో పరిచయంవల్ల అవ్యక్తమైన ఆత్మీయత ఏర్పడ్డది సుందర్" అన్నది కడాపట.

"నిన్ను నేను ప్రేమిస్తున్నాను, వాంఛిస్తున్నాను సుందర్. దీని అర్థం అదే" అని హెచ్చరిస్తోందా అనిపిస్తోంది సుందర్‌కి. ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు. శకుంతలను తనదాన్నిగా చేసుకుని, తనలో కలుపుకుని ఆమె అందాన్ని అనుభవించి, యవ్వనాన్ని తాగేయాలన్నంత తృష్ణ సుందర్ చూపుల్లో. అంతకన్నా ఎంత తరచినా ఆమె మాటలకు, చూపులకు అర్థం అవుపించడం లేదు.

ఆమె పాదాలపై వ్రాలి, ఆ పద్మాలను ఒకసారి ముద్దు పెట్టుకోవాలన్నంత ఆరాధన కలిగింది. ఆమె హృదయంలో తల పెట్టి మత్తుగా కళ్ళుమూయాలన్నంత మమత ఏర్పడ్డది. ఆ క్షణంలో ఎవరూలేరు కనక ఒక్కసారి పొందాలన్నంత ఉద్రేకమూ కావచ్చు, పశుప్రవృత్తి కావచ్చు. కాని వాటి రూపంలో మనసులో స్వర్గసీమల్నే సృష్టించుకోగలిగాడు.

"శకుంతలా వస్తా" అన్నాడు లేచి నిలబడి.

శకుంతల లేచి నిలబడి "వస్తుంటారుకదూ" అన్నది.

ఆ వాల్చూపులోని మాధుర్యానికి ఉన్మత్తుడై పోయాడు.

"శకుంతలా" అంటూ దగ్గరగా తీసుకుని ఆలింగనం చేసుకున్నాడు. ఆమె అభ్యంతరం లేకపోయేసరికి పెదాలు కొరికి వేసినంత పనిచేశాడు. ఆ నులివెచ్చని కౌగిలి . . . స్వర్గసుఖానుభూతినే ప్రసాదించి ఉన్మత్తున్ని చేసింది.

"శకూ" అంటూ సోఫాలో కూర్చుని, వొళ్లోకి తీసుకున్నాడు. శృంగార రసాధిదేవత కనికరించింది.

"రతీదేవి నీదగ్గరే పాఠాలు నేర్చుకున్నదనిపిస్తోంది" అన్నాడు. ఆ పొగడ్తకు మత్తెక్కింది శకుంతలకు. తననుతాను మరచిపోయి, సర్వం అతనికి అర్పించింది.

"ఉండు సుందర్ ఓవల్‌టిన్ తెస్తాను" అంటూ లేచింది కుచ్చెళ్లు సర్దుకుంటూ . . . పెదాలపై చెమ్మ తుడుచుకుంటూ.

"ఎందుకు శకూ . . . అమృతభాండం అరచేతిలో పెట్టుకుని అరకప్పు ఓవల్‌టిన్‌కోసం అర్రులుచాచమంటావా, వెర్రివాణ్ని కమ్మంటావా."

"ఊ!" అంటూ నోరు నొక్కింది.

"వొద్దు. మరొక్క ముద్దు."

"అబ్బ. ఎంతాశ అబ్బాయికి."

"ఆశలేనిదే బ్రతకగలనా."

"మళ్ళీ వస్తారుగదూ."

"రాకుండా వుండగలనా" గుండెలనిండుగా ప్రేమ నింపుకుని వెళ్ళిపోయాడు సుందర్.

జీవితంలో సాధించలేను అనుకున్న వస్తువును సాధించినపుడు పొందలేను అనుకున్న అనుభవాన్ని పొందినపుడు కలిగే అనుభూతి, ఆనందం ఆక్షణంలో సుందర్ అనుభవించాడు. గుండె నిండుగా, మనసు పండువుగా ఉన్నది. జీవితానికి, తపస్సుకు పరిపూర్ణత సిద్ధించబోతున్నపుడు యోగులు పొందే ఆనందం అది. వలచిన వనిత దరిచేరినపుడు భోగులు పొందే తృప్తి అది.

సదానందంతో మాటమాత్రంగా చెప్పాలనుకున్నాడు శకుంతల ఇంటికి వెళ్ళివచ్చాను అని. కానీ చెప్పలేదు. ఆ ఆనందం ఇతరులు పంచుకోవటం ఇష్టంలేదు. మనసులో దాగిన మధురానుభవం, మనసులో నిక్షిప్తమై వుంటేనే దాని అందం, ఆనందం రసజ్ఞత, సరసత. అది నలుగురికీ తెలిసినపుడు దాని పరిమళం పదిమందీ పంచుకున్నట్లవుతుంది. పల్చబడిపోతుంది. అందుకే భోగులు రహస్యమార్గాన్నవలంభిస్తారు. తాముచేసిన శృంగార చేష్టల్ని ఎవరికీ తెలియనీయరు. అవధుల్లేని ఆనందానికి అడ్డుగోడలు నిర్మించినట్లే అవుతుంది ఇతరులకు తెలిస్తే. అందుకే ఎవరికీ చెప్పక, చెప్పలేక, తనలో ఇముడ్చుకోగలిగాడు. కొన్ని రోజులు ఆనాటి సంఘటనను తలపోస్తూ కాలం గడిపేయగలిగాడు

మధురంగా. అయితే రోజులు గడచినకొలదీ ఆమెను చూడా లన్న కాంక్ష ఎక్కువకాజొచ్చింది. ఆమె సాన్నిధ్యంలోకి చేరాలని. భగవంతుని సాన్నిధ్యంలోకి చేరాలనే భక్తుని ఉబలాటం అది. ఆమె రూపులోని సోయగాలు కొన్ని క్షణక్షణం సుందర్‌ని కలవరపెడుతూనే వున్నాయి. ఆ శరీరం, సౌకుమార్యం, మిలమిల లాడే కళ్లు, కవ్వించే చూపులు, నవ్వించే మాటలు, అన్నింటినీ మించిన హృదయవైశాల్యం. ఆమెతో గడపిన ఆ ఒక్కగంట మధురంగా, మధురాతిమధురంగా అవుపిస్తుంది. ఆమెను కాదని, మరచిపోలేకపోతున్నాడు. ఎంతకాదని వైరాగ్యభావాన్ని కల్పించుకున్నా, ఆమె తనదేనన్న తలంపు బలంగా తోస్తోంది. అదొక వింత ఆకర్షణ. అనుభవం, అనుభవంలో పొందిన అనుభూతి.

కొన్నిరోజుల తర్వాతగానీ మళ్ళీ అక్కడకు వెళ్ళటం కుదరలేదు.

హాలులోపల అడుగుపెట్టేసరికే పాప ఎదురైంది.

"ఏం పాపా! బావున్నావా ?" ప్రశ్నించాడు.

"అమ్మ స్నానంచేస్తోంది కూర్చోండి. చెప్పివస్తాను" అని గబగబా లోపలకు పోయి మరుక్షణంలో వచ్చింది.

"ఏం పాపా బాగా ఆడుకుంటున్నావా ?"

"ఓ . . . నాకే బోల్డు ఆటలు వచ్చు."

"నాతో ఆడతావా."

"అమ్మో ఎంతాశ . . . సీతో ఆడను. నువ్వు పెద్ద వాడివిగా. అమ్మ కోప్పడుతుంది."

"అయితే ఇలారా సీతా మాట చెబుతా."

దగ్గరగా వచ్చింది ...

వచ్చిన పాపను వొళ్లో కూర్చోపెట్టుకుని మాటలు ప్రారంభించాడు సుందర్.

"పాపా ... ఏమిటమ్మా అది కొత్తా, పాత లేకుండా. వొళ్లో కూర్చోవటం తప్పుకాదూ!" అంటూ శకుంతల రానే వచ్చింది.

చప్పున పాప దిగిపోయింది.

"పో. వెళ్ళి దొడ్లో ఆడుకో" అన్నది.

పాప వెళ్ళిపోయింది.

"మళ్ళీ ఇప్పటికి జ్ఞాపకం వచ్చానా సుందర్" అన్నది కూర్చుంటూ.

"ఏమిటది కొత్తా పాతా లేకుండా. అలాదూరంగా కూర్చుంటూరా తప్పుకాదూ!" ... అన్నాడు సుందర్.

"ఊఁ ఆశ."

చేతులు చాపాడు సుందర్. చేతులు అందిస్తూ ...

"ఉహుఁ" అదోలా చూస్తూ.

ఒక్కసారిగా చేతుల్లోకి తీసుకుని వొళ్లో కూర్చోపెట్టుకున్నాడు.

"ఏం. కోపంవచ్చిందా శకుంతలాదేవి" అన్నాడు చుబుకాన్ని పట్టి మొహం పైకెత్తుతూ ...

"రోజూ ఇంకా వస్తావు, ఈరోజు వస్తావని ఎదురు

చూస్తున్నాను సుందర్. మీ ఆఫీసుకు కబురు చేద్దామనుకున్నాను కూడా."

"చేయకపోయావా."

"చేశానుగా ... మనసు రమ్మని పిలిచిందిగా. నువ్వొస్తున్నావనీ సమాధానం చెప్పింది మనస్సు."

"అబ్బా ... నేనంటే నిజంగా అభిమానం వున్నదనీ, రాగానే వచ్చి ఇలా వొళ్లో వాలిపోయి, సోలిపోయేలా చేస్తావని తెలిస్తే రాకుండా వుంటానా!"

"అబ్బ ఊరుకుందురూ!"

"రేపు ఆదివారం రండి ... లీల, సదానందం కూడా వస్తారు. సరదాగా గడుపుదాం."

"శకుంతలా ఒకమాట అడగనా."

"అడగండి."

"నేనంటే నీ కెందుకింత ప్రేమ."

"అందుకే" అన్నది పెదాలు అందిస్తూ ...

మత్తుగా సోలిపోయాడు సుందర్.

* * *

ఆదివారం ...

ఉదయమే లేచి శుభ్రంగా గెడ్డం గీసుకున్నాడు. ఇస్త్రీ బట్టలు సిద్ధంచేసుకున్నాడు. ఏ గవర్నరుతోనో, మినిస్టరుతోనో ఇంటర్వ్యూకి వెడుతున్నంత ఆర్భాటం. ఏవేవో ఆలోచించాడు. అనుకున్న వేళకు ముందుగానే చేరాడు. అప్పటికే సదానందం

వచ్చివున్నాడు. మనిషి తనలా ముస్తాబయి లేడు. మామూలుగా వున్నాడు.

"రావోయ్ సుందర్ నీకోసమే ఎదురుచూస్తున్నాం" అన్నాడు ఆప్యాయంగా.

ఈమధ్యకాలంలో సదానందం ఇంతటి ఆత్మీయతను ఎప్పుడూ కనపరచలేదు. ముభావంగా వుండేవాడు. తనొక పెద్ద అధికారిలా, ఉన్నతుడుగా మెలగుతుండేవాడు.

ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు సుందర్.

"శకుంతలకు ఆదివారం పార్టీ యివ్వటం, మేం ఇలా తీసుకోవటం అలవాటే. సరదాగా ఓరోజన్నా మిత్రులతో గడపటం హాబీ . . . నీకు ఇదే మొదటిసారికదూ."

చిరునవ్వు నవ్వాడతను.

"లీలాదేవిగారు రాలేదండీ?" ప్రశ్నించాడు.

"వచ్చిందోయ్. లోపలున్నది. అన్నట్లు ఈమధ్య నా ఆరోగ్యం ఏమీ బావుండటంలేదు. పని ఎక్కువ. నీకు తెలియనిది ఏముంది. అన్నీ నేను చూచుకోవలసిందేగదా. ఏమిటో వ్రాసిన బ్రతుకు ఒకవిధంగా చూస్తే. ఎంత తెలివితేటలుంటే మాత్రమేం జీతానికి జీవితాన్ని అమ్ముకోడమే అయింది"

నిజంగానే సదానందం పత్రిక బరువు బాధ్యతలన్నీ నెత్తిన వేసుకుని మోస్తుంటాడు. ఎవరూ కాదనరు. అందుకు సమర్థుడు కూడాను.

అంతలోనే శకుంతలా, లీలా వచ్చారు కిలకిలమంటూ. వారి రాకతో గదిలో వెయ్యిదీపాలు వెలిగించినట్లయింది.

"నమస్కారం లీలగారూ" అన్నాడు సుందర్.

కోపంగా ఓ చూపు విసిరింది. కానీ సమాధానంలేదు.

"కోపం వచ్చిందాండి ... క్షమించండి."

"క్షమించాలి. ఎందుకు? మా విషయం జ్ఞాపకంవుందా."

"సారీ ... లీలాదేవిగారూ."

"అవునులే ఏదో ముతకసామెత చెప్పినట్లు ముందొచ్చిన చెవులకంటె వెనకాలవచ్చే కొమ్ములే వాడట. శకుంతలమాత్రం చెయ్యలేదు మేము."

"అని ఎవరన్నారండీ ... అంత ఆగ్రహిస్తారు?"

"అవున్లే. శకుంతలంటే వేరుమరి."

"క్షమించండి. అలాఅంటే నేనేం సమాధానం చెప్పలేను. రాలేకకాదు రాకపోవటం."

"ఊఁ అంతా రెడీ" అన్నది శకుంతల.

అప్పటికే టేబిల్ మీద డిన్నర్ రెడీగా ఉంది. ఎదురెదురుగా కూర్చున్నారు. శకుంతలకు ఎదురుగా సుందర్. లీలకు ఎదురుగా సదానందం.

"ఎక్స్‌క్యూజ్ మీ లీలా ... చలిగా వుంది. ఆ కిటికీ తలుపులు వేద్దామా ... అభ్యంతరం లేకపోతే" ... అన్నాడు సదానందం.

"అలాగే...అసలే ఆరోగ్యం బాగులేదన్నారు. పైగా కొంచెం చలిగా కూడా వుంది" అని లేచి వెళ్ళి రెక్కలుమూసి వచ్చాడు సుందర్.

"అందుకే మిమ్మల్ని ఈ పార్టీలు, ప్రయాణాలు మానుకోమనేది. ఎక్కడ పార్టీ అన్నా తయారు, ఎక్కడ మీటింగన్నా తయారాయె...డాక్టరు సలహా కూడా చెవిని పెట్టకపోతే ఎలా?" అని రుసరుసలాడింది లీల.

"తీసుకోండి సుందర్."

భోజనం అయింది. తీరిగ్గా కూర్చుని ఆకులు వేసుకుంటూ అన్నది లీల.

"ఎవరి యిష్టంవచ్చినట్లు వారు సంచరించే హక్కువుంటే ఈ లోకంలో ఇంక లేనిదేముంటుంది. అంతకుమించి మనిషి కోరేదీ, కోరదగిందీ వుండదు. అయితే ఎవరి ఇష్టానుసారం వారిని ప్రవర్తించకుండా ఆపేది సంఘం, కట్టుబాట్లు. లోకం అంటే వుండే భయం...ఏం సుందర్ అవునంటావా?"

మానవుడు కలిగే కోర్కెల్ని నెరవేర్చుకోనూ లేడు, నిగ్రహించుకోనూ లేడు. రెంటిమధ్యపడి నలిగిపోతుంటాడు. అలా కలిగిన కోర్కెల్ని నెరవేర్చుకోగల అదృష్టవంతులెందరుంటారు సుందర్. క్షణంలో భావనకు బానిసై దోసిలొగ్గి, తప్పుచేసి ఆత్మవంచన చేసుకోనివారెందరుంటారు. ఒక్కొక్క క్షణంలో కలగరాని కోరిక కలుగుతుంది. రాకూడని ఆలోచన వస్తుంది. ఆ క్షణంలో అది నిజమేనని, తప్పుకాదనే సమర్థింపు కలుగుతుంది. ఆ భ్రమలో ఆ తప్పునే చేసితీరుతాం. మానసికంగా, లోలోపల చేసే తప్పుకు లోకం గర్హించదుగా...

లీల మనసులోని ఆరాటం ఏమిటో, అవి ఏ అర్థాన్ని ప్రతిపాదిస్తున్నాయో ఎవరికీ తెలియలేదు. నిజానికి ఆ భావనకు

ప్రేరణ ఎవరో, ఏమిటో కూడా తెలియదు. లోకం అంటుందనీ, అనుకుంటుందనీ వెరిసి, లాభంలేదు. 'నేనో' అన్నట్లుగా వున్నది లీల భావన, ప్రేరణ.

సుందర్ ఎంత ఆశ్చర్యంగానో చూచాడు ఆమెవైపు. అంతగా అర్థంకాలేదు సదానందానికి.

"నీవన్నది నిజం లీలా...దాన్నే నీతి అంటారు" అన్నాడు సదానందం.

శకుంతల టేబుల్ క్రిందుగా కాలితో సుందర్‌ని గిల్లి, కళ్ళల్లోకి చిలిపిగా చూచింది.

సుందర్ కళ్లు వొంచి లోలోపల నవ్వుకున్నాడు.

మిగిలిన యిద్దరూ ఏమీ తెలియక మౌనంగానే వుండి పోయారు.

తర్వాత సుందర్ ఉపన్యాసం ప్రేమవైపు నడచింది.

"ప్రేమ అనేది శాశ్వతం కాకపోవచ్చు. కానీ అదే చివరిది. మనిషిని సమున్నతశిఖరాలకు తీసుకుపోగలిగింది ప్రేమ. ప్రేమించలేని వ్యక్తి అంధుడు, బధిరుడు. ప్రేమ లేకపోతే దాంపత్యాలు లేవు. మనిషికీ మనిషికీ మధ్య, స్త్రీకి పురుషునికీ మధ్య అనురాగంకానీ, అనుబంధంకానీ లేకుండటానికి వీల్లేదు. ఆ పవిత్రమైన అనుబంధమే లేకుంటే బంధుత్వాలు లేవు, నమ్మకాలు లేవు మరేమీ వుండవు. అపుడు సృష్టికే అర్థం అవుపించదు. అర్థరహితం యావత్ ప్రపంచమున్నూ. హృదయాలను పునీతం చేయగలిగింది ప్రేమ. అసూయలు, ద్వేషాలు ఇవి ప్రేమలేని చోట గూళ్లుకట్టుకుని స్థిరనివాసం ఏర్పరచుకుంటాయి.

ఇలా తన అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు సుందర్.

శకుంతల కల్పించుకున్నది.

"బాగాచెప్పారు సుందర్. నిజంగానే జీవితంలో ఉన్నత మైంది ప్రేమ ఒక్కటే. అయితే తలకుమించిన కోర్కెలతో, వాంఛలతో ఆ ప్రేమను అపవిత్రం చేసుంటాం."

"ప్రేమించి హృదయం ఇవ్వగల స్త్రీకంటె కోరగలిగిం దేముంటుంది."

శకుంతల భావన, కల రేయిరూపాలు ధరించింది ఏవేవో ఊహిస్తూ, ఊహాలోకాల విహరిస్తూ, ఊహాగానాలనే చేస్తూ తన్మయం చెందింది.

సుందర్ అంటే ఆమెకు మొదట కలిగింది ఆకర్షణ. క్రమేణా అది విడదీయరాని అనురాగంగా మారింది. అదే నరా లను జివ్వుమనిపిస్తోంది ఇపుడు ఒకరినొకరు చూపులతో, వలపు లతో లీనంచేసుకుంటున్నారా అనిపిస్తోంది.

"నేను ఒకర్ని ప్రేమిస్తున్నాననే అనుకుందాం. ఆమె చుట్టూ గూడుకట్టుకుని ఉన్న వాతావరణం, పరిస్థితులు నాకు అవుపించనంత గుడ్డివాణ్ని అయిపోతాను. కారణం?" అడిగాడు సుందర్.

"సుందర్. చేతులు కలిపినంతమాత్రాన, చూపులు కలిసి నంతమాత్రాన ప్రేమ కలిగిందనీ, ఆ వ్యక్తి నిన్ను ప్రేమిస్తున్న దనీ అనుకోవటం భ్రమ. కొంగుతగిలితే చిత్తయిపోయే అల్పులూ వుంటారు. రంభలాంటివారొచ్చి మీదపడ్డా చలించని వారూ వుంటారు. దానికేం ఆ తేడా ఎప్పుడూ వుండేదే. ఈ

రోజుల్లో ప్రేమంటే అంత చవకగా దొరుకుతోంది. ఓ చీకటి సందులో కనిపించిన ఓ అమ్మాయిని కొంగుపట్టుకు పిలిచి 'నిన్ను ప్రేమిస్తున్నాను' అంటావు. హా! ప్రియా నీకోసమే ఎదురు చూస్తున్నాను కళ్లు కాయలుకాచేలా అంటూంది ఆ లలన. మరో గంటతర్వాత ఎవరెవరో ఇద్దరిలో ఏ ఒక్కరికీ తెలియదు. అసలు ఆ గంటలో కూడా ఒకరిమొహాలొకరు స్పష్టంగా చూచుకోరేమో!

లీలకు ఈ సంభాషణ బొత్తిగా నచ్చలేదు.

ముభావంగా వుండిపోయింది.

"దాన్నే ప్రేమ అంటారా?" అన్నది సదానందం కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూస్తో.

"అనను లీలా, కానీ నీకు ఇలాంటి విషయాలు సరిపడవని నాకు తెలుసు. మరి శకుంతల అభిప్రాయమేమో!"

"నాకేం అభిప్రాయం లేదండీ" అన్నది ముభావంగా.

ఇంకా అదేవిషయాన్ని పొడిగించడం యిష్టంలేదు.

లీల అభిప్రాయం నగ్నంగా, బరువుగాఉన్న అంతర్యంలో అపవిత్రత లేదని అందరూ అంగీకరిస్తారు. తన భావాలను తెగవేసి ఖండితంగా చెప్పటం, వాటిని ఎదుటివారు ఆమోదించినా, ఆమోదించకపోయినా సంతృప్తిగా వుండటం లీల అలవాటు. పైకి ఏమీ ఖండితంగా అనకపోయినా, పెదాలుదాటి మాట బయటకు రాకపోయినా శకుంతల తత్వం వేరు.

వారిద్దరి సంభాషణ విని సదానందం, వైరుధ్య వ్యక్తుల్ని చూచి పకాలున నవ్వాడు.

"ఘుర్షణ పెంచుకోకండి ప్రమాదం."

జాంతో సంభాషణ ఆగిపోయింది.

శకుంతల నిజానికి చాలా ఆనందంగా, సంతృప్తిగా ఉన్నది. లీల ముభావంగానే వుండిపోయింది. సుందర్ జ్ఞానోదయం అయిన వాడిలా కూర్చున్నాడు. ఓ సిగరెట్ వెలిగించాడు ఆనందం పట్టలేక. సదానందం కూడా ఓ సిగరెట్టు వెలిగించాడు. అంత లోనే కొంపమారి దగ్గు ముంచుకొచ్చింది. వచ్చింది క్షణాలో ఉధృతమైంది కూడా. గొంతుమంటతో తల్లకిందులైనాడు. ఊపిరి సల్పింది కాదు. మొఖం అంతా ఎర్రబారిపోయింది. కళ్లలో నీళ్లు తిరిగినయ్. జేబుగుడ్డతో కళ్లు, మొహం వొత్తుకున్నాడు.

"నా పిచ్చికాకపోతే ఆరోగ్యం బాగులేనపుడు ఈ పార్టీ లకు రావడం ఏమిటి తగుదునమ్మా అని" అన్నది లీల.

పాపం, సదానందం ఆనందం అంతా క్షణంలో హతమై పోయింది.

"లీలా... వెళదామా. కొంచెం ఫీవర్ కూడా వచ్చి నట్లుంది" అన్నాడు సదానందం.

"నేను మీ కూడావచ్చి ఇంటిదాకా దిగబెడతాను" అన్నాడు సుందర్.

"ఎదుకు సుందర్ నీక్శ్రమ. వొద్దులే."

"ఫరవాదులేదు లెండి."

"సరే నీ యిష్టం."

"నేనూ వస్తా" నంటూ శకుంతల బయలుదేరింది.

నలుగురూ బయల్దేరారు టాక్సీలో.

సదానందం ఇంటిదగ్గర టాక్సీ ఆగింది.

"ఇంక నే వెళ్ళివస్తా" నంటూ సెలవుపుచ్చుకున్నాడు సుందర్.

"నేనూ వెళ్లొస్తానే లీలా ... వుండండి సుందర్ గారూ నేనూ వస్తున్నా."

తిరిగి టాక్సీలో సుందర్, శకుంతల బయలుదేరారు వెనకసీట్లో ఇద్దరూ కూర్చున్నారు.

రాత్రి తొమ్మిదికావటంవల్ల బజార్లు చీకటిగా ఉన్నాయి. ఎక్కడో వీధిదీపాలు టాక్సీలోపలకు నాటి వెలుగు అంతగా పడదు.

సుందర్ కి శకుంతలమీద మక్కువ ఎక్కువైంది. మనస్సు ఆమెవేపు లాగుతూంది. వెనకగా చెయ్యివేసి, నడుంచుట్టి, దగ్గరగా తీసుకున్నాడు.

"శకుంతలా !"

రోడ్డు మూల తిరగటంలో షాపుల్లోని వెలుగు టాక్సీలోకి చొరబడ్డది సుందర్ చేతి వేడిలా, దొంగలా...

"ఊఁ ... ఏమిటి సుందర్ ?"

ఏమని చెప్పగలడు. ఆ ఉద్రేకాలను, ఉద్వేగాలను మాటలు వ్యక్తంచేయగలవా? లేదు.

"ఎందుకు?" అని ఆ మధురక్షణంలో స్త్రీ ప్రశ్నిస్తే.

ఆ ప్రశ్నకు సమాధానం పురుషునివద్ద లభించక తల బ్రద్దలైపోతుంది.

అందుకే మరీ దగ్గరగా తీసుకున్నాడు సమాధానంగా.... ఆమెను అలా పొదివి పట్టుకోవడంవల్లనే తన అభిమతం ఏమిటో తెలియచేసినట్లయింది. ఆ చూపులు, ఆ వలపులు అంటున్నాయి "నిన్ను నేను కోరుతున్నాను శకుంతలా! నువ్వునాకు కావాలి ఈ క్షణంలో....నేను నిన్ను కోరుతున్నాను, ప్రేమిస్తున్నాను" అన్నట్లు. అలాఅని నోరువిప్పి చెప్పలేదు. కానీ భయం, పిరికితనం. వాణికే పెదాలు ఏమీ అర్థాన్ని అందించలేకపోతున్నాయి చీకటిలో.

ఆమెకూడా అదేస్థితిలో వున్నదేమో కాదనీ, ఔననీ అనలేదు. అచలంగా ఒదిగి వొళ్లో వాలిపోయింది. అతని హృదయంలో వాలిపోయింది. ముంగురులు సరిచేస్తూ, బుగ్గలు స్పృశిస్తూ ఏదో ఆనందాన్ని పొందుతున్నాడు సుందర్.

ఆమె మనసు ఎలాఉన్నదో! ఏ అభిప్రాయం ఉన్నదో స్త్రీ హృదయం అర్థంచేసుకోగల సత్తా పురుషునకేదీ? లేదు. సుందర్ అంతకుమించి తన అభిప్రాయాన్ని వ్యక్తంచేయలేడని ఆమెకు తెలుసు. తనకా ధైర్యంలేదు. ఒక్కమాట మాట్లాడితే నిశ్శబ్దాన్ని ఛేదించవచ్చు. అయితే మాట పెదాలు దాటగానే శకుంతల తపోభంగమై లేచిపోతుందనీ, ఆ స్వర్గానుభూతి దూరమవుతుందనీ భయం. ఆమె దూరమైతే భరించగలడా! ఏమో మొండిధైర్యం చేయాలనిపిస్తుంది. తనది పశువాంఛ కావచ్చు. కానీ తీర్చుకోవాలనే ఆరాటం, కోరిక లోపల.

అదేక్షణంలో శకుంతలలోనూ అలాంటి సంచలనమే కలిగింది. నరాలు జివ్వున లాగినాయనిపించింది. ఆమెలోని కదలికే

ఆహ్వానంగా స్ఫురించింది. ఆ ఆహ్వానంతో, ఆ భావన కల్గించిన ప్రేరణతో ఆపాదమస్తకం చలించాడు సుందర్. నిలువెల్లా పులకరించింది. శకుంతలను దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు. చేతివేళ్లు వెచ్చవెచ్చగా, మెత్తని ప్రదేశాల్ని వెదుక్కొంటూ వెళ్ళి నగ్నభాగాన్ని స్పృశించినయ్.

శకుంతల సుందర చేష్టలకు చలించింది. భయంతో కంపించింది. ఒక్కసారిగా ఎదురుతిరగాలని, కోర్కెలకు లొంగిపోగూడదనీ భావించింది. కానీ ఆశక్తిలేదు. పురుషుని ఆలింగన మాధుర్యాన్ని చవిచూస్తున్నంతసేపు ఏ స్త్రీ అలా చేయలేదు. ఎదిర్చి దూరంగా పోగల ధైర్యం, శక్తి కోల్పోతుంది సహజంగా. అందుకే స్త్రీ సహజమైన బలహీనతతో లొంగిపోయింది. ఆటే కాలం జాప్యం చేయగల శక్తిగానీ, నిగ్రహించుకోగల శక్తిగానీ సన్నగిలింది ఆమెలో.

అంతలోనే టాక్సీ వాకిట్లో ఆగింది. ఏదో మాట్లాడాలనీ, తన కృతజ్ఞత తెలియజేయాలనీ అనుకున్నాడు. కానీ మాట్లాడే అవకాశం కలగలేదు. ఓ క్షణం కదలలేకపోయింది కూడా. ఏవో మధుర భావనలతో, ఊహాస్వర్గాల్లో వ్రుండిపోయింది.

"ఇంటికొచ్చేశాం దిగు శకుంతలా" అన్నమాటతో ఈ లోకంలోకి వచ్చింది.

"మళ్ళీ ఎప్పుడు రమ్మంటావు ?"

"రేపు మధ్యాహ్నం" అన్నది మత్తుగా చెవిలో ఊదినట్లు. శకుంతల లోపలకు వెళ్ళిపోయింది చీకటిని చీల్చుకుంటూ.

టాక్సీవానికి డబ్బిచ్చి పంపి, చీకటి బజార్లగుండా నడక సాగించాడు.

హృదయం ఆనందంతో పరవశించిపోతోంది.

చివరకు ఎలాఅయితేనేం ఓ స్త్రీ ప్రేమను, హృదయాన్ని చూరగొనగలిగాడు. అదీ అనాఘ్రాతం కాదు, ప్రబంధకన్య కాదు, సినీమానటి వంటిదేమో! వివాహిత. ప్రపంచానుభవం, పురుషానుభవం రుచిచూచి, ఎక్కువగానే అనుభవించిన ఓ పడతి. అంతా అనుకోకుండా జరిగిపోయింది. తానెన్నడూ అనుకోలేదు ఇలా.... ఓ వివాహితతో పరిచయం ఏర్పడుతుందని.... కానీ అలా జరిగిపోయింది విధి లిఖితం.

ఇదివరలో అనుకునేవాడు సంపన్నకుటుంబాలలో స్త్రీలు ఎంతో పవిత్రంగా, నిండుగా, హుందాగా వుంటారని. అలాంటి వారిని పొందడానికి ఎన్నోసంవత్సరాలు ప్రయాస అవసరమని. మెహర్బానీ కోసం ఎంతో డబ్బు ఖర్చుచేయవలసివుంటుందని అనుకునేవాడు. ఎన్నో బహుమతులు అసంఖ్యాకంగా యిస్తేగానీ, ఏ కులీన కుటుంబంలోని స్త్రీతో పొత్తుకుదరదని భ్రమపడేవాడు. కానీ ఇపుడు అలాకాదు, పరిచయమైన తొలి స్త్రీ ఆకర్షితమైంది. ఏ శ్రమ లేకుండా ఆమెను తనదాన్నిగా చేసుకోగలిగాడు. ఆ అవకాశం ఏర్పడ్డందుకు సంతోషించాడు.

"రేపు వస్తాను ఏం జరుగుతుందో? శకుంతల నాది. నాకోసం తపిస్తోంది" అనుకున్నాడు మనోహరు సంతృప్తిగా.

లీలగా అనేకభావాలు ఏర్పడ్డాయి. అనేకరూపాలు కళ్లముందు మెదుల్తున్నాయి. విజయం సాధించినట్టే. ఆమె ప్రేమలో

పేరు, ప్రతిష్ఠలు సంపాదించవచ్చు. డబ్బు సంపాదించవచ్చు. శతకం తల బాగా డబ్బున్న స్త్రీ. వినీల ఆకాశంలోని మేఘాలలో నుండే అనేకమంది స్త్రీలు రకరకాలవారు, అందాల రాణులు తొంగిచూచారు. అందులో ధనికులు, కులీనులు, ఉన్నతోద్యోగులు ఉన్నారు. అందరూ ఒకరితర్వాత ఒకరు వచ్చి తనని పలకరించారు. అంతలోనే మాయమైపోయారు. తన బంగారు కలల్లో కరిగిపోయారు. ఈ స్త్రీలందరూ తనకోసమే ... ఒక్కొక్కరూ తనకోసం తహతహలాడుతున్నట్లు భావించాడు.

అలాంటి భావనతోనే నాటిరేయి కన్నుమూశాడు. మగత నిద్రలో లెక్కలేనన్ని కలలు కన్నాడు.

౯౨

# 9

రాత్రి తెల్లవారి సుందర్ విపరీతంగా ఆలోచించాడు. శకుంతలతో ఇంతకాలం పరిచయం అయితే వున్నదిగానీ ఇతరత్రా సంబంధం ఏమీ లేదు. ఆ మధురక్షణంకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాడు తను. ఆమె కొంగుతగిలితే, చేయితగిలితే కొంచెం శరీరం మెరిస్తే పులకరించి పునీతుడైనట్లు భావించేవాడు మొదట. ఆమె వాడిచూపులు తన చూపులతో మేళవించినపుడే అపూర్వానుభూతి పొందేవాడు. శరీరం గగుర్పొడిచేది కొన్నిపట్ల. ఆతర్వాత ఆమెని చేతుల్లోకి తీసుకుని, గాఢంగా ఆలింగనం చేసుకుని అలసిపోతేగానీ తనివితీరేదికాదు, తృప్తి వుండేదికాదు. ఆతర్వాత కౌగిలింతలో అధరామృతాన్ని గ్రోలి, సోలి, సొక్కిపోతేగానీ నిద్రపట్టేదికాదు. ఆ ప్రథమావస్థలన్నీ దాటిపోయాయి ఇపుడు.

ఇపుడు శకుంతల ఓ రతీదేవి. తనొక మన్మధుడు. చీకట్లనే వెన్నెలలుగా వెలిగించి, వెలయించగల తపన తనది ఆమెదీ కూడా.

"రేపు రండి" అన్న ఆహ్వానమే గంగవెర్రులెత్తించింది. మధురసీమలకు పయనింపచేసింది సుందర్ని. అది వ్యామోహం గానీ, ప్రేమగానీ, కామంగానీ, మరేమైనాగానీ, ఆరోజు దాని

కోక అలసట ఏర్పడితీరుతుంది అన్న ఆలోచన వచ్చినపుడు తనలో తనకే సిగ్గయి, నవ్వుకున్నాడు కొత్తపెళ్లికొడుకులా ... ఆమెను స్మరిస్తూ గంటలు నిమిషాలుగా గడిపేశాడు.

తీరా వెడితే ఆశించినట్లుగాక మరోలా అయితే ఆమె భర్త ఎదురైతే. ఆమెనుండి సంపూర్ణ సహకారం లభించకపోతే. 'నాకలాంటి కోరిక లేదు సుందర్' అంటే, తను కోర్కెను వెల్లడించినా కాదని ఎదిరిస్తే, అసలు తనను ఆహ్వానించకపోతే...

ఛీ ... పాడు ఆలోచనలు అర్థంలేదు. అలా ఎన్నటికీ జరగదు. అలా అనలేదు, అనదు శకుంతల అని మనస్సు హెచ్చరిక చేస్తోంది. "ఆమె హృదయం నాకు తెలుసు" అనుకుని సంతృప్తిపడ్డాడు.

అనుకున్న వేళకు శకుంతల ఇంటిముందు ఆగాడు. తలుపు వేసి వుంది. అనుమానాలను త్రెంచుకుని వెళ్ళి తలుపు తట్టాడు. లోపల భయం. పసిపిల్ల ఎదురుగావచ్చి తలుపు తెరిచింది.

"అమ్మగారున్నారా?" అడిగాడు. గొంతుకలో అనుమానం.

"రండిబాబూ ఉన్నారు."

"డ్రాయింగు రూంలోకి దారితీసింది."

"వస్తారు కూచోండిబాబూ... చెప్పివస్తాను."

వెళ్ళిపోయింది.

నిలువుటద్దంలో తన ప్రతిబింబం కనిపిస్తోంది. వెళ్ళి దగ్గరగా నిలబడి, చొక్కా కాలరు సరిచేసుకున్నాడు. క్రాపు సవరించుకున్నాడు.

అంతలో వెనక పడకగది తలుపు తెరుచుకుంది. అక్కడ అద్దం ముందు నిలబడి ముంగురులు సవరించుకుంటోంది శకుంతల. అద్దంలోంచి సుందర్‌ని చూచింది. చూచీచూడనట్టే సుందర్ చూచాడు దొంగలా. చూడనట్లు అభినయించలేకపోయాడు. కళ్లు ఆమె సౌందర్యానికి అయస్కాంతంలా ఆకర్షించబడ్డాయి. ప్రతిబింబమే తనను ఆహ్వానించింది. అద్దాల లోతుల్లో ఒకరి నొకరు చూచి పలకరించుకున్నారు.

• సుందర్ వెనుతిరిగి గదిలోకి పరుగెత్తాడు. "శకూ.... శకూ...." అంటూ.

ఆమె చేతులు చాసింది. చేతుల్ని ప్రక్కగా తీసి గుండె లకు హత్తుకున్నాడు. మీదికి తీసుకున్నాడు. తలయెత్తి సుందర్ కళ్ళలోకి చూచింది.

స్పందించే పెదాలు చుంబించినయ్.

"ఎంతమంచిది శకుంతల నేననుకున్నట్లు...ఏమీకాలేదు అదృష్టం" అనుకున్నాడు. తర్వాత కూడా మాట్లాడలేక పోయి నాడు ఆ చూపులో ఆరాధన తప్ప మరేమీ అపుపించటంలేదు.

"సర్వం నీకే అర్పించాను సుందర్, నీ యిష్టం. నన్ను సుఖపెట్టు" అన్నట్లున్నాయి ఆమె చూపుల తూపులు.

ఆమె నవ్వింది. ఆ నవ్వులో స్త్రీ తన కోర్కెను, అంగీ కారాన్ని, శరీరాన్ని నీకే స్వాధీనం చేశానన్న భావన తోస్తుంది. నెమ్మదిగా అన్నది:

"ఎవరూ లేరు ఇంట్లో...పాప బడికి వెళ్లింది. పనిపిల్లను పంపివేశాను."

ఒక్క నిట్టూర్పు విడిచి, భారం తీరిపోయినట్లుగా ఇంకా దగ్గరగా తీసుకున్నాడు." ఈ సౌందర్యం అంతా నా కోసమేనా శకుంతలా. నేనంటే ఎంత ఆపేక్ష నీకు."

సుందర్ చేతుల్లో ఇమిడిపోయింది. సుందర్ తనకు నిజంగానే భర్త అయినట్లు, తను అతని భార్య అయినట్లు, అది తొలి రేయిగా భావించింది. అంత ఆత్మీయతను ప్రదర్శించింది.

"నేనంటే కోపం లేదుకదూ శకూ" అన్నాడు.

సుందర్ నోటికి చేయి అడ్డంపెట్టి "ఉష్" అన్నది..

కొద్దినిమిషాలు మౌనంగా కూర్చున్నారు. సుందర్ తొడలపైన శకుంతల, ఒకరినొకరు చిలిపిగా చూసుకుంటూ. పెనవేసుకున్న వేళ్లు, శరీరాన్ని తాకిన భాగాలు వేడిగా ఉన్నాయి.

"ఊఁ అలా సోఫాలో కూర్చుందాం."

"తలుపు గడియవేస్తా."

తనేవెళ్ళి తలుపు గడియవేసి వచ్చింది.

దూరంగా సోఫాలో కూర్చున్నది.

"దగ్గరగా రాకూడదా."

వచ్చింది. పక్కనే కూర్చుంది.

మరుక్షణంలో తనమీదికి లాక్కుని వొళ్లోకి తీసుకున్నాడు చిలిపిగా... మొఖాన చేతులు అడ్డుపెట్టుకుంటే తొలగించి ముద్దు ముద్రించాడు పెదాలపైన.

చేతుల్లోకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాక దూరంగా నెట్టింది.

"ఎవరైనా చూస్తారు."

"ఎవరుచూస్తాగు శకుంతలా తలుపువేశాంగా."

"ఇపుడుకాదు" అన్నది.

"ఎందుకు శకుంతలా నన్నిలా ఏడిపిస్తావు. ఎంత బాధ పడుతున్నానో తెలుసా నీకు. ఎందుకిలా అందీఅందనట్లు ప్రవర్తిస్తావు? ఇష్టంలేదా, నేనంటే. నన్ను, నా కోర్కెల్ని రెచ్చగొట్టింది నీవు. చివరకు ఇలా కాదంటే నేనేం కాను."

దగ్గరగా వొంగి చెవిలో చెప్పింది.

"మీ రూంకి వస్తాను. ఇక్కడ బావుండదు. ఎవరైనా వచ్చినా, చేసినా ఇద్దరం తలుపులు వేసుకుని లోపల వుంటే అనుమానిస్తారు మంచిదికాదు."

అదిరిపోయినాడు సుందర్.

"నా గది చాలా చిన్నది శకూ."

"ఫరవాలేదు. వొచ్చేది నీకోసంకానీ, నీ గదికోసం కాదుగా?"

"సరే నీ యిష్టం."

"పోనీ మరో పెద్దగది చూడగూడదూ."

"అలాగే అవసరాన్ని బట్టి చూడక తప్పుతుందా!"

"మరేం బెంబేలుపడకు....తప్పక వస్తాగా."

"ఎప్పుడొస్తావ్."

"త్వరలోనే."

కట్టలుతెగిన ప్రేమ కన్నీరుగా మారింది సుందర్ కి.

"ఛీ. తప్పుకాదూ....అలా కన్నీరు పెట్టుకుంటారా. రేపు

అయిదింటికిరా అన్నిఏర్పాట్లు చేస్తాను ఏం? ఒక్కరోజు మా బాబుకదూ. ఒక్కరోజు ఆగలేవూ."

ఎవరో వచ్చిన చప్పుడైంది.

"పాప" వస్తున్నట్లుంది.

గబగబా వెళ్ళి నెమ్మదిగా తలుపులు తెరచింది.

పాప లోపలకు వచ్చేసరికి శకుంతల, సుందర్ దూరంగా కూర్చున్నారు. సుందర్ మొఖం ఏడ్చి అప్పుడే కన్నీళ్లు తుడుచుకున్నట్లుంది. కళాకాంతులు లేవు.

"హల్లో పాపా. ఇలా....బడినించా" అంటూ దగ్గరగా తీసుకుని బుగ్గమీద చిటికె వేశాడు.

"పద పాపా లోపలకు అన్నం తిందువుకాని...." పాప లోపలకు నడిచింది.

"నాకూ ఆఫీసుకు టైం అవుతోంది శకూ. వెళ్ళిరానా!"

"వెళ్ళిరండి."

"రేపు."

"ఆ రేపు అయిదుగంటలకు."

"ఓ."

"థాంక్యూ."

బయటకు నడిచాడు విచారంగా.

* * *

ఆఫీసునుండి ఆరోజు మరో గంటముందుగానే, నాలుగింటికే బయల్దేరాడు. ఏమిచేయడానికీ కాలుచేయి ఆడటంలేదు.

సంతోషం ఒకప్రక్క, ఆదుర్దా మరొకప్రక్క. రూం అంతా గందర గోళంగా వుంది. అసహ్యంగా దరిద్రం పోతూ, డోకు తెప్పిం చేట్టుగా వున్నది దరిద్రదేవత తరతరాలుగా ఇక్కడే కాపురం చేస్తోందా అనిపిస్తోంది. ఏమైనాగానీ శకుంతల వస్తుంది. వస్తే, అబ్బ ఈ గదిలోనా ?

రూంని ఆకర్షవంతంగా శుభ్రంగా చేయాలని బుద్ధిపుట్టింది.

"మంగా, ఓ మంగా" పిలిచాడు.

ఎప్పుడోగానీ మంగని పిలిచే అవసరం కలగదు.

"వస్తున్నా బాబుగారూ" అంటూ ఒక కేక వేసింది గోడవతల గుడిసెలోంచి. క్షణంలో వచ్చేసింది.

"మంగా ఓ సాయంచేసి పెట్టు అర్జంటు. ముందు ఈ గదంతా తుడిచి, శుభ్రం చేయి. చాలా అసహ్యంగా వుందికదూ!"

"మామూలేగా బాబూ."

"ఈ టేబుల్ మీద ఫ్లవర్ వేజు పెట్టు. అదిగో ఆ కిటికీల నిండా బూజు చూడు ఎలాపట్టిందో.... పూర్తిగా దులిపెయ్.... ఈ సిగరెట్టు ముక్కలు అవీ తీసెయ్యి. శుభ్రంగా, త్వరగా కడిగి, సాంబ్రాణిపొగ పట్టించు. తర్వాత అగరువత్తులు వెలిగించు.

బజారునుండి వచ్చేప్పుడే రెండు చక్కని కప్పులు, సాసర్లు తెచ్చాడు వాటిని బల్లమీద అమర్చాడు అందంగా.

అన్నీ సిద్ధంచేసి శకుంతల రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. నిజంగా వస్తుందా రాదా అన్న అనుమానం. మురిపించి, మరిపిస్తుందేమోనన్న భయం వుండనే ఉన్నాయి. లోలోపల అనుమానం.

చీకటికంటె ముందుగానే శకుంతల వచ్చింది. అయిదు దాటిందగ్గరనుండి సుందర్‌కి చెమట పోస్తూనే వుంది. ఆరు, ఆరున్నర... వచ్చి అంతా కలయ చూచింది.

"మా రూం ఎలా తెలుసు శకూ నీకు."

"ఆ మాత్రం తెలుసుకోలేనా సుందర్."

"రూం చాలా చిన్నది." విమర్శ, తనకుగా తానే.

"రూం బావుందండీ, అయితే బజారు మరీ అల్లరిగావుంది. అలగా జనం జాస్తి."

శకుంతలను రెండుచేతులతో పట్టుకుని కుర్చీలోకి ఆహ్వానించాడు.

"కూర్చో శకూ."

"ఇక్కడేం బాగాలేదు సుందర్ .... అయినా నీకోసం వచ్చాను. నా ఎరికలో ఒక చక్కని గది వుంది. అక్కడికి మారరాదూ, డీసెంటుగా వుంటుంది."

"అద్దె ఎక్కువైతే భరించలేనుగా."

"నీకేం భయంలేదు. అద్దె సంగతి నేను చూచుకుంటాను."

"సరే నీ యిష్టం."

"అయితే రా వెళ్దాం, చూపిస్తాను. ఈ రాత్రికే బస మార్చేయ్."

"ఈరోజునా! రేపు చూడగూడదూ" అన్నాడు దీనంగా అతి జాలిగా.

"లాభంలేదు. నాకు ఇక్కడ అసలు ఊపిరాడటంలేదు. ఒక్కక్షణం ఉండలేకుండా వున్నాను. పన్నీరు బూడిదలో

పారిపోదామంటావా .... ముళ్ల కంచెల్లో శృంగారమేమిటి సుందర్."

నిజంగా సుందర్‌కి ముళ్లమీద కూర్చున్నట్లే వుంది శకుంతల వాయిదాలు, ఎత్తుగడలు, తప్పుకోడాలు చూస్తుంటే.

చెరొక రిక్షాలో బయల్దేరారు.

"రెండు కావాలాయేం" అన్నాడు సుందర్.

"ఆఁ అవసరం. ఎవరైనా చూస్తే ప్రమాదం." ఒక చిన్న సందులో ఆగినయ్ రిక్షాలు. ఓ తెల్లని వెల్ల వేసిన డాబాలో రెండుగదుల పోర్షన్ అది. చుట్టూ తోట బృందావనాన్ని తలపిస్తోంది. వాతావరణం బాగానేవుంది అనుకున్నాడు.

"ఇది మా ఇల్లే సుందర్ .... వెనక నేను ఈ ఇంట్లోనే వుండేదాన్ని... అద్దెకిచ్చాను ఇంతకాలం. గతవారంలోనే ఖాళీ అయింది. బహుశా నీకోసమేనేమో" అన్నది నవ్వుతూ. కొత్త పెళ్ళికూతురు సోయగం పోలేదింకా."

"కాదు మనకోసం" అన్నాడు ఆశగా.

"పోనీ మనకోసం."

"అద్దె ఎంత ?" అడిగాడు అనుమానంగా.

"అద్దె.... నేనే యిచ్చుకోవాలి నీకు తెలిసిందా. ఎవరూ రారు ఇటుకేసి. ఒంటరిగా హాయిగా వుండవచ్చు. రహస్యాని రాజమందిరం లాంటిది. నీకూ, నాకూ మధ్య ఇక్కడ ఏ అభ్యంతరమూ, అవాంతరమూ రావు తెలిసిందా" అన్నది బుగ్గ చిటికె వేస్తూ.

గదిని ఖాళా చక్కని ఫర్నిచర్ ఉంది. పెద్ద పందిరి మంచం. తెల్లని పట్టు దోమతెర. బూరుగు దూదితో చేసిన మెత్తని పరుపు, ముఖమల్ దుప్పట్లు ముట్టుకుంటే జారిపోయేట్లుగా వున్నయ్. పైన మెర్క్యూరీ దీపం, చాందినీలా ఉన్నది.

"ఇదిగో సుందర్....ఈ పరుపు అహమ్మదాబాద్ నుంచి తెప్పించాను చూచావా" అంటూ పందిరిమంచం దగ్గరగా వెళ్ళి, దోమతెర తొలగించి చూపించింది. వెనకాలే ఉన్న సుందర్ ... అయోమయంగా చూస్తున్నాడు ఆ ఏర్పాట్లను శకుంతల మంచంమీద పడుకుని, 'బావుందా సుందర్' అన్నది.

"నీకంటేనా."

ఈసారి శకుంతలే చొరవ చేసుకోవలసి వచ్చింది. మెత్తని చేతుల్ని ఎత్తి, సుందర్ మెడ చుట్టివేసి, మీదికి లాక్కున్నది. ఆ చూపులోని కోర్కె, మక్కువ ఎవరూ వర్ణించలేరు నిజంగా. తెర వేసింది. లైట్ ఆఫ్ చేసింది. సుందర్‌ని గాఢంగా కౌగలించు కుంది.

"సుందర్" ఆ పిలుపుతో స్వర్గద్వారాలు తెరుచు కున్నాయి.

"శకూ" అంటూ గుండెల్లోకి తీసుకున్నాడు.

"సుందర్....సుందర్.... నా సుందర్" అంటూ ఒదిగి పోయింది, కరిగిపోయింది కిన్నెరసానిలా....శకుంతల.

"ఇంత ప్రేమను ఇన్నాళ్లు ఎలా దాచిపెట్టుకున్నావు శకుంతలా!" అడిగాడు. పెదాలు రక్తంకారుతుందేమోనని తుడుచుకుంటూ.

"నీకోసమే సుందర్"

"నీదగ్గర శృంగారచేష్టల్ని, రతిక్రీడల్ని నేర్చుకోవలసిన వాణ్ని."

"ఛీ."

వెచ్చగా, నగ్నంగా కొన్నిగంటలు అలాగే ఒకర్నిఒకరు ఒరుసుకుని పడుకున్నారు. అలాగే సుషుప్తిలో వుండిపోయారు. శకుంతల ఎంతగొప్పది. అప్సరస, దేవత అనుకున్నాడు.

"ఇలాంటి రతీదేవి ప్రపంచంలో మరొకరు వుండరు" అనుకున్నాడు.

ప్రపంచ సుందరి, జగదేకసుందరి అని పేరుబడ్డ క్లియోపాట్రా సౌందర్యం, వాంఛ, శకుంతలముందు పనికిరావు. బ్రహ్మ రతీదేవినే ఈ రూపంలో భూమిమీద పునఃసృష్టించాడు" అనుకున్నాడు.

తెల్లవారి ఉదయం ఏడుగంటలైనా నిద్ర లేవలేదు సుందర్. మత్తుగా మునగదీసుకుని పడుకున్నాడు. మంగ వొచ్చి కేకలు పెట్టింది.

"ఓ....నువ్వా మంగా రా" అన్నాడు తలుపుతెరచి.

మంగను చూడడానికి సిగ్గయింది. ఏదో తప్పుచేసినవాడు బాధపడినట్లు బాధపడ్డాడు. అద్దంలో చూచుకున్నాడు. ముఖమంతా పీక్కుపోయినట్లుగా వుంది. పెదాలు, బుగ్గలు, ఎర్రగా కంది అక్కడక్కడ గంట్లు పడివున్నాయి.

"బాబుగారూ, రాత్రి తొంగో లేదేంటి. ఈయాల దాకా నిద్రపోతున్నారు" అన్నది.

"బాగానే పట్టింది కానీ, నేను ఇక్కడకు మారినట్లు నీకెలా తెలిసింది" అని అడిగాడు.

"నాకు తెల్దేంటి బాబూ. అన్నీ తెలుసు" అన్నది గర్వంగా పోజు పెట్టి.

"ఊఁ...."

కిలకిలా నవ్వింది.

"ఏమిటి మంగా ?"

"బహుమానం బాబూ....పప్పన్నం."

"ఓస్ అంతేగదా."

"అమ్మగారు ఎలావుంది ?"

"దేవత బాబూ. నాకు తెల్దేంటి ?"

అదో క సంతృప్తి, గర్వం.

"సరే సాయంకాలం వస్తావు గదూ....పనుంది."

మరో అరగంటలో ఆఫీసుకు వెళ్ళాడు స్నానం పూర్తి చేసుకుని.

వెళ్ళి కూర్చున్నాడో లేదో ఫోన్ పిలుపు.

"హల్లో....ఎవరూ" అన్నాడు బద్ధకంగా.

"నేను శకుంతల."

"హాలో డార్లింగ్" చుట్టూ ఎవరూ లేరుగదా అని పరికించాడు ఓమారు.

"గుడ్ మార్నింగ్. ఇందాక ఓమారు ఫోన్ చేస్తే రాలేదన్నారు. ఒకవేళ ఆఫీసుకు సెలవు పెట్టారేమో ననుకున్నాను.

ఇప్పటికీ రాకపోతే మీ రూంకి వచ్చేసేదాన్నే సుమా" అన్నది. ఆ గొంతుకలో ఎంత గర్వం, సంతృప్తి.

"పోనీ ఇప్పుడు రారాదూ సెలవుపెట్టేసి వస్తా."

"అబ్బ ఎంతాశ.... సాయంకాలం."

"ఆఁ ఏంచేస్తున్నావ్ శకుంతలా."

"ఇప్పుడే లేచాను వొళ్ళంతా నొప్పులు సుమా! ఇంత గడుసువారని తెలిస్తే రాకపోదును" అన్నది కిలకిలా నవ్వుతూ.

"అహా నీవు మహా గడుసుదానివైనట్లు. పెదాలన్నీ తెగమంటలు పుడుతున్నాయి తెలుసా, అసలే చలికాలం."

"సాయంత్రం వుంటారుగా."

"ఏడుగంటలకు."

"థాంక్స్."

కొన్ని వారాలు అలా ప్రణయ నౌక విశృంఖల విహారం చేసింది. స్వర్గసౌఖ్యాలు కొల్లగొట్టుకున్నాడు సుందర్ బంది పోటులా. మకరందాన్ని గ్రోలే గండుతుమ్మెద అతను. మధుర భారంతో మత్తెక్కిన కుసుమకోమలి శకుంతల. ఏకాంతం.... ఒకరికొకరి ఆకర్షణ. అనురక్తి.... అనుభవపు అపూర్వపుటంచులు చూచింది శకుంతల అపూర్వానుభూతి పొందింది. ఇంతకాలం బ్రతికింది నిరర్థకపు బ్రతుకే. ఇంత శృంగారాన్ని అనుభవించే అవకాశం వుందనీ తెలుసుకోలేదు ఎన్నడూ .... పురుషుని సాంగత్యం ఇంతటి శిఖరాగ్రాలకు తీసుకుపోతుందని ఆమె అనుభవంలో తెలుసుకోలేదు. సుందర్ వేరు. అతను మన్మథుడు....

సవ్యసాచి. పూర్వం అర్జునుణ్ని అందుకేనేమో అందరు సరించే వారు అనుకున్నది.

ఒకరోజు ఉదయం ఫోన్ చేసింది.

"హలో సుందర్....

"సారీ సుందర్. ఈరోజు సాయంత్రం రాలేను. మావా రొస్తున్నారు మద్రాసునుండి. ఓ వారంరోజుల వరకు వీలుపడక పోవచ్చు, క్షమిస్తావు గదూ! సెలవు మంజూరు చేస్తారా హుజూర్" అన్నది ప్రణయకోపంతో.

ఆ మాటలోనే "నిన్ను వొదిలి మనలేను సుమా" అన్న ధ్వని.

సుందర్ నోటమాటరాలేదు. ఫోన్ పెట్టేశాడు కోపంగా, అలకగా. ఇన్నివారాలుగా శకుంతల వివాహిత అనీ, ఆమెకో భర్త వున్నాడనే విషయమే జ్ఞాపకం రాలేదు. అప్పుడే వికసించిన కుసుమంలా భ్రమించి, ఆఘ్రాణించాడు. మధుపంగా, మధురాన్ని ఆరగించాడు.

"శకుంతల భర్త ఎలావుంటాడో. నాకన్న అందగాడా, రసికుడా? ఏమో." ఓసారి చూడాలనిపించింది. కానీ ఎలా సాధ్యం? అతన్నిగురించి తెలుసుకోవాలనీ అనిపించింది.

ఆయన వెళ్ళిపోయేవరకు ఓ వారంరోజులు ఓపికపట్టాడు. ఓరోజు ఉదయం కబురొచ్చింది.

"సాయంత్రం" అని.

## 10

సాయంత్రం ఏడుగంటలకు సుందర్ గదికి వచ్చింది శకుంతల.

వచ్చింది వచ్చినట్లే సుందర్ చేతుల్లో వాలిపోయింది. చిరకాల వియోగానంతరం ప్రియుని కలుసుకున్నంతతు ఆమె ప్రియురాలు. ప్రణయార్తిలో క్రాగిపోతూ ఉన్నది. వొళ్లో పడుకుని జుత్తులోకి వ్రేళ్లు, మృదువుగా సవరించింది. బుగ్గల్ని, చెంపల్ని రాసింది.

"అబ్బ. ఇంత చిక్కిపోయినావేం సుందర్. వారంరోజులకే అంతగా దిగులుపడాలా వెర్రినాగన్నలా."

అదోలా నవ్వాడు సుందర్.

"నేను నీకోసం ఎంత పరితపించానో నీకేంతెలుసు. ఎలా చెప్పను నా బాధ ఇదీ అని. ఎవరితో చెప్పుకోను. రావడానికి వీల్లేని పరిస్థితి. మళ్ళీ నిన్ను ఎప్పుడు చూస్తానా, ఎప్పుడు నీ వళ్లో వచ్చి వాలిపోతానా అని పరితపించాననుకో.... కాని ఆయన వుండగా రావడానికి ఎలా వీలు నీవేచెప్పు సుందర్. ఏం బావుంటుంది, అనుమానించరూ. అనుమానిస్తే ఇంకేమైనా వుందా, కొంపలంటుకోవూ...నిన్ను శాశ్వతంగా పొందాలంటే ఇతరులకు అనుమానం కలగకుండా ప్రవర్తించాలిగా."

"ఊఁ."

"రా సుందర్. ఎందుకింకా ఆ బుంగమూతి. కోపమా! అలకా? ఏమిటి అదోలా వున్నావు చెప్పు? బ్రతిమిలాడాలా? ఊ...పిచ్చిబాబూ...ఎందుకంత బెంబేలు పడతావు?"

"ఇదంతా ప్రేమేనా శకుంతలా...నమ్మమంటావా?"

"సుందర్" అంటూ నిషాలో తూలిపోయింది, వాలి పోయింది.

"తర్వాత పిక్చర్‌కి వెడదామా" అడిగాడు.

"ఇవాళ ఎక్కడికీ రాను. ఇక్కణ్నించి కదలను. రాత్రంతా నీతోనే గడిపేస్తా .... ఇన్నాళ్ళకు కలుసుకున్నాం ఎంతో సంతోషంగా వుంది."

"పోనీ ఇక్కడే వుందాం" అన్నాడు సుందర్.

శకుంతల జీవితం ఎలాంటిదో తెలుసుకోవాలని ఆకాంక్ష కలిగింది. ఆమె గతజీవితం ఏమిటి? ఏదో ఊహించాడు. కలగా ఆలోచించాడు. ఈమె శీలం మంచిది కాదు. మొగుణ్ని మభ్య పెట్టి పరపురుషునితో కులికే జాణ. అందుకే తనను చేరదీసింది. తనే ప్రియుడనీ, మొదటివాడనీ ఏమిటి? ఇలాగే లోగడ ఇంకెందరితో పరిచయం వున్నదో? ఆ మగడైనా చేసుకున్నవాడేనా? అసలు పెద్దకుటుంబంలోనిదేనా? లేక సామాన్యమా? అధమమా? అంతకన్న నీచకులసురాలా! ఏదో అవ్యక్తమైన జుగుప్స, అసూయ కలిగింది. ఆమె హృదయంలో తనకున్న స్థానం చాలా స్వల్పం అనిపించింది. మరొక క్షణంలో అంత బలహీనమైనదీ, ఇరుకైనదీ తన స్థానం అనిపించింది. ఈ మోజు తీరగానే తనను వొదిలివేస్తుందేమో! తనను దూరంచేస్తుం

దేమో! శకుంతలవైపు ఓసారి తేరిపారచూచాడు. ఆ చూపు గుండెలను దూసుకుపోయి, నిక్షిప్త రహస్యాలను శోధించినట్లే వుంది. ఆమెను దేవతగా ఆరాధించి పూజించిన క్షణాలు, రంగు రంగుల్లో మెరిసి మాయమైనాయి. ఏదో తెలియని, అనుకోని భయం, బాధ అనుభవించాడు. ఆమె మరో పురుషుని భార్య అని తెలిశాక, ఆమె జోలికి పోలేకపోయాడు. ఇంతకాలం ఆ విషయం తెలియక కాదు. ప్రేమలో అంధత్వం పొంది, ఆ విషయ పరిజ్ఞానాన్ని కోల్పోయాడు. వారంకితం ఆమె భర్త వస్తున్నాడన్న వార్త కళ్లు తెరిపించింది.

*　　　*　　　*

చేతిలోని డబ్బంతా అయిపోయి కటిక దరిద్రం అనుభవించవలసిన క్షణాలు, రోజులు దగ్గరకొచ్చేయి. శకుంతల కోసం, ఆమె స్థితికి తన స్థితి తక్కువకాదనీ చూపటం కోసం, మొహర్బాణీలకు పోయి, అందినచోటల్లా అప్పులు పుచ్చుకుని ఖర్చుచేశాడు. అందులో కానీ తీరేఅవకాశం లేదు. జీతం తక్కువ. సామాన్య ఖర్చులకే బొటాబొటీ. అంత స్థాయిలోనూ బ్రతకడానికి అలవాటుపడ్డాక, ఖర్చులు పెరుగుతున్నాయికానీ ఆదాయం పెరగలేదు. ఇప్పుడు మరీ ఇబ్బందుల్లో పడవలసి వచ్చిందే. అంతర్యంగా కోపం, చిరాకు ఎక్కువైంది. ఎవరిమీద చూపడానికీ వీల్లేదు. స్వయంకృతాపరాధం. ఎవరినీ అనడానికి లేదు? ఎవరికి తెలుసు తన దుబారా. ఎవరికోసం, ఎవరి సంతృప్తికోసం అంతగా ఖర్చుచేశాడు. శకుంతలకోసం అని ఎవరితోనైనా అనగలడా!

అంటే హర్షిస్తారా? లేదు. చెబితే నవ్వుతారు...నవ్వుతారు. తనను లోకువగా, వెర్రివెంగలాయిగా చూస్తారు.

ఆరోజు శకుంతల వస్తుందని తెలుసు. చేతిలో కానీలేదు. ఏం చేస్తాడు. నిన్నటితో ఉన్నడబ్బంతా అయిపోయింది. పొద్దున భోజనం చేయలేదు డబ్బులేక, అప్పుపుట్టక. కనీసం కాఫీకూడా తాగలేదు. అలాగే నీరసంగా, అన్యమనస్కంగా పగలంతా పనిచేశాడు. కడుపులో కాలిపోతోంది. హృదయంలో సెగలు, పొగలు.

సాయంత్రం అందరూ వెళ్ళిపోయేవరకూ అలాగే కుర్చీకి అంటుకుపోయి కూర్చున్నాడు.

"టైం అయిపోయింది సార్. అలాగే కూర్చున్నారేం" అన్నాడు ఆఫీసుబాయ్ నారాయణ.

"ఓహో....అందరూ వెళ్లిపోయారేం?"

"అవునుసార్. తలుపులన్నీ వేసేశాను కూడా."

"మరేం లేదు కానీ నారాయణా! నీదగ్గర చిల్లరప్పమైనా వుందా" అడిగాడు బిక్కచచ్చిపోయి.

"ఎంతసార్."

"ఓ అర్ధరూపాయివుంటే ఇవ్వు, రేపిస్తా."

ఇచ్చాడు.

"చాలా సార్. పోనీ రూపాయి తీసుకోండి తర్వాత ఇద్దురుకానీ."

"వొద్దు నారాయణా, చాలులే."

ఆ అర్ధరూపాయి జేబిలో వేసుకున్నాడు. అంగారక గ్రహానికి పంపిన మనిషి సజీవంగా భూమ్మీద దిగినపుడు శాస్త్రజ్ఞునికి కలిగిన సంతోషం కలిగింది. సరాసరి కాఫీ హోటలుకు నడిచాడు. ఆరణాలకు తిని, ఓ బేడపెట్టె సిగరెట్లు కొని గదికి చేరుకున్నాడు.

లోపల ఆకలి దహించుకుపోతోంది ఇంకా .... శకుంతల వస్తానని చెప్పింది. ఈమధ్య వొద్దన్నా వస్తూనే వుంది. కడుపులో ఆకలిగా వుందేమో ఆలోచనలు అంతూ, దరీ లేకుండా ఉన్నాయి. శకుంతల....ఎవరీ శకుంతల ... వేయిరూపాలలో అవుపించింది. వేయిభంగిమలలో మెరిసింది.

శకుంతల ఎంతో సంతోషంగా, ఆకర్షణగా ఉంది. ఎంతో ఉత్సాహం, ఉద్రేకం ఆమెలో ఉప్పొంగినట్లు స్పష్టంగా అవుపిస్తున్నాయి. అవధులు దాటాలనే ఆనందం ఆమెది. చాలారోజుల తర్వాత ప్రియుణ్ని కలుసుకున్న ఆత్రుత, తపన, కోరిక, వలపు. చూపుల్లో వలపు తుంపరలు కురుస్తున్నాయి. సుందర్ ఆలస్యానికి ఆమెకు అర్థం అవుపించడంలేదు.

అతనిలో అణువణువునా అనుమానపు సెగలు రేగి భుగభుగ మంటున్నాయి. విషనాగుల్లా, విషవాయులను సృష్టిస్తున్నాయి. అసలు కారణం శకుంతలకాదు. ఆమెమీద మమకారం ఇంకా సమసిపోలేదు. కానీ జేబులో డబ్బులేదు. ప్రొద్దుటినుంచీ భోజనం లేదు. కడుపులో ఆకలి దహించుకుపోతోంది. ఎక్కడా డబ్బు అప్పుదొరికే అవకాశంలేదు. నెలజీతం రావడానికి ఇంకా

పదిరోజులు గడువుంది...ఇలా ఆలోచించుకున్నాడు. సుందర్ శకుంతల ప్రక్కనే ఉన్నా విస్మరించి.

"సుందర్....బయట వెన్నెల ఎంత బావుందో చూడు. అలా షికారు పోగామా! క్రిష్ణ కెరటాలపై వెన్నెలల వెలుగులు సయ్యాటలాడుతుంటే ఎంతో అందంగా, ఆహ్లాదంగా వుంటుంది. అలా కృష్ణవొడ్డుకు వెళ్ళి తర్వాత ఏదైనా పిక్చరుకి వెడదాం" అన్నది.

"వద్దు శకుంతలా. నా మనసు బావులేదు క్షమించు."

"మనం కలిసి షికారెళ్ళి ఎంతకాలమైంది చెప్పు. ఎందుకలా ముభావంగా వుంటున్నావ్ .... నేనంటే యిష్టం లేదా చెప్పు. లేక కోపం వచ్చిందా."

"షికారు వెళ్ళకపోతే తెల్లవారదా" అన్నాడు.

"ఏంచెయ్యకపోతే తెల్లవారదనీ! అందుకని అన్నిపనులు మానుకుంటున్నారా. కొన్నింటికోసం అంత తపనపడతావేం? చట్టపట్టాలు వేసుకుని చల్లగాలిలో క్రిష్ణ వొడ్డుకు పోదామంటే మహా బెట్టు చేస్తున్నావేం సుందర్. వెన్నెలదారుల్లో విహరించాలని సరదాగా లేదా నీకు."

"నాకు రావాలని లేదుశకుంతలా! క్షమించు."

కోపంగానే అన్నాడు ఆ మాటలు. ఆ ధ్వనికి శకుంతల తెల్లక్రిందులైంది. ఉడుకుగడుకున్నట్లయింది. సబురాలైందికూడా. ఎన్నడూ ఆశించని సమాధానం. సుందర్‌నుండి అంత కటువుగా సమాధానం వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. అసలు అతనిలో అంత కఠినత్వం గూడుకట్టుకుని వున్నదనీ అనుకోలేదు.

"ఏం అలా ఉన్నావు సుందర్. ఆరోగ్యం బాగాలేదా? అదోలా మాట్లాడుతున్నావు, కోపంగా వున్నావు. నేనేమైనా తప్పు చేశానా? ఇన్నిరోజులు ఆలస్యంచేశానని కోపమేనా! ఓసారన్నా వీలుచూచుకుని వచ్చి, చూచిపో లేదని కోపంకదూ! అందుకేనా ఈ అలక. ఏం చేయమన్నావు చెప్పు. వీలుకాలేదు ఆయన ఏమైనా అనుకోరూ .... పైగా నన్నొక క్షణం వదిలి వుండరు ఇక్కడ ఉన్నంతకాలం. అలాంటప్పుడు ఎలా సాధ్యం రావటం.

"నాకేం కోపంలేదు కానీ నన్ను బోర్ చెయ్యకు అస హ్యంగా మాట్లాడకు" అన్నాడు.

ప్రణయావధుల్ని దాటించనున్న ఏ స్త్రీ అయినా పురు షుని నోటంట అంత కఠినమైన మాట వింటే సహించదు. శృంగారశిఖరాన కూర్చోబెట్టగల స్త్రీ, ప్రపంచాన్నే కొన్ని క్షణాలపాటు, నిమిషాలపాటు మురిపెంతో మరిపింపచేయగల దైవత్వంగల ఏ స్త్రీ ఆ మాటలు భరించలేదు. అందులో శకుంతల మేటి జవరాలు. సుందర్ ప్రవర్తన మొరటుగా, అసహ్యంగా, ఆనాగరికంగా ఉన్నట్లు తలపోసింది. సభ్యత తెలిసినవాడు, ప్రేమ, ఆరాధన వున్నవాడు ఎవడూ అలా ప్రవర్తించరు నిజానికి.

తనకు కలిగిన కోపాన్ని, జుగుప్సను వెలికి రానీయకుండా సౌమ్యంగా అన్నది.

"నీవు అలా మాట్లాడితే నేను సహించలేను సుందర్. పురుషుడు నీచంగా మాట్లాడినా, ప్రవర్తించినా నేను ఓర్చుకో లేను. ఆరాధించగలవాడివే ననుకున్నాను కానీ, అసహ్యించు

కోటంలో, అనుమానించటంలో మేటిమగటిమి చూపించగల వనుకోలేదు. నేను నీ ప్రవర్తనకు ఈరోజు క్షమిస్తున్నాను సుందర్. ఇంక ఎప్పుడూ అలా ప్రవర్తించకు. అది సభ్యత అనిపించుకోదు. నేనుకాదు ఏ స్త్రీ నీ ప్రవర్తనను సహించదు. నీప్రవర్తన స్త్రీ జాతికే అవమానం.

"వస్తాను సుందర్....నిన్ను అర్థం చేసుకున్నట్లయితే ఇంటి దగ్గరగా చేరనీయకపోదును...క్షమించు వస్తా."

అప్పటికి తెలిసింది సుందర్‌కి. తన ప్రవర్తన ఎంత మూర్ఖంగా వుందో. ఎలాంటి పరిణామాలకు దారితీసిందోనని. చప్పున వెళ్ళి శకుంతలను రెండుచేతులతో పొదివి పట్టుకున్నాడు.

"క్షమించు శకూ. నన్ను క్షమించు. ఏదో మనసు బావుండక అనేశాను. ఈవేళ నా మనస్సంతా అలజడిగా ఉంది. ఏదో బాధ అనుభవిస్తున్నాను. ఆఫీసులో గొడవలు."

"నీ ఆఫీసు గొడవలతో ముడిపెట్టి నన్ను తూలనాడటం ఏం భావ్యం. అయినా నీ ఆఫీసుతో నాకేమిటి సంబంధం."

సోఫాలో కూర్చోపెట్టి, అనునయంగా బ్రతిమలాడి, ప్రార్థించాడు.

"నిన్ను బాధపెట్టాలనీ, నీ హృదయాన్ని గాయపరచాలనీ నా అభిమతంకాదు శకుంతలా ! నేను నిజంగా ఏం మాట్లాడానో నాకే జ్ఞాపకం లేదు. ఏమీ తెలియని ఉన్మాదంలో పడిపోయాను...ఏమన్నాను?"

అప్పటికీ ఆమె కోపం తగ్గిందికాదు. సోఫాలో మూతి ముడుచుకు కూర్చుంది. వెళ్ళి దగ్గరగా లేచి ఆమె కళ్ళల్లోకి

చూస్తూ "నన్ను క్షమించవా శకుంతలా ... క్షమించానను శకుంతలా. నీ కాళ్లు పట్టుకుంటున్నాను. నీకు ఆగ్రహం వస్తే నే బ్రతగ్గలనా చెప్పు." కన్నీరు బొటబొట ఆమె పాదాలమీద పడ్డాయి.

పురుషుడు కన్నీట అభిషేకంచేస్తే స్త్రీ హృదయం ఇట్టే మంచులా కరిగిపోతుంది. అంతే శకుంతల.

"లే సుందర్. ఛీ. ఏమిటా కన్నీళ్లు. మరెప్పుడు అలా ప్రవర్తించకు. పద అలా షికారుగా వెళ్లివద్దాం" అంటూ లేవదీయ ప్రయత్నించింది సుందర్‌ని.

అలాగే తొడలమీద తల ఆన్చి ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి సుందర్ ఆ మూగనోము ?"

"శకుంతలా ! ఈ ఒక్క రాత్రి మనం ఎక్కడకు వెళ్ళ వద్దు, నన్ను ఎక్కడికీ రమ్మనకు. ఈ ఒక్కసారికి నా కోరిక మన్నించలేవా ? ఈ రాత్రి ఎందుకో నే నెక్కడికీ రా మనసు కావటంలేదు" అన్నాడు. మనసు మారకపోయినా, మాట మార్చే ధోరణిలో.

"నిజంగానా సుందర్. అయితే తప్పకుండా నిన్ను నా వెంట త్రిప్పుతాను ఈవేళ పద పోదాం" మొండికెత్తింది.

"వద్దు శకుంతలా ! నా మాట విను."

"అయితే నువ్విక్కడే వుండు ఒంటరిగా. నేను వెళ్ళి పోతున్నా, నా కోర్కెను మన్నించలేని వానితో నా మక్కువేం తీరుతుంది గనుక."

చేతుల్లోంచి విడిపించుకుని బయల్దేరింది. విసవిసా నాలుగు అడుగులు వేసింది. తలుపుదగ్గరకు వచ్చేసరికి వెనకనుండి సుందర్ వచ్చి గట్టిగా పట్టుకున్నాడు

"కాదు శకుంతలా! నీవంటే ఇష్టంలేక కాదు, నీ కోర్కె తీర్చలేకనూ కాదు, కారణం అడక్కు. తర్వాత వీలుచూచుకుని నే చెబుతాగా."

"అబద్ధం, శుద్ధ అబద్ధం."

ఆమె కళ్ళల్లో నీరు తిరిగింది. సుందర్ తనకు కాకుండా ఏదో రహస్యాన్ని దాచిపెడుతున్నాడనీ, అది తనకు సంబంధించిందే అయివుంటుందనీ ఆమె బాధ. నిగ్రహించుకోలేకపోయింది.

"అదికాదు శకుంతలా .... నిజం చెప్పనా. నా చేతిలో ఈవేళ కానీ లేదు. ఆ మాట చెప్పలేక నా బాధంతా."

ముందుకు పోబోతున్న శకుంతల, మంత్రముగ్ధలా ఆగింది. ఒక్కసారి వెనుతిరిగి అతని కళ్ళలోకి చూచింది ఆశ్చర్యంగా. ఆ కళ్ళలో సత్యాన్ని తెలుసుకోడానికి శోధించింది. సుందర్ తల వొంచి సిగ్గుతో నిలబడ్డాడు. ఈ ఘోర రహస్యాన్ని ఆమెకు తెలియజేయకూడదని అతని ఆరాటం. కానీ చెప్పకతప్పలేదు.

"నిజంగానా సుందర్" ప్రశ్నించింది. ఆశ్చర్యంగా అతని లోకి సూటిగా చూస్తూ.

"నిజం శకుంతలా! ప్రొద్దుటినుండి భోజనం చేయ లేదు. కాఫీ లేదు. ఏం చేయమంటావు చెప్పు. నీతోడి షికారు రాలేదనే నీ కోపంగానీ, నా పరిస్థితులు నీ కర్థంకావు. నా బాధ అంతకన్నా నీ కర్థంకాదు."

"నిజంగానా సుందర్ .... నిజంగా భోజనం చేయలేదా వొట్టు?" అన్నది. అంటూ చొక్కా జేబులు, లేబులు వెదికింది నమ్మలేనట్లు. ఎక్కడా కానీ అవుపించలేదు.

"ఓ పిచ్చిసుందరయ్యా ఎంత పనిచేశావూ అని" నాతో ఎందుకు చెప్పలేదు. డబ్బులేకపోతే పస్తులుండాలని ఎవరన్నారు. కబురుచేస్తే ఏంపోయె. నేనేం చచ్చిపోయాననుకున్నావా, లేక నన్నిడిగితే నామోషీ అనుకున్నావా, లేదా ఇవ్వలేనిదాన్ననుకున్నావా...వెర్రివాడా."

"ఈమధ్య నిజంగానే ఘోరమైన దరిద్రం అనుభవిస్తున్నాను శకుంతలా. బొత్తిగా చేతిలో డబ్బు మెసలడంలేదు. డబ్బుగురించే నా బాధ."

"నే నిస్తాలే సుందర్ ఏమీ బాధపడకు."

"వొద్దులే శకూ...రేపు ఎక్కడైనా సంపాదిస్తా."

"పోనీ సంపాదించినపుడే ఇద్దువుగానిలే తీసుకో...నిన్న ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు ఇంకా తెలియదు సుందర్. నా అందం, చందం, సౌందర్యం, డబ్బు ఏదికావాలంటే నీదికాకుండా పోతుంది చెప్పు. సర్వంనీకు సమర్పించ సమకట్టానే, నీకు అర్పించుకున్న దానికంటే ఇంకా విలువైనదీ, ఇవ్వకూడనిది ఏముంది నాకు. డబ్బు విలువైనదా ?"

ఆ భావంతో, మాటతో, ఓదార్పుతో సుందర్ తలత్రిప్పుకుండా లెపోయాడు. నిజమే మరి. శకుంతల డబ్బు మినహాయిస్తే అంతా ఇచ్చివేసింది. అందాన్ని అనుభవించనిచ్చింది. శరీరాన్ని పూర్తిగా స్వాధీనంచేసింది. తన కోర్కెకు అనుగుణంగా

వొంపులు తిరిగింది. వయ్యారాలు పోయింది. సోయగాలు చిలికింది. నిజంగా ఇంకేమీ మిగుల్చుకోలేదనే చెప్పాలి.

"రా అలా మా ఇంటిదాకా నడిచివెడదాం.... వెన్నెల హాయిగా వుందికూడా. సరదాగా నడిచినట్లు వుంటుంది."

శకుంతల ఇంటిదాకా కబుర్లు చెప్పుకుంటూ నడిచారిద్దరూ...

"రేపు సాయంత్రం కనిపిస్తావుకదూ సుందర్."

"తప్పకుండా."

"వస్తాను అరింటికి."

"అలాగే."

తొందరగా ఇంటిముఖం పట్టాడు. ఆలోచనలు నిలువునా పిచ్చివాణ్ని చేస్తున్నాయి. తలుపుతీసి లైటువేశాడు. ఎదురుగా వందిరిమంచంమీద ఓ కాగితం మడత అవుపించింది. తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. పదిరూపాయల కాగితాలు. గబగబా విప్పిచూచాడు అయిదుపదులు.

అభిమానం ఒక్కసారిగా దెబ్బతిన్నది. ఆమెకు తాను ఇవ్వవలసిందిపోయి ఆమె డబ్బు తను అనుభవించటమా! పోనీ రేపువచ్చినపుడు ఇచ్చివేస్తే. అనుకుంటూనే నిద్రకు ఉపక్రమించాడు. హృదయం ముక్కలుముక్కలుగా చీరినట్లుగా ఉంది. ఆలోచనలు విపరీతంగా వున్నాయి

నిజానికి నిద్రపోయినట్లే లేదు. అయిదింటికల్లా మెలకువ వచ్చింది. బాగా ఆకలవుతోంది. అలాగే పడుకుని తెల్లవారుద్దామనుకుని ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు. 'లాభం లేదు

వెళ్ళి ఏమైనా తినిరావాలి హోటళ్లు తెరిచే వేళయింది' అనుకున్నాడు.

అప్పటికే కొన్ని హోటళ్లు కిటకిటలాడుతున్నాయి నిద్ర మత్తు ప్రయాణీకులలో. సుష్టుగా ఓ పదణాలకు తిని బయట కొచ్చాడు. ఓ పెట్టె గోల్డ్ ఫ్లేక్ సిగరెట్లు కొన్నాడు శకుంతల యిచ్చి వెళ్ళిన డబ్బులో.... ప్రతి దమ్ముకూ శకుంతల రూపం కళ్ల ముందు కనిపిస్తోంది. మనస్సులో మెదలుతోంది. రాత్రి శకుంతలే ఆ సాయం చేయకపోయినట్లయితే....

ఆఫీసుకు పోగానే నారాయణ అవుపించాడు. నిన్న యిచ్చిన అర్ధరూపాయికి తోడు మరో అర్ధ కలిపి యిచ్చి, "ఇంద కాఫీ తాగవోయ్" అన్నాడు.

శకుంతల ఇచ్చిన డబ్బులో తేలిగ్గా అయిదురూపాయలు ఖర్చయింది ఒక్కపూటలో. ఎవరినీ అప్పు అడగనవసరం లేక పోయింది. అడిగినా ఇచ్చేవాడులేడు అది వేరేవిషయం. అయినా శకుంతలకు వెంటనే ఇవ్వవలసిన అవసరంలేదు. జీతం వచ్చినపుడు యివ్వవచ్చు తొందరలేదు.

"శకూ. నిన్న నీవు నాకోసం వదిలివెళ్లిన యాభై రూపాయలు తర్వాత యిస్తాను" అని చెప్పవచ్చు.

చీకటి పడేవేళకు శకుంతల వచ్చింది. రతీదేవిలా తయారైంది. అపూర్వంగా అలంకరించుకున్నది. గదిలోని దీపపు వెలుగులో చీరలోంచి తొడల వొంపులు, శరీరపుకాంతి అవుపిస్తున్నాయి. ఋష్యశృంగుణ్ణి కూడా వెర్రులెత్తించగల సౌందర్యం ఆ క్షణాన ఆమెది. ప్రవరుడే వుంటే దాసోహం అనేవాడు.

"చాలా సెక్సీగా వున్నావు శకుంతలా! కెంప్టుచేస్తోంది నీ అందం" అందామనుకున్నాడు కానీ అనలేదు. ఆమెకు దగ్గరగా పోవాలన్నా, ముట్టుకోవాలన్నా, ఏదో అలసటగా, భయంగా వుంది. ఆమెలో అపూర్వతేజం ఒకటి అవుపిస్తోంది. ఆ తేజం ముట్టుకుంటే నిలువునా కాల్చేలా వున్నది.

"ఏం సుందర్ అలాగే నిలబడిపోయావ్" అంటూ వొచ్చి బుజాలమీద చేతులువేసి, మీదికి వొంగుతుంటే స్పర్శకు, స్పర్శలోని ఉష్ణానికి స్తబ్ధుడైనాడు. చేష్టలుడిగినాయి.

"రంభలా తయారైనావు శకూ!"

"అంటే అడ్డమైన మగాడు నన్నే వాంఛిస్తాడనా, ఆరాధిస్తాడనా నీ ఉద్దేశం."

"అదికాదోయ్ అందంలో నేనన్నది. అలంకరణలో నని నా భావం."

అర్ధరాత్రి దాటింది. రెండవ ఆట సినీమా జనం వస్తున్న చప్పుడైంది.

"ఇక వస్తా సుందర్ .... ఈసారి శుక్రవారం వస్తా" అన్నది.

నాలుగురోజులు వ్యవధి, ఎందుకో అడిగే ధైర్యంలేదు. నిజానికి ఆ హక్కుకూడా తనకు లేదేమో ననుకున్నాడు.

ఆమె వెళ్ళిపోయింతర్వాత అలసిపోయి, మత్తుగా మంచం మీద వాలిపోయాడు. ఏదో చేతికి తగిలింది. పర్సు ... తెరచి చూశాడు వందరూపాయల నోటు.

"ఓహ్ శకూ! ఏమిటీ దారుణం" అనుకున్నాడు. నవ్వుకున్నాడు. గర్వంగా కళ్లు మూశాడు.

# 11

ఓరోజు సుందర్‌ని సినిమాకి బైలుదేరదీసింది. రిజర్వ్‌డ్ క్లాసులో, బాక్సులో కూర్చున్నారు. ఇంకా ఆట ప్రారంభం కాలేదు. ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"సుందర్, ఆ అమ్మాయి చూడు మనవైపు ఎలా చూస్తుందో వింతగా" అన్నది. దూరంగా కూర్చుని విచారంగా వెనుదిరిగిచూస్తున్న ఓ పద్దెనిమిదేళ్ళ జవ్వనిని చూపిస్తూ.

"అబ్బే మనవైపుకాదులే" అన్నాడు మొహం తిప్పి.

అయినా సుందర్ మొహం కళావిహీనమైనదని శకుంతల గ్రహించింది.

"కాదు సుందర్. మనవైపే చూస్తోంది, ఆమె సొమ్మంతా మనమేదో కొల్లగొట్టినట్లు. ఎలా బిక్కమొహంవేసి చూస్తోందో చూడు. మొగుడు తిరుగుబోతైన పతివ్రత మొఖంలా వుంది" అన్నది.

అటుకేసి దీర్ఘంగా చూచాడు రజని. ఓక్షణం చకితుడైనాడు.

"ఓ, ఆ అమ్మాయా నీవన్నది!"

"ఏం ఎరుగుదువా ?"

"ఆఁ పూర్వాశ్రమంలో శిష్యురాలు."

"నీవు ఆమెకు నేర్పావా పాఠాలు, లేక ఆమెగారు నీకు నేర్పిందా?" బలవంతాన నవ్వాడు.

"పేరు ?"

"రజని."

ఇంతలో రజని దగ్గరగా వచ్చింది.

"నమస్కారమండీ మాస్టారూ !"

"ఓ....రా....రజనీ ... కూర్చో" అని ప్రక్క కుర్చీ చూపించాడు. "ఈమె శకుంతలని నా ఫ్రెండ్."

రజని చూచిన చూపుల్లో వేడి తీక్షణంగా వుందని శకుంతల ఇట్టే గ్రహించింది. స్త్రీ అసూయ స్త్రీకే తొందరగా తెలుస్తుంది. కారణం ఒకటే.

"బావున్నారా మాస్టారూ" అన్నది.

"రక్షించింది. మరేం అనలేదు" అనుకున్నాడు. అనుకుని అనుకూలంగా నవ్వాడు. అయినా రజని కళ్లు ఎందుకో చెమర్చాయి.

ఇంకా నయం. రజని తనని అల్లరిచేస్తుందని భావించాడు. ఆమెతో తనకున్నది ఒకరాత్రి పరిచయమే అయినా అది మరచి పోలేనిదిగా ఉన్నది. తొలి వలపు అది. తొలిమలుపు కూడా

అదే. తొలి అనుభవం కూడా! స్వర్గం ఎలాంటిదో చవిచూచిన తొలిరేయి ఎలా మరచిపోగలదు. అందుకే రజని ఎంత అమాయకురాలు. జాణతనంలేదు. అనుభవంలేదు. కొత్తదనం... ఆనాడు మత్తు తనను ఇంకా వీడిందికాదు. తన జీవిత చరిత్రలో ఆరోజు బంగారు మలామా చేయదగ్గ సుదినం.

శకుంతల రహస్యం పసికట్టిందేమో కొంచెం కోపం ప్రదర్శించి, మూతి బిగించింది.

సినీమా జరుగుతున్నది. ఒక అరగంట గడచింది "నే వస్తానుందర్. తలనొప్పిగావున్నది." అన్నది శకుంతలలేస్తూ ...

ఆ గొంతుకలో తొట్రుపాటుకు అర్థం తెలుసు. జీరపోయిన కంఠస్వరం, బాధనువెల్లడించింది. వెంటనే తానూ లేచాడు.

శకుంతలకు ఎంత ఆపుకున్నా దుఃఖం ఆగటంలేదు వెలుపలికివస్తున్నది. తనను దేవునిగా ఆరాధిస్తుంది. తనకు హృదయం అర్పించింది. అలాంటి తను ఆమెకుకాక, మరొకరికి దత్తమైనట్లు అనుమానించి భరించగలదా!

తనను అనుమానించింది. యథార్థం.

తనను అనుమానించిందనీ, యథార్థం గ్రహించిందనీ తెలుసుకున్నపుడు దుఃఖం ఆగలేదు. కానీ రజనిమీద ఆగ్రహం కలుగలేదు.

"శకుంతలా! ఆమెనాకు ఊరికేతెలుసు. ఉట్టినే అనుమానాలు పెట్టుకుని విచారించకు" అన్నాడు.

"నాకు తెలుసు సుందర్"

"నీ తోడు శకూ .... మాకేం పరిచయం లేదు .... నన్ను నమ్ము"

"ఆత్మవంచన చేసుకోకు సుందర్" అన్నది విషాద స్వరంలో "అయినా నీ స్నేహాలు వొదులుకోమని నేననలేదే.... నీ యిష్టం" అంటూ ముఖం చేతుల్లో కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

స్త్రీకి ఆగ్రహం వచ్చినా అనుగ్రహం కలిగినా ప్రళయం వచ్చినట్లే, అదీ ప్రణయ సంబంధమైందా చెప్పనే అక్కర్లేదు. ఏడుపు వొక్కటే ఆయుధం

" నీ మాటలు నమ్ముతున్నాననుకున్నావా సుందర్. సిగ్గులేక, ఇంకా నన్ను మభ్యపెట్టచూస్తున్నావా. నేను నమ్మ తాననే నీ నమ్మకమా !"

నేను ఇచ్చిన డబ్బు ఆవిడకోసం ఖర్చు పెడుతున్నాడేమో నని అనుమానించి మరీ పెట్రేగి పోయింది.

పోతున్న రిక్షాను ఆపింది. ఎక్కి కూర్చుంది

"పోనీయ్"

"నేనూ వస్తున్నా శకూ" అంటూ ఎక్కబోయాడు.

"బ్రూట్" అంటూ ఒక్క తోపుతోసి కదిలింది.

"శకుంతలా, శకుంతలా" అని అరుస్తున్నా వినపడనట్లు రిక్షాముందుకు తీసుకుపోయింది.

తిరిగి హాలులోపలకు వెళ్ళాడు బిక్కమొహంతో. రజని నిస్తేజంగా కూర్చునివుంది.

"రండి ఒక్కరే వొచ్చారేం ఆమె వెళిపోయిందా ...."

"ఆఁ ఒక్కణ్నే రజనీ ఒంటరిగాణ్ని. నువ్వు భ్రమించినట్లు ఇద్దరంకాదుగా" అన్నాడు మధ్యపెట్టచూస్తూ.

"ఆమె ఎవరో కానీ చాలామంచిదండి" అన్నది. తన పురుషుడు ప్రేమించిన స్త్రీ 'మంచిది' అంటే పురుషుడు పొంగి పోతాడని ప్రతి స్త్రీకి తెలుసు.

సుందర్ చకితుడైనాడు. ఎంత విశాలహృదయం. అనుమానించటం రజనివల్లకాదేమో! అదేస్థితిలో శకుంతల అసూయ త్రాగి, ద్వేషాన్నిమింగి కన్నీరు మన్నీరుకాగా పారిపోయింది. అదే అనుమానంగా తనను శ్లాఘించి వ్యక్తిగా చూచింది. ఆమెని మంచిది అంటోంది రజని. నిజానికి ఇద్దరిలో ఎవరుమంచివారు? ఎవరు ఉత్తములు?.

"రజనీ నువ్వు చాలామంచిదానివి. నీహృదయం విశాలమైంది" అన్నాడు అదేదో అప్పుడేతోచినట్లు.

"మాస్టారూ మీరు నిజంగా పెళ్ళి చేసుకోలేదూ? ఆమె మీభార్యఅని భ్రమపడ్డానండీ" అన్నది.

"లేదు రజనీ నీకు తెలియకుండానే పెళ్లి చేసుకుంటానను కున్నావా! అయినా చేసుకుంటే నిన్ను తప్ప మరొకర్ని చేసుకో నని వాగ్దానంచేశానుగా"

'ప్రమాణాలకేం మాస్టారు. ఎన్నయినా చేస్తారు'

"అంటే నిజాయితీని శంకిస్తున్నావా!"

"శకించడం.... మళ్లీ కాదని మనసు దిటవు చేసుకోవడం రెండుక్షణాల్లో జరిగిపోయాయిగా"

"రక్షించావ్"

"ఈమధ్య బొత్తిగా కనిపించడం మానేస్తే, ఇప్పుడు జంటగా చూడగానే అనుమానం వేసింది. నిజంగా ఆమె మీ భార్యఅనే అనుకున్నాను. అదృష్టవంతులు మంచి అమ్మాయినే చేసుకున్నారు. అని సంతోషించాను."

"ఆ అమ్మాయి పిల్లతల్లి" అన్నాడు నవ్వుతూ.

"అయితేం ఏంలెండి అల్లాంటి అమ్మాయిని చేసుకోండి సుఖపడతారు. మీకు తగినట్లుగా వుంటుంది"

నవ్వాడు సుందర్.

"నీవు తగినట్లు వుండవా"

"మీ హోదాకి తగనిదాన్నేకదండి"

"సరేలే పోదాంపద ఈ కబుర్లతో సినిమా ఏంచూస్తాం ప్రక్కవాళ్ళకి డిస్టర్బన్స్"

"ఎక్కడికండీ?"

"నీయిష్టం ఎక్కడికి తీసుకువెళ్ళినా వస్తా"

"వొద్దులెండి ఇంటికివెళ్ళి హాయిగా నిద్రపోండి"

"ఇంకా ఇల్లంటూ ఏర్పరచుకోలేదుగా మనం." నవ్వింది. ఇద్దరూ బయల్దేరారు రిక్షాలో రజని ఇంటికి.

*　　*　　*

రాత్రిఅంత జరిగాక, సుందర్‌కి ఎంతకీ నిద్రపట్టిందికాదు. అందుకే బాగపొద్దెక్కి నిద్రలేచాడు. ఎక్కువసేపు మేల్కొని వుండటంవల్ల కళ్ళుమండుతున్నాయి జ్యోతుల్లాఎర్రగావున్నాయి. జరిగిన విషయం తలుచుకుంటే కళ్ళనీళ్ళు పర్యంతం అవుతుంది.

మంచంమీదనుండి బద్ధకంగాలేచి పెరటిదగ్గర నిలబడి సిగరెట్ కాలుస్తూ ఆకాశంలోకిచూస్తూ ఆలోచన సాగించాడు. ఏమీతోచటంలేదు. అంతా కలగా మాయగావుంది. ఒళ్ళంతా విరగ్గొట్టినట్లుగావుంది. రాత్రి చావుదెబ్బలు తింటే తెల్లవారి ఎలావుంటుందో అలావుంది అతనిదేహస్థితి.

శకుంతల దగ్గరనుండి వస్తున్నడబ్బు చాలా ఎక్కువగా అపుపిస్తోంది. బాకీ పెరిగిపోతోంది.తీర్చాల్సిన అవసరం లేకపోయినా ఎలాగైనా సంపాదించి ఆమెకుపంపివేస్తే మర్యాదగావుంటుంది. రాత్రిసంఘటనతర్వాత ఆమె ప్రసన్నమయ్యేఅవకాశం కన్పించటం లేదు. సంబంధం తెగిపోయినట్లే.

సదానందాన్ని అడిగితే సాయం చెయ్యకపోతాడా అనిపించింది. వెంటనే సరాసరి అక్కడికి దోవతీశాడు. అప్పటికే సదానందం ముందుగదిలోకూర్చుని ఏదో చదువుకుంటున్నాడు. సుందర్ రావటంచూచి ఆహ్వానించాడు.

"రావోయ్ సుందర్. ఏం ఇంతపొద్దున్నే వచ్చావు విశేషం?"

"అవసరమైన పనిమీదే వచ్చాను"

"ఏమిటి ?" అన్నట్లుచూచాడు.

"కొంచెండబ్బు అవసరంగా కావాలి."

"ఎంత ?"

"రెండొందలు"

"బాకీ తీర్చాలా ?"

"అవును"

అంటే అసలువిషయం అతనికి తెలుసునేమోనన్న అనుమానం కలిగింది సుందర్ కి

"లీలను అడిగి యిస్తాను వుంటే" అని లోపలకు వెళ్లి రెండొందలు తెచ్చి యిచ్చాడు సదానందం.

ఆ డబ్బు ఆ రోజునే మనిఆర్డర్ చేశాడు శకుంతలపేర. అయితే మూడోనాటికల్లా తిరిగివచ్చింది తర్వాత దాన్నిగురించి ఆలోచించడం మానుకున్నాడు.

* * *

పది పదిహేను రోజులపాటు చాలాలౌక్యంగా, జాగ్రత్తగా వున్నాడు. పదిహేనురోజులూ గడిచినాయ్. పవిత్రంగానే వుంటున్నాడు. ఎలాంటిచెడు ఆలోచనారావటంలేదు. అన్నిరోజులకుగాను శకుంతల జ్ఞాపకంవచ్చింది. వెంటనే స్త్రీవాంఛ కలిగింది. పదిహేను రోజులుగా స్త్రీ స్పర్శాసుఖాన్ని అనుభ

వించలేదు. సుఖానుభూతి లేదు. అలసటలేదు. ఎడారి జీవితాన్నే అనుభవించాడు. ఎండుమోడులా తయారైనాడు కూడానేమో!

ఆ రోజు సాయంత్రం రజనిఇంటికి బయల్దేరాడు.

" ఏమండీ! ఇలాదయచేశారు ?" అన్నది రజని వెటకారంగా

నవ్వడానికి ప్రయత్నించాడు అతను.

"ఎందుకలా నవ్వుతారు ?"

"నీకోసమే వచ్చాను రజనీ"

"మీ ప్రవర్తన నాకేంనచ్చలేదండీ. మీ అవసరమైతే వస్తారు లేకుంటే ఇటువేపు తొంగైనాచూడరు. అసలు మగవాళ్లబుద్ధే అంతేమో" అన్నది.

రజని ఇలాతనను అవమానపరుస్తుందని కలలోకూడ అనుకోలేదు. మొహంమాడిపోయింది. వెనుతిరిగి గదికి వచ్చేదామనుకున్నాడు.

"లేదు రజనీ... మానసికంగా ఒక వ్యధపడుతున్నాను. ఎక్కడికీ కదలడంలేదు. ఒక సమస్య పరిష్కారంకోసం ఇరవై రోజులనుండి, అదే ఆరోజు మనం కలుసుకున్నప్పటినుండి ఆలోచిస్తున్నాను తేలలేదు?"

"బహుశా తేలదుకూడాలెండి" అన్నది

కోపంగా వెళ్లిపోయాడు సుందర్.

## 12

అనారోగ్య కారణంగా ఈమధ్య సదానందం సెలవులు పెట్టడంఎక్కువైంది. పైగా తను చేస్తున్న పనంతా సుందర్ కి బదలాయించాడు. ఇద్దరు వ్యక్తుల పని చేయుటమంటే ఎవరికైనా కష్టమే మరి. నిజానికి సదానందం అడిగితే కాదనలేకపోయాడు. విశ్వాసం చూపించక తప్పలేదు. పైగా ఆయనకు అనారోగ్యానికి తోడు కోపం విపరీతంగా పెరిగిపోయింది. చీటికి మాటికి తన మీద విసుక్కుంటున్నాడు. అది చనువుకొద్ది కావచ్చునని సరి పుచ్చుకుంటున్నాడు తను.

ఒకరోజు సదానందం విచారంగా వుండి సుందర్ని పిలిపించాడు. బలహీనతకు తోడు కోపం, చిరాకు ఎక్కువగా వుంటుంది కూడా. పిలిచి అన్నాడు.

"సుందర్ నాకు మరీ సుస్తీగావుంటుంది తెలుసుగా. మరీ ముదిరింది రోగం. కూర్చో లేకుండాకూడా వున్నాను. ఈ కాగితాలు కొంచెంచూడు బాబూ! వీలుంటే సాయింత్రం ఓసారి అలా మా యింటికేసిరా, వీలుంటే ఏమిటిలే! తప్పకరా! పనుంది."

అలా ఆఫీసుపని సుందర్‌కి అప్పగించడం మామూలే. ఈ మధ్య సదానందం పనియావత్తు సుందరమే చూచుకుంటున్నాడు. ఈరోజు క్రొత్తగా సాయంత్రం అవసరంగా రమ్మనడం!

సాయంత్రం ఆఫీసుపని అయిపోగానే సుందర్ బయల్దేరాడు. పాపం సదానందానికి ఎలా వుందాఅన్న ఆదుర్దాకొంత.

గదిలో అడుగుపెట్టాడు అనుమానిస్తో. లీలపదోపుస్తకం ముందువేసుకొని వ్రాసుకుంటోంది.

"గుడ్ ఈవెనింగ్ లీలాదేవి"

ఆమె తలఎత్తిచూచింది.

"హల్లో సుందర్ రండి రండి" ఆత్మీయతగా ఆహ్వానించింది.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం లేదుకదా"

"ఫరవా లేదు తొందరేం లేదు"

పుస్తకాలు, వ్రాస్తున్న కాగితాలు టేబిల్‌మీదనే వదిలి సోఫాలోవచ్చి కూర్చుంది.

"కూర్చో సుందర్" అంటూ ప్రక్కకు జరిగింది.

అంటే తననుకూర్చోమని ఆహ్వానించటమే మరి. ఆమె ప్రక్కనే ఒకే సోఫాలో కూర్చోవటానికి ఇబ్బందిపడ్డాడు సుందర్.

"ఫరవా లేదు కూర్చో సుందర్" అన్నది మళ్ళీ.

కూర్చోక తప్పలేదు.

"ఏమండీ ఈ మధ్య శకుంతలగారింటికి పోవడం మరీ తగ్గించారట" అడిగింది. ఆ అడగటంలో, తనకు అధికారంఉన్న జీరధ్వనిస్తోంది.

"ఎవరన్నారు" అందామనుకున్నాడు కాని ఇంకెవ రంటారు. తెలియకనా! శకుంతలే ఫిర్యాదు చేసి వుంటుంది. అయినా తనకు ఆమెకు గల సంబంధం లీలకు తెలియవలసిన అవసరం ఏంలేదు. ఊరికేఅలా ప్రశ్నించివుంటుంది అనుకున్నాడు.

నవ్వుతూ ఆలోచనగా అన్నది.

"ఆమె చాలామంచిది సుందర్. ఆమె మంచితనాన్ని నీవే కాదు నిజానికి ఎవరూ అంచనా వేసి అర్థంచేసుకోలేక పోతున్నారు. నీవు ఆమెను చెడగొట్టావు. నీమూలంగా, నీ కోసం చెడి, పోయింది" అన్నది.

గతుక్కుమన్నాడు. ఏమీ మాట్లాడలేక పోయినాడు కూడా.

లీలలోకిచూస్తుంటే అదోలావుంది. ఎంతో నిండుతనం హుందాతనం, నిరాడంబరత ఆమెలో. పైగా అందం, ఆకర్షణ మరీ మనిషిని వివశుణ్ని చేసేలక్షణాలు. అపూర్వ ఆకర్షణ ఆమెలో వుంది. ఎంతప్రయత్నించినా చూపులు మరల్చుకోలేకపోయాడు.

"జహా శకుంతలకంటె ఎంతఅందమైంది. పురుషుణ్ని పిచ్చివాణ్నిగా చేయగలశక్తి ఆచూపుల్లోనేవుంది" అనుకున్నాడు.

ప్రయత్నిస్తే కానుండాపోదు. అట్టే కష్టంకూడా కాదు. పైగా సదానందం జబ్బులోవున్నాడు. పండినపండు చేతికందుతుంటే కోసి అనుభవించలేనివాడు అసమర్థుడు, మూర్ఖుడు అవుతాడు అనుకున్నాడు.

"వారు రమ్మన్నారనుకుంటాను హాస్పిటల్‌కి వెళ్లారు" అన్నది ప్రసంగం మారుస్తూ.

"పోనీలెండి, వారికోసం కాదు వచ్చింది" అన్నాడు.

"మరి?"

"మీకోసమేవచ్చాను"

"నాకోసమా! ఆశ్చర్యంగావుందే నేను రమ్మనలేదుగా" అన్నది. నవ్వింది అలవోకగా.

"రమ్మన్నారనే నా హృదయం చెప్పింది. అందుకే వచ్చాను. అవునుగానీ లీలాదేవీ మీరు ఇన్నిసుగుణాల్ని ఎలా అలవరచుకో గలిగారు. అందం వున్నచోట సుగుణాలు వుండవంటారే!" అడిగాడు.

మళ్ళీనవ్వింది. బుగ్గలు సొట్టలు పడేలా.

"మీరంటే నాలో అదోకరకమైన ఆకర్షణసుమా! మీ వేపు నన్ను ఆకర్షించుకున్నారు మీ గుణవిశేషంతో. మీ సౌందర్యం నన్నుకట్టివేసింది ఈవలి గట్టున" అన్నాడు.

"నేనెవర్నీ ఆకర్షించను సుందర్. ఆకర్షించలేనుకూడా. అలాఅని ఎవరైనా భ్రమపడితే అదివారి మూర్ఖత్వం, అమాయికత అంటాను"

"లేదు లీలాదేవీ.మీలో అపూర్వ ఆకర్షణవుంది. అందుకే మిమ్మల్ని ప్రేమించకుండా వుండలేకపోతున్నాను. ప్రేమిస్తున్నాను అంటే ఆ 'ప్రేమ' కాదనుకోండి "అని తొట్రుపడ్డాడు. ఇది ఆరాధన. మీ సౌశీల్యాన్ని సౌందర్యాన్ని, సౌందర్యోపాసకుడుగా అరాధిస్తున్నాను."

"అలాగే ఆరాధిస్తోవుంటే నష్టమేముంది. కొందరు చెప్పకుండా ఆరాధిస్తోవుంటారు. మీరు ఆరాధిస్తున్నారని చెబుతున్నారు అంతేగా తేడా" అన్నది.

అంత సీదాగా, ఉదాసీనంగా ఆమాట అనగలుతుందని ఊహించలేదు సుందర్. ఆపాగ్రడకే ఉబ్బిపోతుందనీ శకుంతలలా వచ్చి వొళ్ళోవాలిపోతుందని అనుకున్నాడు. పురుషుడు "నిన్ను ప్రేమిస్తున్నానంటే స్త్రీ ఉక్కిరి బిక్కిరైపోయి ఏదో అవుతుందనుకుంటాడు. "భ్రమ".

"ఇలాంటి విషయాలకు నీవు చాలాకొత్తవాడివి సుందర్ నన్ను ఎవరూ ప్రేమించలేదు. నాకు తెలుసు. ఒకవేళ ప్రేమిస్తున్నామన్న భ్రమలోవున్నా, ఆ భ్రమలు మేఘమాలికల్లా కొద్దిరోజుల్లోనే విచ్చుకుంటాయి. ఆ కల పీగిపోతుంది. స్త్రీని ప్రేమించటమంటే అగ్నిలోదూకటమే సుందర్."

ఆమె నవ్వుతూ ఆ మాటలు అంటుంటే సుందర్ కి అయోమయంగావుంది. ఆమె మాటలకన్నా, ఆ వెనుక మెరిసే బలమైనభావన, ఆత్మస్థైర్యం, అతన్ని విచలితుణ్ని చేశాయి.

'ఎందువల్ల లీలాదేవి?'

"నిరుపయోగమైన వస్తువును ఎవరన్నా భద్రంగా దాచి పెట్టుకున్నారా! అలాగే నిరుపయోగమైన స్త్రీని ఎవరూ ప్రేమించరు. ఆ విషయం మొదట్లోనే చెప్పేస్తాను నన్ను ప్రేమించానన్నవాళ్లతో. నీవేం భయపడ నవసరంలేదు మామూలుగా వస్తుందు సుందర్. ఏమీ ప్రమాదంలేదు. నేను ఏమీ అనుకోను. నీవు నన్ను ప్రేమిస్తున్నానన్నావు గనక ఏదైనా అఘాయిత్యం చేస్తావని నేననుకోను"

" అంటే నాభావాలపై అధికారం మీకున్నదనేగా మీ భావన" అన్నాడు అలంకారయుక్తంగా. ఆ మాటల అర్థం లీల గ్రహించకపోలేదు. గ్రహించి నిగ్రహించుకుంది.

సుందర్ వేపుతిరిగి నవ్వుతూ అన్నదిలీల.

"సుందర్! నాదృష్టిలో ప్రేమించటమంటే సజీవ సమాధి కావటమన్న మాట. ప్రేమిస్తున్నాననే వ్యక్తి మృతజీవుడు. అలాంటి వానితో చాలాప్రమాదం. నన్ను ప్రేమించేవారితో, ప్రేమిస్తున్నామని చెప్పేవారితో నేను సంబంధం పెట్టుకోను. ఎందుకంటావా? ఆ ప్రేమాయణంతో నా ప్రాణం విసిగిపోయింది. అదంతా నటనఅని నాకు తెలుసు. తాము ప్రపంచంలో తొలిసారిగా ప్రేమించటం అనేది ప్రారంభించినట్లు ఆర్భాటంచేస్తారు. అది నాకు చెడ్డచిరాకు. పైగా ప్రేమించడం అనేది ఒక రకమైనజబ్బు. అదొకరకం పిచ్చి. పిచ్చికుక్క ఏక్షణాన మీదపడి కరుస్తుందోచెప్పలేంచూడు. కనక అలాంటివారిని, వారికి విసుగుపుట్టేవరకూ దూరంగా వుంచుతాను. ఆ తర్వాత అంటావా పూర్తి విసుగుపుట్టి వారే నా జోలికిరారు.

నాకు తెలుసు నీ ప్రేమ ఎలాంటిదంటే అదొకరకమైన దాహం. ఆ దాహం తీరితేగాని తృష్ణతీరదు. పురుషులంతా అంతే. ఓర్చుకోలేరు. ఉన్మాదంఎక్కువ స్త్రీకున్న సహనం, ఓర్మిపురుషులకుండవు, నా కలాకాదు. ప్రేమఅంటే రెండు ఆత్మలు గాఢంగా పెనవేసుకోవడం. హృదయాలు అనుభూతిలో తాదాత్మ్యం పొందటం. నీ ప్రేమభౌతికం, నాది ఆధ్యాత్మికం. ఇది ఆత్మపరమైనది. అవునుసుందర్ అదే నా దృష్టిలో ప్రేమంటే. ఇప్పుడుచెప్పు నన్ను ప్రేమిస్తున్నావా నీవు?" అన్నది.

ఇపుడు ఆమెలో నవ్వులేదు ఎగతాళికాదు. చాలా సీరియస్‌గా అడుగుతోంది కళ్ళలోకిచూస్తూ. ఆ మొఖం ఎంతో భావనారహితంగావుంది.

"నేను ఎన్నటికే నిన్ను ప్రేమించలేను సుందర్. నేను గాని, నా సౌందర్యంకాని, నీవనుకొన్నంతగా నీకు ఉపయోగపడవని తెలుసుకోవడానికి ఆట్టే కాలం పట్టదనుకొంటాను. అలాంటి కోరిక నీకుంటే దాన్ని చెరిపెయ్యి ఎప్పటికైనా నీకే ప్రమాదం, చెరుపుఅది. పోనీ ఆ గొడవ వదిలేదాం ఎప్పటికీ స్నేహితులంగా వుందాం నాకేం అభ్యంతరం లేదు. కాక ఆత్మీయులంగా వుందాం అభ్యంతరంలేదు. ఎలాంటి పొరపొచ్చాలులేని ఆత్మ మిత్రులుగా వుందాం సరేనా సుందర్. ఏమంటావు?"

ఆమె నిర్ణయం ముందు ఏమన్నా ప్రయోజనంలేదు. కాదని అనేధైర్యం, స్తోమతులేవు. మరేమీ అనేది, చెప్పేదలేక ఊరుకున్నాడు.

"నేను నీవాణ్ని లీలాదేవీ! ఏమైనాఅను, ఏమైనా శాసించు బద్ధుణ్ణి. ఎలా నడచుకోమంటే" ఎలావుండమంటే అలావుంటాను. నాకు వెలుగుబాట కావాలి పయనించడానికి. ఆబాట నీవుచూపగలవనే విశ్వాసం నాకున్నది సరేనా" అన్నాడు వేలగా.

ఆ మాటల్లో నిజాయితీ అవుపించింది లీలగా లీలకు.

"అలాగే సుందర్" అన్నది.

"లీలాదేవీ! నాకు మీలాంటి స్త్రీలభిస్తే ఎంత ఆనందించేవాణ్ని. నీలాంటి స్త్రీని వివాహంచేసుకొని జీవితాంతం ఆరాధించడానికి నాకెలాంటి అభ్యంతరం వుండేదికాదు. ఏజన్మకయినా లీలాదేవి వంటి స్త్రీ భార్యగా లభించాలని ఆదేవదేవుణ్ని కోరుకుంటున్నాడు." అన్నాడు కళ్లుమూసుకొని.

ఆ మాటలకు లీల కరిగిపోయింది. అవి పొగడ్తలుకావు. హృదయం చీల్చుకొని వచ్చిన మాటలు పసిడి పలుకులు. ఆహృదయం ఆనందంతో పరవశించి ఊగిపోయింది ఆక్షణాన సుందర్ కి దాసోహం అని.

'నేను ఎప్పటికీ నీదాన్నే సుందర్. ఊరక నిన్ను పరీక్షించాలని అలా అన్నాను. నీ హృదయం నాకోసం ఆరాటపడుతోంది. నీలోని స్పందనకు ప్రతిస్పందన నాలోనూ కలిగింది. మనంఒక్కటే సుందర్, అనాలనుకుంది.

కాని నిగ్రహించుకుంది. ఆచూపుల్లోనే తనకాంక్షను తెలియచేసింది. అది తెలుసుకునే శక్తి సుందర్‌కి లేదు. ఉంటే ఆక్షణం మధురభారంలో ఊగిపోయేది గదా మరి!

“నీవు చాలాఉన్నతురాలివి లీలా. కల్లాకపటం తెలియని దానివి. నిష్కల్మష హృదయంనీది”.

“నిజంగానా సుందర్? మరోవిషయం చెప్పమంటావా మరేం అనుకోవుగదా!”

“చెప్పు లీలాదేవి”

“నామీద నీకు ఏమాత్రం ప్రేమవున్నా, ఆదరం గౌరవంవున్నా వెంటనేవెళ్ళి ఓసారి శకుంతలను కలుసుకో. ఆమె నీకోసం అహోరాత్రులు తపస్సుచేస్తోంది. నిన్నెంతగా ప్రేమిస్తోందో నీకుతెలియదు. అందుకే స్త్రీని అర్థంచేసుకోవటం పురుషునివల్ల కాదని అంటారు. శకుంతలవంటి మంచి స్త్రీ నీకు అర్థం కాలేదు. అక్కడకు వెళ్ళటంవల్ల ఏదో ఆత్మవంచన చేసుకోవటం అనుకోకు. నిన్ను నీవు కించపరచుకోవటం అనుకోకు. నిన్ను నీవు ఉద్ధరించుకొన్నట్లే”.

“థాంక్సు లీలా .... వస్తా మీ సలహా ఆజ్ఞగా స్వీకరిస్తాను” అని బయటకు నడిచాడు.

రెండు మూడు రోజులు తీవ్రంగా ఆలోచించాడు. శకుంతల ఇంటికి, తనకుగా వెళ్ళడానికి మనసొప్పింది కాదు. తనంతట తాను వెడితే ఆమెదృష్టిలో చులకన అవుతానని భయం, శంక. పోకుండా వుంటే లీలాదేవి కిచ్చినవాగ్దానం వమ్మవుతుందని భయం. తీవ్రంగా మనోవేదనకు గురిఅయ్యాడు ఆ రెండు మూడు రోజులున్నూ.

నాలుగోరోజు శకుంతలనుండి ఓ ఆహ్వానం వచ్చింది. పాప పుట్టినరోజు పండుగ చేసుకొంటున్నాం తప్పక రావాలి, అని ప్రత్యేకాహ్వానం.

# 13

~~ఈ~~పుట్టినరోజు పండగకూ, తనకొచ్చిన ఆహ్వానానికి ఏదో సంబంధం వుందనిపించింది సుందర్ కి. తనను ఆహ్వానించడానికి తనతోటి స్నేహాన్ని పునరుద్ధరించడానికి ఈ ఉత్సవం చక్కని అవకాశం పాపకు మంచి పట్టుగౌనులు కొన్నాడు. రెండు వందలుపెట్టి బంగారు నెక్లెస్ ఒకటితీసుకొన్నాడు.ఒక పొట్లంగులాబీ పూలుతీసుకొన్నాడు, అన్నీతీసుకవెళ్లి పాపకోసేట పోశాడు.

" ఏమిటి సుందర్ ఇవన్నీ"

"పాపకు" అన్నాడు ముభావంగా మనోభావాన్ని వ్యక్తంచేస్తూ.

" చాలా ఖర్చుచేశావుకదూ "

" ఫరవాలేదు "

నిజానికి శకుంతలనుండి అడపా, తడపా పుచ్చుకున్న డబ్బు కన్న ఎక్కువే ఖర్చుచేశాడు ఈసారి.

విందుకు నిజానికి అట్టేమంది రాలేదు. లీలాదేవి బలవంతాన వచ్చాడు సదానందం. మరికొద్ది మంది శకుంతల మిత్రులు వచ్చారు.

"ఈ అమ్మాయి లత, నాచెల్లెలు సుందర్. ఎం.ఎ.చదువు తోంది" అని పరిచయంచేసింది శకుంతల ఓ సుందరిని.

" ఓహో నమస్తే " అన్నాడు

విందులో తనకు ఎదురుగాకూర్చుంది శకుంతల.

తలయెత్తి ఆమె కళ్లలోకి చూచే ధైర్యంలేక పోయింది. కొత్తపెళ్లికొడుకులా తలవంచుకొనికూర్చున్నాడు. కొన్ని క్షణాలకు ఆనిరుకు లోంచి బైటపడ్డాడు. చూపులు కలిసినపుడే ప్రశ్నార్థకంగా పలుకరించుకున్నారు. అందులో పూర్వపు అనురాగం, ఆదరణ యథాపూర్వకంగా కనిపిస్తోంది.

హటాత్తుగా టేబుల్‌క్రింద తనకాలిని ఎవరో గీకు తున్నట్లయింది. ప్రక్కకు తొలగించుకున్నా ఆ కాలు మరీదగ్గరగా చేరి చక్కిలిగింతలు పెట్టినట్లుంది. ఆస్పర్శ సుందర్‌కి పరిచయమే. ఆస్పర్శలో తెలిసింది ప్రేమకలాపం తిరిగిప్రారంభం కానున్నదని. అదేస్వాగతం, అదేఆహ్వానం.

ఏమిటీ సంబంధం ?

సుందర్ ఆమె వేపుచూచినపుడల్లా శకుంతల పెదాలు చప్పరించడం, మునిపంటితో పెదాలు బిగపట్టడం, స్వచ్ఛంగా ఆహ్వానాన్ని, ఆంతర్యాన్ని తెలియచేస్తున్నాయి. సరసకామినీ హృదయానికి వసంతంవచ్చినట్లుంది. శకుంతలకు ఆరోజు సుందర్‌ని చూట్టం పండగ్గానేవుంది. వొళ్లు పూలుతొడిగింది.

భోజనం అయింతర్వాత అలావరండాలోకివెళ్ళి సిగరెట్ ముట్టించాడు.

"సుందర్!"

ఆపిలుపుతో చటుక్కున వెనుతిరిగి చూచాడు.

"ఇలారా సుందర్"

గోడవారగావున్న ఈజీచైర్‌లో కూర్చుని సదానందం పిలిచాడు. సదానందం అంటే సుందర్‌కి గౌరవం, భక్తి. అలాగే సుందర్ అన్నా సదానందానికి ఆదరం, అభిమానం.

"కూర్చో సుందర్ ఫరవాలేదు" అన్నాడు, దగ్గరగా వచ్చిన సుందర్‌కి ఎదురుగావున్న కుర్చీ చూపిస్తూ.

"ఏదీ .... నాకూ ఓ సిగరెట్ యివ్వు."

"ఇవి తక్కువ రకంవి"

"ఫరవాలేదు"

ఇచ్చాడు.

"ఊఁ నువ్వూ కాల్చు ఫరవాలేదు."

సదానందం ముందు అంతకుముందు ఎన్నడూ సుందర్ సిగరెట్ వెలిగించి ఎరగడు. ఇపుడు కాల్చక తప్పలేదు. సదానందం బలవంతం మరీ ఎక్కువైంది.

బయట తెల్లని వెన్నెలవాన కురుస్తోంది.

కొన్నిక్షణాలు అలా చూస్తూ ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

"సుందర్ నేను నీకంటే ఆట్టే వయసులో కాకపోయినా అనుభవంలో పెద్దవాణ్నికదూ ప్రశ్నించాడు."

"అందుకు అనుమానం ఏముందండి?" అన్నాడు.

"అవును అందుకే జీవితంపట్ల నాకొలమానాలు వేరు. జీవితం అనేది ఓ పెద్ద పర్వతంసుమా! పైకి వెడుతున్నకొద్ది ఆనందం ఉరకలువేస్తుంది. వెంకటేశ్వరుని దర్శనంకోసం ఒక్కొక్క కొండఎక్కి పైకిపోతున్న భక్తుని ఆత్మానందం అలాంటిదేసుమా! జీవితపర్వతం చివరకంటా వెళ్లాక వెనుతిరిగిచూస్తే అఖాతం అవుపిస్తుంది. అంతుతెలీని అందనిలోయలు అవుపిస్తాయి. అక్కడే మరణం అదృశ్యరూపంలో అవుపిస్తుంది. ఒక్కసారిగా అఖాతంలో పడిపోతాము. ఎంతనెమ్మదిగా పైకిపాకుతామో అంతతొందరగా క్రిందికి, అఖాతంలోకి పడిపోతాము. నీవయసులో జీవితం అంతా సుఖంగానే వుంటుంది. ఎన్నోపొందాలనిపిస్తుంది. కానీ ఆశించినవన్నీ పొందలేకపోతాం. అన్ని ఆశలు పోయినాక కోరేది ఏమీ వుండదు. ఒక్క మరణం మినహా."

"ఏం మహా వయసు చెల్లినవారిలా మాట్లాడుతున్నారు" ప్రశ్నించాడు సుందర్ ధైర్యంచేసి.

"చెప్పానుగా వయసులో కాకపోయినా అనుభవంలో ముసలివాణ్నే. కాక మరణం దగ్గరైన ప్రతివ్యక్తి ముసలివాని క్రిందేలెక్క. అటునుండి కొలుచుకోవాలి జీవితాన్ని ... శేష జీవితం ఎంతో మనిషివయసుఅంత. నాకు భూమ్మీదగింజలు ఆట్టే

రోజులులేవని నాకు తెలుసు. ఇవన్నీ ఎందుకు చెబుతున్నానని ఆశ్చర్యపడకు. నీకు కొన్ని సలహాలివ్వాలని వుంది."

"మీ మాటలు వింటుంటే నవ్వొస్తోంది" అన్నాడు.

"ఈరోజున ఈవయసులో నామాటలు నవ్వుగానే వుంటాయి. అనుభవం తక్కువగదా! కొన్ని సంవత్సరాలు గడిస్తే గాని సత్యం బోధపడదు. నాకూ, నీకూ, మనలో ప్రతివ్యక్తికీ ఆ సత్యాన్ని తెలుసుకొనేరోజు ఒకటుంటుంది. మనంచూచే విషయాలు, తెలుసుకొన్న విషయాలు అనేకం వుంటాయి. చూడనిది ఒకటున్నది. అది మరణం. మరణం అనేమాటకర్థం ఇపుడు తెలీదు. నీ వయసులో మరణానికి విలువ, బరువు లేదు. నాకో అది భయంకరం. కొంతకాలం జరిగాక జీవితంలో ప్రతివిషయానికి విలువలు మారతాయి. రోజులు, నెలలు జరిగినకొద్దీ మరణానికి దగ్గరవుతుంటాంగదా మరి. నాలో ఇపుడుమిగిలిందేమీ లేదు. నన్ను నేనే గుర్తించలేని పరిస్థితికివచ్చాను. మరణం నన్ను వెంటాడుతోంది. దానికి దగ్గర అవుతున్నాను. ఏంచేసినా, మరణంకోసమే ననిపిస్తోంది. బ్రతకటం ఎందుకంటే మరణించడానికే ననిపిస్తోంది.

ఈవిషయాలన్నీ ఒకరోజు నీకూ తెలుస్తాయి సుందర్. ఓ గంటసేపు స్థిమితంగాకూచుని ఆలోచించు. నీకే తెలుస్తుంది. జీవితంలో ఏంసాధించాలని ఆశిస్తున్నావ్. ప్రేమ, ముద్దులు, శృంగారమా! ఇవన్నీ కొంతకాలానికి వెగటై పోతాయి. స్త్రీని పొందాలంటే ద్వేషం పుడుతుంది తెలుసా. పోతే ఇంకేమిటి?

డబ్బు! ఎందుకు? డబ్బుకలవాడినని గర్వపడ్డానికా! అందమైన అమ్మాయిన్ని ఆకర్షించడానికా? స్త్రీ సుఖంపొందటానికేగా డబ్బు. ఆ సుఖం శాశ్వతంగా వుంచుకోవాలనే తాపత్రయం లోనేగా సంపాదన. ఏమిటో! పోతేకీర్తి. కీర్తికికూడా ప్రేమఒక్కటే ధ్యేయం. నీవుచాలా గొప్పవాడివై స్త్రీలను నీవేపు ఆకర్షించు కోవాలని చూస్తావు. కానపుడు కీర్తి అనవసరం. అన్నింటికీ చివరిన మరణంవుంది. నేను ఆమరణానికే సమీపంలోవున్నాను. భూమిని, రోదసిని కప్పివేయగలిగింది మరణం. ఎక్కడచూచినా నాకు మరణమే శరణం అనిపిస్తోంది. అదే వివిధరూపాల్లో కనిపిస్తోంది. ఏదిచూచినా 'ఇదోమరణం' అనిపిస్తుంది.

నేనుచూచినదాన్ని, చేసినదాన్ని, ప్రేమను, వెన్నెలను, సుఖాన్ని, ఆనందాన్ని అన్నింటినీ కాటువేయగలిగింది మరణం.

జీవిస్తున్నదేదీ మరణానంతరం తిరిగిరాదు. నా ఆలోచనలు కోరికలు తిరిగిరావు, మిగలవు. కోట్లమందిజీవులు పునఃజన్మిస్తుంటారు. నేను అనేవాడు తిరిగిరాడు. అందుకే అన్నింటికీ తరుణోపాయం మరణం అన్నాను.

ఆలోచించు సుందర్! రోజూకొంతసేపు ఇలా ఆలోచించు అదే తత్త్వజిజ్ఞాస. కొన్నిరోజులకు నీవు నీవుకాక మరొకరుగా, దర్శకునిగాజీవితాన్ని చూడ్డానికి, జీవించడానికి అలవాటుపడతావు. నీదిఅనేది లేదనుకున్నప్పుడు ఏదీ శాశ్వతంకాదని తెలుసుకున్నప్పుడు జీవించడం ఎంత తేలిక.

ఏ బాధలు, బరువులు, వ్యసనాలువుండవు. హాయి గా జీవించవచ్చు. కావాలని కాంక్షించినపుడు కావాలనుకొన్నది లభించనపుడే బాధ. వాంఛలు ఎక్కువైతే బాధలు ఎక్కువౌతాయి. ఈ బాధలన్నీ ఎందుకొస్తున్నాయంటే మనంపూర్తిగా భౌతికంగా జీవించడానికే అలవాటుపడ్డాం కనక. అదే ఆధ్యాత్మికంగానో, మానసికంగానో జీవించడానికి అలవాటుపడితే, జీవించ నేర్చితే ఈ బాధలుండవు. తెలివి కలవారమనుకొంటూనే ఈ బాధల్ని కొనితెచ్చుకొంటున్నాం. మనకంటే సామాన్యప్రజమేలు. వారికి మనకున్న కోర్కెలుండవు, అన్నిబాధలూ వుండవు. ఆ మాత్రంకూడా ఉండవు జంతుజాలానికి.

నాకు ఎవరూలేరు తెలుసా! అమ్మ, నాన్న, అన్న, అక్క భార్య, పిల్లలు, దేవుడు, దయ్యం ఏమీలేవు సుందర్...పోనీలే సుందర్ ఇంకాలోతులకు పోనులే ఆపివేశాడు. కళ్ళమ్మట జొట జొట నీరుకారింది. ఎందుకో కళ్లు చెమ్మగిల్లాయి ఆ క్షణాన.

ఇదేమిటి పెళ్లాంలేదంటాడు అనుకున్నాడు సుందర్.

"పెళ్ళిచేసుకో సుందర్.... ఒంటరిగా జీవించలేవు.... దుర్భరం ఏకాంతంఅంటే. భయంవేస్తుంది. ఒకవయసులో ఏకాకి అనేభావం వచ్చినపుడు వణకిపోతాం, భయపడిపోతాం, విచారిస్తాం. పెళ్ళిచేసుకో పిల్లన్నికను_ అవసరంకూడా సుందర్"

"ఏమోనిమ్మిత్తున్నీ, మరణభయంలో ఏమేమో చెప్పాను కాని సెయిష్టం నీదిలే సుందర్............వస్తా."

ఇంకా అక్కడకూచో బుద్ధికాలేదు. సెలవుతీసుకుని వెళ్లి పోయాడు. రాత్రి సరిగా నిద్రపట్టలేదు. విపరీతమైన ఆలోచనలు.

తెల్లవారినం దగ్గరనుండి శకుంతల మదిలో మెదులుతూ వుంది. ఆమెను ఎలాగైనా కలుసుకోవాలనే కోరిక ఉధృతంగా వుంది. రోజల్లా ఎలాగోగడిపాడు .... సాయంత్రం అయిదింటికి ఆఫీసు అయిపోగానే బయల్దేరాడు శకుంతలను కలుసుకు తీరాలనే ఉబలాటం, ఉత్సాహం.

డ్రాయింగ్ రూంలో అడుగుపెట్టేసరికి గతుక్కుమన్నాడు ఆయనెవరో తెలీదు. సోఫాలోకూర్చుని పేపరు చదువుకుంటు న్నాడు. వయస్సు నలభై వుంటుంది. జుట్టు అక్కడక్కడ తెల్ల బడ్డదికూడా. తీరిగ్గాపైప్ కాలుస్తూ కూర్చున్నాడు.

"ఓ రండి మీ పేరు సుందర్ కదూ" అన్నాడు తనని ఆహ్వానిస్తూ

"అవునండీ" అన్నాడు సుందర్ ఆశ్చర్యాన్ని సంతో షంతో మేళవించి.

ఆయన ఎవరో తనకు తెలీదు, పరిచయం లేదుకూడా. తనని ఎరిగున్నట్టు పలకరించడం ఆశ్చర్యమే కలిగించింది.

"ఆఁ మిమ్మల్ని చూడగానే పోల్చుకున్నాను మీరే సుందర్ అయివుంటారని.మా శకుంతలచెప్పిందిలెండి ఏం మనిషిలాగే వుంటారని. ఆవర్ణనునుబట్టి పోల్చుకో గలిగాను" అన్నాడు సంతృప్తిగా, అదేదో మహాఘనకార్యం సాధించిన విజయునిలా.

"ఎవరూ! శకుంతలా" అందామని నాలిక చివర వరకు వచ్చింది కానీ ఆగాడు.

"అన్నట్లు, మీగురించి వినటమేకానీ, పరిచయంలేదు సుమండి. కలుసుకుందామని ఎప్పటికప్పుడే అనుకుంటుంటాను. కానీ బిజినెస్‌తొందరలో పట్టుమని పదిరోజులుండటమే పడడం లేదు. బావుంది ఈవేళ మిమ్మల్ని చూచే భాగ్యం కలిగింది."

శకుంతల ట్రేలో కాఫీకప్పులు పెట్టుకొనివచ్చింది. ఇద్దరికీ చెరొకకప్పు అందిస్తూ! సుందర్ వేపుస్వాగతంగా చిరునవ్వు విసిరింది. తానుమరొక కప్పు తీసుకునికూర్చుంది.

సుందర్‌కు ఆమె ప్రవర్తనఅర్థంకాలేదు. పైగా అంతఒబ్బిడిగా ప్రవర్తించడం ఆశ్చర్యంగావుంది. స్త్రీలో ఇంతటి నటన సహజంగా వుంటుందని సుందర్‌కి తెలీదు. మహానటీనటులో, కళా ప్రపూర్ణులో, నటకావతంసలో అలానటించగలరని భ్రమపడే వాడు. కానీ శకుంతల సహజ నటనా ధురీణ.

ఏకాంతంలో రతీదేవిలా పెనవేసుకుపోయే శకుంతల ఈ నాడు సభ్యతకోసం, ఎంతదూరంగా పతివ్రతగా మునగతీసు కునికూర్చుంది అనుకున్నాడు ఈముసలాడికి అనుమానం కలుగుతుందని భయమా? లేక నమ్మించాలనే తాపత్రయమా? పొరపాటునకూడా తమచనువును వ్యక్తంచేయలేదీ యువిద నటన అన్నది అంటునా ఇలాంటి సమయాలలో అతిసహజంగా స్త్రీకే ఒప్పుతుంది అనుకున్నాడు.

ఇదిమోసం, పచ్చిమోసం. అయినవారిని మోసం చేయటం. ప్రపంచంలో మోసం చేయటమన్నది స్త్రీకి జన్మతః అబ్బినవిద్య.

పాపవచ్చింది, వచ్చికూడా తనకేమీ తెలియదన్నట్లు తండ్రివొళ్లో కూర్చుంది.

"అన్నట్లు సదానందంగారు మదనపల్లి వెడుతున్నారట. డాక్టర్ల సలహాపాటించాలిగా" అన్నది శకూ.

"అవునట పాపం. ఆరోగ్యం చాలాక్షీణించింది"

"అవునుకదామరి. లీలవుండి కంటికిరెప్పలా కాపాడుకుంటుంది కనక సరిపోయింది. లేకుంటే మరో మగదిక్కులేని సంసారంగదా. ఎంతో సమర్థురాలుపాపం. పోనీసెలవుపెట్టి మీరూ వెళ్లకూడదా సుందర."

"లీల వుంటేచాలు అన్నీ చక్కపెట్టుకుంటుంది. అలాంటి స్త్రీ దొరకటం సదానందం అదృష్టం. పూర్వజన్మ పుణ్యఫలం" అంటానునేను...

"అవును" అన్నది శకుంతల.....

ఆ మాటలలోని వ్యంగ్యం అర్థంచేసుకోలేదు పాపం సుందర్.

"పాపం అతనుచనిపోతే ఆమెగతేం కాను" అని విచారించాడు సుదరం.

మర్నాడు వెళ్ళిపోయేపుడు స్టేషన్ వరకు వెళ్లారు అంతా. రైలు కదలబోయే ముందు లీల అన్నది "అవసరమైతే టెలిగ్రాం ఇస్తాను వస్తావా సుందర్."

"తప్పకుండా వస్తాను లీలా"

రైలు కదిలింది. లీలను, సదానందాన్ని మిత్రులకు దూరంచేస్తూ దూరంగా సాగిపోయింది.

వైరాగ్య భావంతో మర్నాడు కదలనేలేదు సుందర్. తాత్కాలికంగా విరక్తి. శకుంతల ఇంటివేపు పోగూడదని నిశ్చయం. కానీ శకుంతలే సుందర్ గదికి వచ్చింది. సమాదరంగా ఆహ్వానించక తప్పలేదు.

"సుందర్ ఈమధ్య ఎడబాటుకు క్షమించు. నిజంగా నీవు లేకుండా బ్రతకలేనని నిర్ధారణఅయింది. రోజూ నిన్ను చూడాలనీ, నీతోవుండాలనీ అనిపిస్తుంది. నీవులేందే నేనులేననే గాఢనమ్మకం కలిగింది సుందర్. త్వమేవాహమ్. మరచిపోయాను ఆయనకు నువ్వంటే ఎంతయిష్టమో తెలుసా!"

అప్పటివరకు తలవంచి మౌనంగావింటున్న సుందర్ ఆ మాటతో తలెత్తిచూచాడు.

"ఏం నీకుకాదా?" అన్నాడు.

"సరేలేవోయ్ పిచ్చికన్నా.... నీమీద నమ్మకంలేకపోవడం ఏమిటి? గొప్పనమ్మకం, వెర్రిప్రేమ. చాలామంచివాడేనని నమ్మకం. సుందర్ ఓకమాటచెప్పనా! వింటావా! వింటానంటేనే చెప్పేది?"

"చెప్పు" అన్నట్లుచూచాడు.

ఇకమీదట మనం స్పర్థలు పెంచుకోవద్దు సుందర్. ఎప్పటికీ ఇలా ఒకటిగానే వుండిపోదాం? .... అన్యోన్యంగా భార్యా భర్తల్లా?

"అదెలా శకుంతలా సంభవం?"

"అవును సుందర్ నేను నీభార్యనే. అలానేవుందాం."

వొద్దులే శకూ భార్యఅంటే ఇబ్బంది పడాలిసొస్తుంది. ప్రేయసి అన్నపుడుకలిగేఆరాధన, ఆపేక్ష, ప్రేమ భార్యఅన్నపుడు కలగవు.

" పోనీ ప్రేయసే అనుకో"

అంటూ సుందర్ని బాహువుల్లోబంధించింది, తలగోము గా నిమురుతూ అన్నది

"నన్ను పెళ్లంచేసుకు సుందర్. ఎప్పటికీ నేను నీదాన్నే"

"మీఇంటికొస్తే ఆయన అనుమానించడుగదా!"

"లేదులే. ఆయనకు ఛస్ అంటే వల్లమాలినపిచ్చ. ఆవంక పెట్టావా ఆయన నీకుదాసుడే."

చివరకు సుందర్ని వొదల్లేక, వొదల్లేక వదిలింది ఆరోజు.

ఒంటరిగా కూర్చుని సుందర్ యోచించుకున్నాడు. శకుంతల ఎంతమంచిది. ఈవిడతో సంబంధం ఏర్పడుతుందని ఏనాడు అనుకోలేదు. ఏమిటో అంతా లీల. ఎవరికెవరో ఎవరికెరుక. ఇంతమంచిదాన్ని వొదులుకోగలనా? ఇంత ఆనందాన్ని ఇవ్వగల స్త్రీ మరొకరు దొరుకుతారా లోకంలో అనుకున్నాడు. ఆలోచనలోనే ఆరోజంతా గడిపాడు. వేయిరూపాల్లో, రంగుల్లో శకుంతల సాక్షాత్కరించింది.

## 14

సదానందం అనారోగ్యం కారణంగా సెలవుపెట్టి వెళ్ళడంతో ఆ బాధ్యత సుందర్‌మీద పడ్డది. బహుశా అతను తిరిగి స్వస్థుడై వస్తాడన్న నమ్మకం ఎవరికీ లేదు. అందుకే ఆ పదవి సుందర్ ఆక్రమించుకున్నాడను కుంటారంతా. పోతూ పోతూ తనబాధ్యతలకు సుందర్‌ని రికమెండ్ చేసి మరీ వెళ్లాడు సదానందం. అందుకే కాదనక బరువు బాధ్యతలు మోయవలసి వచ్చింది. దానితో గౌరవం పెరిగింది. పత్రికలో ఏ పని కావలసినా సుందర్ ద్వారా జరగవలసిందే. అది కారణంగా పట్టణంలోని ప్రముఖులలో ఒకడైనాడు సుందర్.

పైగా శకుంతల కుటుంబంతో ఏర్పడ్డ సాన్నిహిత్యం మరింత కులీనుణ్ని చేసింది. ఇప్పుడు క్లబ్బులకు వెళుతున్నాడు, రోటరీకి వెడుతున్నాడు. అందుకు శకుంతల ఎంతో దోహదం చేసింది. గౌరవ కుటుంబాలవారు, లక్షాధికార్లు, పెద్ద అధికార్లు అందరితో హోదాలో తనూ సమానమే. శకుంతల మాట్లాడే మాటలు, స్నేహం అందుకు అనుకూలించాయి. అందుకే అప్పుడప్పుడు అంటూండేవాడు "శకుంతలా! నీ స్నేహమే లేకపోతే నేనీ స్థితిలో వుండేవాణ్ని కాదుకదా!" అని

అలాఅని సుందర్ అంటే ఆమెకుగర్వం. తనను శ్లాఘిస్తే ఏ స్త్రీ ఉప్పొంగిపోదు కనక. ప్రతిరోజూ ఏదో ఒక సమయంలో ఆమెయింటికి పోవడం అలవాటైంది.

ఇపుడు శేఖర్‌తో కబుర్లు వేసుక్కూచుంటాడు. పేకాట ఆడతాడు, ఛెస్ ఆడతాడు. శేఖర్‌ని అన్నివిధాల ప్రసన్నంచేసుకున్నాడు. కుటుంబంలో కలిసిపోయాడు.

సుందర్ పరాయివ్యక్తి అన్న అభిప్రాయం శేఖర్‌కి కానీ, శకుంతలకుకానీ కలగటంలేదు. ఒక్కొకరోజు భోజనంచేసి అక్కడే నిద్రపోతాడు. పాపకూడ ఒక్కొకరోజు సుందర్ ప్రక్కలో పడుకుని నిద్రపోతుంది.

సుందర్ ఉన్నపుడు, లేనపుడు అతన్ని గురించి మంచిగా మాట్లాడుతుంది శకుంతల. "ఎంతమంచివాడండి" అంటుంది శేఖర్‌తో.

'అవును' అనే అంటాడు శేఖర్.

○ ○ ○

రోజులు నెలలుగా మారిపోయినయ్. సుందర్ మనసులో నీలమేఘచ్ఛాయలే అవుపించటంలేదు. తనకు 'ఇదిలేదు' అన్న శంకకు ఆస్కారంలేకుండా పోయింది.

ఒకరోజు సాయంత్రం గదికివెళ్ళేసరికి తలుపుసందులోంచి లోపలకు వేసిన ఉత్తరం ఒకటి కాళ్ళకు తగిలింది. ఆత్రంతో తెరచి చదివాడు.

మదనపల్లి నుండి. మరీ ఆత్రం ఎక్కువైంది. విప్పిచదివాడు: సుందర్!

ఇచ్చినమాట జ్ఞాపకంవుందా!

మాటఇచ్చావుగదూ! అవసరంఅయితే నీసాయం లభిస్తుందన్నావుకదూ! ఇపుడు నీసాయం అవసరం అయింది సుందర్. వెంటనే బెలుదేరిరాగలవుగదూ! వారు అవసానదశలో వున్నారని వేరేవ్రాయలా! ఒక్కదానికి భయంగావుంది. ఏక్షణాన ఉపద్రవం జరుగుతుందో అర్థంకావటంలేదు. మ రో క వా రం మహావుంటే.

రోజురోజుకు నాలో సహనం నశిస్తోంది. బాధల్ని భరించే శక్తి కోల్పోతున్నాను. ఆచివరి క్షణం, మరణం మ ని షి ని కబళించే భయంకర క్షణం ఎలావుంటుందో ఊహించుకుంటే శరీరం కంపించిపోతుంది. ఆచివరి ఘడియల్లో ఎవరైనా దగ్గరవుండాలి. ఇంకెవ రుంటారు? నీవురాగలవనే ఆశిస్తున్నాను. ఆయనకు అయినవారంటూ ఎవరు లేరూ. నాకుఉన్నా ఎవరూరారని నాకు తెలుసు. కారణం నీకూ తెలుసు ననుకుంటాను. తెలిసేవుండాలి. నీవు వారికీనాకూ మిత్రుడివే. ఆయన నీకేదో కొంతసాయంచేశారు. నీ నేటి ఔన్నత్యానికి ఆయన ఒకరకంగా కారణంకదా! దోహదం యిచ్చారుకదా! నీవు నాకోసం కాకపోయినా, వారికోసమైనా రాగలవనే విశ్వసిస్తున్నాను. కాదు నాకుగా నేను రమ్మని అర్థిస్తున్నాను.

స్నేహమయి

నీ లీ ల.

ఉత్తరం చదివాక సుందర్ మనస్సు మధుర భావంతో ఊగిపోయింది. తనలోతను ఊహాగానం చేసుకున్నాడు. "పాపం! వెళ్లాలి. ఎవరున్నారు అతనికి మాత్రం."

మానవత్వం తొంగిచూచింది ఆక్షణంలో అతనిలో.

మర్నాడు సెలవుపెట్టాడు, ఉదయమే ఎక్స్‌ప్రెస్‌కు బయల్దేరాడు. వస్తున్నట్లు వెంటనే లీలకు టెలిగ్రాం ఇచ్చాడు.

ఆమె స్టేషనుకు వస్తుందనిగానీ, రావాలనికానీ అంచనా కాదు. వస్తున్నట్లు తెలిస్తే కొంచెం ధైర్యం. అడ్రసు వెంట నడిచి యిల్లుచేరుకున్నాడు.

అది కొండ చరియలలో ఒకచిన్న డాబాఇల్లు. అందంగా, పొందిగ్గావున్నది. చుట్టు పచ్చనిచెట్లు, తోటలు. ఇంటిచుట్టు గార్డెన్....

వాకిట్లోనే ఎదురై స్వాగతం చెప్పింది లీల. ఆమెలో పూర్వం తీవి, హుందా లేవు. దైన్యానికి ప్రతిరూపమా?

"ఎలావుంది లీలా?" ప్రశ్నించాడు బెడ్డింగు, పెట్టె గోడవారగా పెడుతూ

"ప్రమాదంగానే వుంది సుందర్. ఏమీ ఆశలులేవు" తెల్లగా పాలిపోయింది విచారంలో మునిగివుంది. అయినా సుందర్ కళ్లకు అందంగానే అవుపిస్తోంది. అంతమాత్రాన వన్నె తగ్గవచ్చు, ఉత్సాహంతగ్గవచ్చుకానీ అందం మొక్కవోదు కదా!

"వారి స్థితి ఏమీ బాగులేదు సుందర్. వారికీ తెలుసు తను బ్రతకనని. నా ప్రాణం పోతోందిముందు. నీవు వస్తున్నావని చెప్పాను. ఆమాటవినగానే మొహం అదోలా మార్చుకున్నారు. పోనీలే ... అన్నట్లు నీసామాను ఆ గదిలో సర్దుకో.... ఆ గది నీ కోసమని రిజర్వ్ చేశాను.

"ఎందుకు లీలాదేవీ మీకంత శ్రమ ... హోటల్లో రూం తీసుకుందా మనుకుంటున్నాను."

"హోటల్లో వుండేకాడికి యిక్కడికిరావటం ఎందుకు? వద్దు సుందర్. ఏ అర్ధరాత్రో అపరాత్రివేళో ఆయన పరిస్థితి విష మిస్తే తోడుంటావనేగా నిన్నురమ్మంది. ఏ హోటల్లోనో వుంటే కనీసం నీకు కబురు అందించేవారు కూడా వుండరు. నేనురావాలి యిక... ఈ సమయంలో మనిషికిమనిషి సాయం ఎంత అవ సరమో నీకు తెలియదా".

ఆమె మొహంచూస్తే దీనంగా, ప్రార్థనగా వున్నది.

"పోనీ అలాగే లీలాదేవి !" అన్నాడు గదిలోకి దోవ తీస్తూ....

కొద్ది నిమిషాల్లో స్నానంచేసి, బట్టలు మార్చుకుని సదా నందాన్ని చూట్టానికి బయల్దేరాడు హాస్పిటలుకు. దూరంనుంచి చూచి అతనే సదానందం అనిగుర్తించలేక పోయినాడు నిజంగా. అంతగా క్షీణించి పోయాడు పాపం.

"వచ్చావా సుందర్. అవును ఆఖరిఘడియల్లో నీవు రాగల వని నా ఆత్మ హామీ ఇస్తోందిలే.... నీ కోసమే ఆగాను ఇంత కాలం" అన్నాడు ఎండిన నవ్వు పెదాలపై ....

'అలాఅనకండి. మీకేం ఫరవాలేదు. లీలాదేవి చెప్పింది' అన్నాడు ప్రయత్నించి నిజాన్నికప్పి.

"అబద్ధాలుకూడా అధ్యయనం చేస్తున్నావా సుందర్ వద్దు. అబద్ధాలాడి, సత్యాన్ని మరుగుపరిచి ఏం ప్రయోజనం? ఏం సాధిస్తాం కూర్చో .... ఇలా రా దగ్గరగా"

మూలుగు, బాధ. మాటకూడా సరిగా స్పష్టంగా రావ టంలేదు. లీలకూడావచ్చి ప్రక్కనే నిలబడ్డది.

"ఈ వేళ ఎంత హాయిగావుంది సుందర్" అన్నాడు ఆనందంతో అరమోడ్పు కన్నులుచెమ్మగిల్లగా సదానందం బాధలు మరచి సుషుప్తిలోకి పయనిస్తున్నట్లుంది. పర్వతసానువులపై నుండి, తోటలోంచి చల్లగాలులు ప్రశాంతంగా వీస్తున్నాయి.

సూర్యుడు ఎర్రబంతిలా మారి పశ్చిమాద్రి వొడిలోకి జారిపోతున్నాడు. సాయం సంధ్య అందంగావుంది. ఆ ప్రశాంత ప్రకృతి దృశ్యాన్ని కిరిటీలో గుండాచూచి మనసారా నవ్వు కున్నాడు సదానందం.

"పొద్దు క్రుంకుతోంది సుందర్ .... తలుపు మూయండి. ఈ చలిగాలి, ఈదురుగాలి ఇంక భరించలేనయ్యా" అన్నాడు.

లీల వెళ్ళి తలుపులు దగ్గరగా వేసింది.

"ఇలా రా లీలా నాదగ్గరగా పిలిచాడు.

ఇదో చూడు, నీవెందుకంత విచారంతో కుమిలిపోతావ్. చనిపోవటం అనేది సామాన్య ధర్మం ప్రాణులకు. అయినపుడు ఈరోజో, రేపో, ఇప్పుడో, మరొకపుడో అన్న భేదం పాటించి బాధపడటం సమంజసంకాదు. ఏచలిగాలివచ్చి నన్నేంచేస్తుందిచెప్పు, ఇప్పటికే చనిపోయి వున్నానుగదా! మళ్లీ చనిపోనుగా .... పోనీ అలా తెరిచేవుంచులే .... చీకటిలో, గాలిలేక చనిపోవటందేనికి. ప్రశాంత ప్రకృతిని, మందమలయానిలాన్నయినా అనుభవిస్తాను తనివితీరా .... మళ్ళా భూలోకంలో ఎక్కడ పుడతానో, అయినా ఆ అనుభవం నేడు. ఈ అనుభవంవేరుగా .... వుంచు అలాగేవుంచు గాలిరానీ"

కాదనలేక కళ్లువొత్తుకొంటూ వెళ్ళి తలుపు తెరిచింది. బయట తోటలోంచివీచే సుమ సుగంధ పరిమళం మత్తెక్కిస్తోంది. సదానందం ఆ గాలి తీవ్రతకు ఉక్కిరి బిక్కిరైనాడు.

"వొద్దులీలా తలుపులుమూసెయ్. ప్రకృతి నామీద పగపట్టింది ఇప్పుడే ప్రాణం పోయేట్లుంది."

మూసిన తలుపులకేసి, ప్రక్కగా నిర్జీవ ప్రతిమలా వున్న లీలకేసిచూచి గాఢంగా నిట్టూర్చాడు.

"ఏమిటి సుందర్ అదోలావున్నావు?" ప్రశ్నించాడు సదానందం.

"ఏమీలేదు"

"ఏమిటి విశేషాలు?"

" ఏమీ లేవు, వేటి గురించీ మీరేం ఆలోచించకండి. విశ్రాంతి తీసుకోండి"

"విశ్రాంతి తప్పకుండా తీసుకుంటాను. ఆ అనుమానం అక్కరలేదు"

నిట్టూర్చడం సుందరం వంతయింది. లీల ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది.

భయంకరంగా నిశ్శబ్దం ఆవులించింది. చడీ చప్పుడు లేదు గదిలో కొన్ని క్షణాలు.

"అస్తమయం ఎంత అందంగావుంది లీలా. ఇంకెన్నో అస్తమయాలుచూడను గదా! మీరు చాలాచూస్తారు. ఇప్పుడు చూచిన విషయాలు, అనుభవాలు రేపు జ్ఞాపకంవుండవు కదా నాకు.

చూడు సుందర్, నాచుట్టూ మరణభయం మెరుపులు ఎలా మెరుస్తున్నాయో, నన్ను భయపెడుతున్నాయి చూడు. ఎక్కడా మరణమే అవుపిస్తోంది. రాలే ఆకుల్నిచూస్తే, అస్త మించే సూర్యుణ్ణిచూస్తే, కదిలే జీవుల్నిచూస్తే ఓ పలితకేశం అవుపిస్తే గుండెలు జలదరిస్తున్నాయ్. కుమిలిపోతున్నాయ్. ఇదే మరణభయం చరమగీతానికి ప్రథమశ్లోకం. ఇదేనా సుందర్? ఎందుకో నయ్యా భయం ఇవుడిపుడే నన్ను ఆవరిస్తున్నది. నువ్వు వచ్చేవరకు బ్రతుకుతాననే నమ్మకం వుండేది. నువ్వువచ్చావు, ఇక

చనిపోతానన్న భయం బయలుదేరింది. నువ్వురాకుండాఉన్నా మరి కొంతకాలం ఆ కల్పిత భావనలో బ్రతికేవాణ్నేమో! నా.... వెర్రి ఆలోచనలు. మరేం అనుకోకు సుందర్. సంధించలేదు కాని అటువంటిదే ఈ ప్రేలాపన."

అతన్ని చూస్తోంటే మతిపోతూంది సుందర్‌కి, లీలకు· అతనిలోని అర్థంకాని ఆ వేదన, భయం, అన్నింటినీమించి అందు బాటులోని మరణం.

గదినిండా చీకటిదట్టంగా వ్యాపించింది. మనుషుల ముఖా లపై చీకటి.... భయం.... మునురుకున్నది.

"దీపం వెలిగించవా లీలా!"

దీపంవెలిగింది. కానీ వెలుురు సదానందానికి అవుపించ లేదు. దీపనిర్యాణగంధం....

సరిగా తెల్లవారలేదు ఆరాత్రి... సుందర్‌కి భోజనంచేయ బుద్దిపుట్టలేదు. సరిగా నిద్రపట్టలేదు. ఏవేవో ఆలోచనలు. సదా నందం అనేకరూపాల్లో అవపించాడు.... కలగా....

అర్థరాత్రి అలా బయటికి బయల్దేరాడు. పౌర్ణమి వెన్ను లలో శీతల పవనాన్ని చీల్చుకొంటూ ఒంటరిగా కొండబాటల్లో పయనించాడు. మనస్సుకు ఊరట చిక్కందికాదు. తిరిగి గదికి వెళ్ళిపోయి నిద్రకుపక్రమించాడు.

నిద్రపట్టిందికాదు.

అయినా తెల్లవారింది.

# 15

మర్నాడు ఉదయం సదానందాన్ని చూడ్డానికి సుందర్ వెళ్లే సమయానికి అతనుచాలా ఖుషీగావున్నాడు. పునర్జన్మ ఎత్తినంత ఆనందంగావున్నాడు. అంత దూరాన సుందర్ రాక చూచి ఆహ్వానించాడు.

"రా సుందర్. నీ కోసమే ఎదురుచూస్తున్నా ... రాత్రి బాగా నిద్రపట్టిందా ?" కుశల ప్రశ్న వేశాడు.

"ఆమాట అడగవలసింది నేను మిమ్మల్ని, మీరు కాదు. ఎలావుంది మీ ఒంట్లో...."

"బావుందయ్యా బావుంది. నిన్ను చూచాక పునర్జీవితుణ్నయినా ననే అనిపించింది. నయమైపోవచ్చుననే నమ్మకం కలిగింది. ఇవాళ ఎంత రిలీఫ్‌గావుందో చూచావా ? అలా బయటకు తిరిగొద్దాం వస్తావా కూడా" అడిగాడు.

కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్న లీల అందుకుంది. "చూచావా సుందర్. నీవొచ్చిన వేళావిశేషం. గండం గడిచింది. ప్రమాదం సుదూరంలో తప్పిపోయింది. దాంతో పొద్దుణ్నించి ఏవేవో ఆలోచనలు, ప్లానులు, పైగా ఎక్కడి

సైనా షికారు వెడదామంటారు... నడవగలరా అనుచెప్పు, నేనంటే ఆమాట పైగా కోపం

అంతలో డాక్టరు రావటంతో సద్దుమణిగింది ఫిర్యాదు. లీల గమ్మునలేచి నిలబడ్డది.

డాక్టరు పరీక్షించాడు. ఏవేవో మందులు వ్రాసియిచ్చాడు. వెడుతున్న డాక్టర్ని అనుసరించాడు సుందర్ గుమ్మం అవతలి వరకూ.

"ఎలా వుంది డాక్టర్ ఈ కేసు?" ప్రశ్నించాడు ఆత్మీయునిలా.

"స్థితి ప్రమాదంగానేవుంది. ఈ రోజు తేటగావుందంటే మరీ అనుమానంగావుంది. రేపు ఉదయంగాని ఏమీ నిర్ణయించ లేం కాస్తిగడవాలి. ఆ అమ్మాయిని జాగ్రత్తగా చూడండి. ఏమీ తెలియనీకండి, బెంబేలుపడుతుంది"

డాక్టర్ని పంపి. తిరిగివచ్చి లీలతో అన్నాడు సుందర్.

"స్నానం దానికి ఘడియలు సమీపించాయట లీలాదేవీ! డాక్టరుచెప్పాడు. మరోరోజు గడవటం దుర్లభంగా తోస్తోంది. ఏమంటావు?"

ఓ క్షణం దీర్ఘంగా ఆలోచించి నిట్టూర్చింది. గంభీరముద్ర దాల్చింది.

"అదే మంచిది. అన్నిరకాలుగా అదేమంచిదని తోస్తోంది సుందర్."

ఆమె ముఖం వివర్ణం అయింది.

"పైగా ఆయన మొహంచూడాలంటే భయంవేస్తోంది సుందర్"

సుందర్, లీల కొన్నిక్షణాలు మౌనంగా గడిపారు, అలా ఆలోచిస్తూ.

పారిదర్శి పరీక్షిస్తున్న సదానందం కళ్లు చెమ్మగిలినయ్. బొటబొట కన్నీరు కార్చాడు.

"సుందర్ ఇలారా" పిలిచాడు.

"అబ్బె.... ఏంలేదు!".... అన్నాడు సుందర్.

"ఏదో వున్నదనికాదు.... కూర్చో.... అన్నట్లు సుందర్ ఎందుకీ విచారం. మీరేం విచారించకండి. మీరు అనుకున్న మాటలువిన్నానులే. మరేంభయంలేదు. లీల అన్నట్లు అదే మంచి దేమో!" అన్నాడు ఆలోచనగా....

లీల ఆ మాటలు విని ఎక్కి ఎక్కి ఏడ్చింది.

"అబ్బే మరేంలేదు. మీరేమీ కంగారు పడకండి సదానందంగారూ! రేపటికల్లా నయమైపోవచ్చు. మీకు స్వస్థత చిక్కగానే నేనూ వెళతాను"

"రేపటికల్లా........ ప్చ్........ అవసరమైతే సెలవు పొడిగించకూడదూ!"

"పోనీలే అలాగేచేస్తా"

సదానందానికి శ్వాసపీల్చటమే కష్టమైంది. బరువుగావుంది శ్వాసమండలం. మాట్లాడలేక పోతున్నాడు. లీల విచారంతో అలానే కూర్చుండిపోయింది. సుందర్ బయటకు వెళ్ళాడు.

* * *

ఆ భయంకర వాతావరణాన్ని భరించలేక. తిరిగి వచ్చేటప్పటికి లీల సదానందం కాళ్ళదగ్గర కూర్చుని కన్నీరు కారుస్తోంది భారంగా, బేలగా. ప్రక్కనే కుర్చీలో కూర్చున్నాడు సుదర్శ. నర్సువచ్చి కిటికీదగ్గర నిలబడ్డది.

సుందర్‌కి మగతనిద్ర వచ్చినట్లుగా వచ్చింది. ఆపద జరగ బోతున్నట్లు భయంగా ఉలిక్కిపడి లేచాడు. సదానందం కళ్ళ లోని వెలుగు మాయమై పోతున్నట్లు అవుపించింది. ఒక్కసారి అచేతనంగా మారిపోయినపరిస్థితి.

"సుందర్" కలవరించాడు.

దగ్గరగావచ్చి నిలబడ్డాడు సుందర్.

"అయిపోయింది సుందర్. నావ వొడ్డుకు చేరింది. చనిపోతు న్నాను" లీల బాధ్యతనీది యిక. ప్రమాణంచేసి మాటఇవ్వు లీలకు అన్యాయంచేయనని,

అన్నాడు చేతులురెండు పట్టుకుని.

అంటూనే కళ్ళు మూశాడు.

అయిపోయింది. అనుకున్నంతసేపు పట్టలేదు. భోరు మంటూ లీల అతనిమీదపడి యేడ్చింది. మళ్లీ అయిదు నిమిషాల్లో తేరుకొని తమాయించుకొని నిలదీసుకుంది మనసును. కళ్లువొత్తు కుంది.

సుందర్ వైపు తిరిగిలేచి నిలబడ్డది.

కార్యక్రమానికి ఉద్యుక్తులైనారు యిద్దరూ.

కొద్దిగంటల్కిందట సంతోషంగాకబుర్లుచెప్పినవ్యక్తి, ఇపుడు స్థాణువులా, ప్రతిమలా అయిపోయాడు అలా అచలంగా మారి పోవడంచూస్తే సుందర్‌కి ఆశ్చర్యం, విచారం మిళితమైంది. మరణభయం అంటే ఏమిటో తెలిసింది. మరణం అనేదాన్ని కళ్లారాచూచాడు "చనిపోయినజీవి ఎవరు తిరిగిరారుకదా"_ అనుకున్నాడు. లక్షలు, కోట్లు పునర్జన్మిస్తుంటారు ఇలాగే. కాని మరణించిన వ్యక్తి ఎవరూతిరిగిరారుగదా.

ఈవ్యక్తి అందరువ్యక్తులవలె తానూబ్రతికాడు. నవ్వుతూ ప్రేమిస్తూ, ఏదేదో ఆశిస్తు కాలంగడిపాడు. ఒకనాడునూజీవి అది కొన్నిరోజుల బ్రతుకు అది. ఆ తర్వాత అదీ లేదు. ప్రతిజీవికి పుట్టుక, పెరుగుదల, ఆనందం, ఆశలు, మరణంతప్పవు. స్త్రీ కాని, పురుషుడు కాని, మరణాంతరం ఒకరికొకరు ఏమీకారు. ప్రేమలు, ద్వేషాలు, సమాధి గర్భితాలౌతాయి కాని. ప్రతి వ్యక్తి శాశ్వతంగా భూమ్మీద వుండిపోవాలనే అతృత, ఆర్భా టం చూపించుతాడు బ్రతికున్నంతకాలం. ఇలా ఆలోచిస్తోంటే

మతిపోతున్నట్లుంది సుందర్‌కి. ప్రపంచంలో జీవులు, గ్రహాలు ఏవీ శాశ్వతంగా అవుపించటంలేదు.

పాపం లీలకూడా సుందర్‌లాగానే విచార దుకూలాన్ని కప్పుకొని ఆలోచనా సాగరంలో మునకలు వేస్తోంది. ఆ విచారవదనం మీాద నల్లని ముంగురులు నాట్యంచేస్తోంటే అందాని ఛాయి లీలను చూస్తూంటే సుందర్ హృదయం కరిగిపోయింది. మరు క్షణంలో పులకరించింది. ఆనందపు మొగ్గలు తొడిగింది. ఎందుకీ విచారం? క్షుభితహృదయంతో ఎందుకు బాధపడాలి. తనకుగాని, లీలాదేవికిగాని ఎంతో భవిష్యత్తున్నది. జీవించ వలసినది ఎంతో వున్నది. అలా అనిఅనుకొంటూ లీలను ఆపాదమస్తకం పరీక్షిస్తూ తన్మయుడై కూర్చున్నాడు. కాని ఆ విషయంకాని సుందర్ భావన కాని లీలకు గోచరంకాలేదు. ఆమె ఒకవిధంగా ఈలోకాన్ని వదలి ఆకాశపు అంచుల్లోకి వెళ్ళిపోయింది. అ గమ్యంలో గమ్యంకోసం వెదుకుతోంది.

“చివరకు జీవితంలో మిగిలేదేమీాలేదు. కనీసం మధుర స్మృతులుకూడా నిలవవు ప్రేమించటమే మంచిది. అన్నీ అశాశ్వత మని చేతులు ముడుచుకు కూచోడంవల్ల ప్రయోజనంలేదు. ఎండినబ్రతుకు బ్రతకటమే అవుతుంది.

ప్రేయసిని బాహువుల్లో బంధించుకొని స్వర్గసౌఖ్యాలు చవిచూడటంకంటే పురుషపుంగవుడు చేయదగ్గమహత్ కార్యం ఏముంటుంది. అలాగె స్త్రీ తనప్రియుని పరిష్వంగంలో కరిగి,

కలిసిపోవటంకాక జీవితాశయం ఏముంటుంది? అదేజీవితానికి పరమావధి." అనుకున్నాడు.

లీలను ప్రియురాలుగా పొందటం సదానందం పూర్వ జన్మ సుకృతమే. అయితే ఎంతకాలం. ఆది అతనిజీవితంలో వెన్నెలరేయి. అసలు లీల ఆజీబురుమొహాన్ని ఎలాప్రేమించ గలిగిందో? ప్రథమ సమావేశం ఎలాజరిగిందో! దమ్మిడీ ఆస్తిలేని వాణ్ణి ఈ అప్సరప్రేమించిందంటే ఆశ్చర్యంగానేవుంది. పైగా ఇంతకాలం వరకు ప్రతివ్రతలాగా అతన్నే అంటిపెట్టుకొనివుంది ఏమిటో? జీవితంలో ఏది ఎందుకు జరుగుతుందో చెప్పలేంకదా! అంటూ ఆలోచించాడు సుందర్.

ఇకపైన లీల ఒంటరిగావుండదు. వుండలేదు. తప్పకుండా ఎవరో ఒకరిని ప్రేమిస్తుంది. లేదా పెళ్లి చేసుకుంటుంది. గార్హస్థ్యం అవసరంకదా? ఏసంపన్నుణ్నో చేపట్టితీరుతుంది.

ఓహో! ఆ అదృష్టం నాకే ఎందుకుపట్టకూడదు" అని తనసుతనే ప్రశ్నించుకున్నాడు.

లీలగా, ఛాయగా సమాధానందొరికింది. ఆమె సాన్ని హిత్యంవల్లనే సదానందం అంతగొప్పవాడు కాగలిగాడు. అది ఆమె అదృష్టమే. ఆ అదృష్టదేవత ఎవర్నివరిస్తే వాను ఇట్టేగొప్ప వారై పోతారు. ఒక్కొక్కస్త్రీ, ఇల్లాలుగా అడుగు పెట్టేవేళా విశేషంఅది. అందుకే "పురుషుని పుణ్యంకొద్దీ అర్ధాంగి" అన్నారు.

లీలకూడా తనను ప్రేమిస్తోనేవుంది. అది ప్రేమకాక పోవచ్చు. పురుషుని అవసరం ఆమెకున్నది. అందుకు తను అర్హుడే. దాన్ని ఆదరణ, అభిమానం అనీ అనవచ్చు. తనంటే ఆమెకు ద్వేషంలేదు ఏ మాత్రం. పూర్వమే తనంటే ఆ ఆకర్షణ, అభిమానంవున్నా, తనకు లోబడే అవకాశం ఆనాడు లేదు. అంతగా అవసరమూలేదు సదానందం వున్నాడు కనుక. తాను తెలివి గలవాడనీ, యోగ్యుడనీ, అందకాడనీ ఆమెకు తెలుసు. అందుకే తనంటే లోలోపల ఆదరిస్తుంది, అభిమానిస్తుంది, వాంఛిస్తుంది. అలా అనుకున్నప్పుడు గొప్పగర్వం కలిగింది సుందరకి.

అసలీ చివరి క్షణంలో తనకోసం కబురుచేయడం లోని ఆంతర్యం అదేఅయివుండాలి. కానప్పుడు తనకే ఎందుకు వ్రాయాలి ఆ మాత్రం ఆప్యాయత, విశ్వాసం లేకపోతే. ఆమెకు తెలుసు తనకు వైధవ్యం ప్రాప్తించ నున్నదని, తనకొక ఆలంబన అవసరమని ముందుగానే జాగ్రత్త పడ్డది. అందుకే తనకు ఉత్తరం వ్రాసింది రమ్మని.

ఇలా ఆలోచించుకున్నమీదట లీల ఎదుట నిలిచే శక్తి కోల్పోయాడు. ఆమెను అడిగే శక్తిలేదు. రేపువెళ్లిపోవాలి. ఈ లోగా ఆమె అభిప్రాయం తెలుసుకోవటం మంచిది.

లీలతో ఒంటరిగా గదిలోవున్నా ఏమీ ప్రస్తావించలేక పోయాడు. పిరికితనం ఆవరించింది. అదోబలహీనత.

"మీరుచాలా చిక్కిపోయారు లీలాదేవీ" అన్నాడు ఏదో కల్పించుకుని.

విషాదంగా నవ్వి "అవును" అన్నది.

"అనుకోని విధంగా జరిగిపోయింది పాపం. మీ మనస్సు, హృదయం కూడా గాయపడ్డాయి. మిమ్మల్నిచూస్తుంటే...."

"అనుకోని సంఘటన ఏమీలేదుగా సుందర్. ఇలా అవుతుందని అనుకున్నదేగా!

"ఒంటరిగా ఎలాజీవిస్తారో!"

ఆమె మాట్లాడలేదు. నిటారుగా సుందర్ కళ్ళలోకి ఒకసారిచూచి, చూపులు మళ్లించుకొంది.

"నీకు నేను ఆతిథ్యం యివ్వడానికి సిద్ధంగావున్నాను లీలాదేవీ" అనలేకపోయాడు.

అలా సంభాషణ అర్ధరాత్రివరకు కొనసాగింది. ఎంతకీ నిద్రరాలేదు. మగత నిద్ర, భ్రమాగన్ను. ఎంత ఆలోచించినా లీలాదేవి నిర్ణయం ఎలావుంటుందో లీలగానైనా ఊహించుకోలేక పోతున్నాడు. అర్ధరాత్రిఅయింది. ప్రక్కమీదలేచి కూర్చున్నాడు. లీలకూడా నిద్రపోవటంలేదు. తలదిండుకు జారగిలబడి వాపోతోంది.

"ఇంకా నిద్రపోలేదా లీలా" అన్నాడు.

ఆమె నిర్జీవ ప్రతిమలా కూర్చుండిపోయింది, చలనం లేదు. అయినా అందాల ప్రోవు, సౌందర్యాన్ని కుప్పగా పోసినపుడు ఇలా వుంటుందికదా అని అనిపించింది. కడిగిన ముత్యంలా, స్వచ్ఛంగావున్నది లీల చూడ్డానికి.

"అలా బైటవెన్నెల్లో కాసేపు కూర్చుంటాను లీలాదేవి. మనస్సేంబావులేదు" అనిబయటకు నడచాడు. బయట పచ్చగడ్డి పరువుమీద కూర్చుని, వెన్నెలలోకి, ఆకాశంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు అర్థంలేని ఆలోచనలు, భావనలు.

"సుందర్!" శాంత మంద్రస్వనం వినిపించింది. వెనుదిరిగి చూచాడు, లీలాదేవి.

వచ్చి ప్రక్కనే కూర్చున్నది పాలరాయి ప్రతిమలా.

"సుందర్, నీవు చెప్పిన విషయాలు ఆలోచించాను నీకు ఏదో ఒక సమాధానం చెప్పాలిగదామరి. మనం ఒక నిర్ణయానికి రాబోయేముందు పరస్పరం అర్థంచేసుకోవాలి. నా విషయం ఏది లెయ్యి. నీవైనా ప్రశాంతిగా ఆలోచించాలిగదా! దానున్న పరిస్థితుల ప్రభావాలు నీపై ఎంతబలంగా, వికృతంగా పనిచేస్తవో ఆలోచించుకో తొందరలేదు. ఏదో యవ్వనంలో ఆకర్షణలకు గురై మనం మోసపోడానికి చిన్న పిల్లలంకాదు. ప్రపంచానుభవం లేని వారమూకాదు. చాలాముఖ్యం. నన్ను అర్థంచేసుకోగలవనీ, నాబాధను అర్థంచేసుకోగలననీ చెబుతున్నాను. నాకు మళ్ళీ పెళ్ళి అంటే ఒకవిధంగా విధవావివాహం అంటుందికదాలోకం. అసలు

నాకేబాధలేదు. ఎవరేమనుకున్నా చింతలేదు. లోగడ అనుకున్న వాటికన్న ఎక్కువేంకాదు. అయినా నేనేం తాలికట్టించుకున్న భార్యనుకానులే, లోకానికి వెరవడానికి. అందుకే ఈ రకమైన సంసారబంధం నన్ను కట్టివెయ్యాదు. సంసారం అంటే ఒకభాగ స్వామ్యం. నేను స్వతంత్రురాల్ని. పెండ్లయినా స్వతంత్రంగానే వుండటం నాయిష్టం, అభిమతం. నా యిష్టంవచ్చినట్లు నేను మసలుకుంటాను అలాజీవించడానికే అలవాటుపడ్డాను. సదానందం, నేను అలాఅన్యోన్యంగా, స్నేహితంగావుండేవారం కాని భార్యాభర్తల్లావుండలేదు ఎన్నడు. అందుకే మా గార్హత్యంచూస్తే చాలామందికిఅసూయ. తమ పెళ్ళాలు నా అంత స్వతంత్రంగా వుండటంబాధ. కానీ నిజానికి అలావుండనిస్తారా! లేదు....అలా వుండేవారిని వాంఛిస్తారు. కాని స్వస్త్రీ అలా కావాలని అనుకోరు. అంతస్వతంత్రం స్వస్త్రీకి భరించలేరుమీరు. అందుకేనా మీద ఎవర్నీ పెత్తనం చలాయించనీయను. నేను సహించను కూడా. నన్నుచూచి అసూయపడటంకానీ, నా ప్రవర్తనను శంకించటంగానీ జరిగితే నేను ఓర్వలేను. నన్ను పెళ్ళాడితే సమాన ప్రతిపత్తి నాకివ్వగలగాలి. సదానందం అలాయిచ్చారు గనకనే వుండగలిగాను. లేకుంటే ఏనాడో ఎడబాటుకలిగేది మా యిద్దరికీ. ఆయన ఎలావుండేవారో మీకు తెలుసుగా. అంతేగానీ, భార్యఅంటే బానిసగాచూచి, విధేయురాలుగా వుండాలంటే నే సహించను. నా భావాలువేరు. ఇతరుల భావాలువేరు. అందరి

భార్యల్లానన్ను అందలాల్లోపెట్టి తాళాలుబిగిస్తామంటే ఒప్పుకోను. అలానేను జీవించలేను. నేను స్వతంత్రురాల్ని. అవీ నాభావాలు. వీటికి నీసమాధానం నేనాశించటంలేదు సుందర్. ఆలోచించుకో, అర్థంచేసుకో నీవే ఒక నిర్ణయానికిరా".

ఆమెకళ్లలోకి సూటిగా చూచాడు. అంత సూటిగానూ లీల అతనిలోకి చూచింది. కొన్నినిమిషాలు అలా గడిచాక, కళ్లువాంచుకొని చిన్నగా నవ్వింది లీల.

"నాకు చాలా సహాయంచేశావు సుందర్. నీకు చాలా ఋణపడివున్నాను "అన్నది గంభీరంగా.

"నీవు కోరితే ఎవరుమాత్రం ఏసహాయంచెయ్యరు లీలా దేవీ! ఇంకేమైనా కావాలంటే చేస్తాను. నాసర్వస్వం నీ కర్పించ మన్నా సిద్ధంగావున్నాను" అన్నాడు.

ఆమె ఓడిపోయినట్లు, తనను అంగీకరించినట్లు తన భావాన్నిగ్రహించినట్లు స్ఫురించింది. కొంచెందగ్గరగా జరిగాడు. ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుంటూ.

"లీలా" అంటూ అర్థనిమీలత నేత్రాలతో ముద్దు పెట్టుకున్నాడు.

"లీలా నాహృదయాన్ని అర్థంచేసుకోవా"

ఆమె మెల్లగా లేచింది. రోహిణిలాముందుకు నడుస్తుంటే చంద్రునిలా వెన్నంటాడు. ఆమె కళావిహీనంగావున్నా, తనను ప్రేమిస్తున్నట్లు, తనకోర్కెను మన్నిస్తున్నట్లు భావించాడు. చాలా కాలంగా అతనికోర్కెను ఆమె మనసా మన్నిస్తోనేవుంది, అభిమతం చెప్పలేదుకాని.

వెడుతున్న లీల చెయ్యిపట్టుకొని ఆపాడు.

దగ్గరగాతీసుకొని బాహువుల్లో బంధించి పెదాలపై ముద్దుపెట్టుకున్నాడు. వేడినిట్టూర్పు విడిచాడు.

"ఈచంద్రునిసాక్షిగా, వెన్నెలసాక్షిగా, నక్షత్రాలు, ప్రకృతి, మందమలయానిలం సాక్షిగా నిన్ను ప్రేమిస్తున్నాను లీలా మన్నించు" అన్నాడు.

"తొందర పడుతున్నావేమో సుందర్. నేనింకా ఒక నిర్ణయానికి రావాలిగా"

"సంకోచిస్తున్నావా లీలా"

"సంకోచం లేదు, అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను. శకుంతల విషయమే ఎటూ తేల్చుకో లేకుండావున్నాను" అన్నది. ఆగింది. అర్థోక్తిలో అతనివైపు చూచింది. వెన్నెలలో చూపుల అర్థం గ్రహించలేక పోయింది.

"ఆమె నా అర్థాంగికాదు. అయినా మునిగిపోయింది లేదు. ఆమె అంగీకారంతోనే...... ఆమె అభ్యంతరం చెప్పదు నాకు తెలుసు"

"అయితే ఆలోచిద్దాం.

నవ్వు పువ్వులు పూసింది.

తొలిసారిగా స్త్రీస్పర్శకు పులకరించిపోయే యువకులా చలించాడు సుందర్. ఆమె సాన్నిధ్యంతో ప్రపంచాన్నే మరచిపోయాడు. ఆ ఆలింగనానికి, గాఢ పరిష్వంగానికి ఆమె అభ్యంతరం చెప్పలేదు.

'పద సుందర్ వెడదాం, బయట మంచు కురుస్తోంది' అన్నది

ఇద్దరూ లోపలకు నడచారు.

16

ఇంటికి తిరిగివచ్చాక, ఒకసారి శకుంతలను చూడాలని పించింది. మనస్సు తొందరచేసింది. ఆ ఆలోచన క్రమేణ మన స్సును తొలవటం ప్రారంభించింది. ఎంత కాదనుకొని మనోఫల కంనుండి ఆమెరూపాన్ని చెరిపివేయ ప్రయత్నించినా మరీ తనను ఆకట్టు కుంటోంది. తొలగించుకుందామన్న ప్రయత్నం ఎంత తీవ్రంగావుందో, అంత ఎక్కువగా ఆ మె ను స్మరించడం అవుతూంది.

"రేపు ఓసారి కలుసుకోమని" కబురంపాడు శకుంతలకు.

"ఈగొడవ ఎలాగో తేల్చివేసుకోవాలి. శకుంతల మీద వొదిలించుకోవాలి. అప్పటికిగాని మనస్సు కుదటపడదు లీలతో ఒక ఒప్పందానికి రావటంపడదు" అనుకున్నాడు.

నిజానికి ఇష్టంలేని విషయాన్ని తెగతెంపులు చేసుకోవ టమే మంచిది.

శకుంతల వస్తున్నట్లు కబురొచ్చింది.

ఆమె మరోగంటకు వస్తుందనగా లేనిఆరాటం, మరో కొన్నినిమిషాలు అయేసరికి ఆర్భాటంగా మారింది. ఒళ్ళంతా

త్తేళ్లు, జెర్రులు ప్రాకినట్లయింది. అర్థంకాని ఆవేదన, అయో మయం ముంచివేశాయి. ఏమీ ఆలోచలేదు. కానికార్యం తల పెట్టినట్లు, తెలిసీ పాపం చేస్తున్నట్లు బాధపడ్డాడు. దొంగతనం కొత్తగా చేసినవాడు పట్టుబడ్డప్పుడు కలిగేతొట్రుపాటు, ఆందోళన. నిజాన్ని చెప్పడంలో ఎంతబాధవుంది. ఎంతకాలం ఇలా బ్రహ్మ చారిగా వుండాలి? శకుంతలతో స్నేహం ఎంతకాలం కొనసాగు తుంది. దానికి స్థిరత్వం ఏమిటి?

ఎంత ప్రేమించినా, శకుంతలను పెళ్ళిచేసుకోవటం అనేది అసంభవం కదా! అసంభవాన్ని సంభవంగా భావించి, భ్రమించి ఇలా ఉబ్బితబ్బిబ్బు లవటం దేనికి? శకుంతలలాంటి కులస్త్రీ, గృహిణి, తనంటే మోజుపడ్డది. అది వేరేవిషయం. ఆమెకు కట్టుబడి వుండటంలో అర్థంలేదు.

పైగా ఆమె ఎల్లకాలం తనతో వుంటుందనే నమ్మకం లేదు. తనమీద మోజు కొంతకాలానికి తీరిపోవచ్చు. తనలో జవ సత్వాలు, ఓపికతగ్గిపోతే తనను దగ్గరకే రానీయకపోవచ్చు, పోనీ ఆమెకు తనతో అవసరంలేని పక్షాన అదేఫలితంగదా! ఆమె ఎంత ప్రయత్నించినా తనకు అర్ధాంగి కాలేదు. ఈ చాటుమాటు సంసారం ఎంతకాలం కొనసాగేట్లు?

ఎంత తలక్రిందులుగా ఆలోచించినా బుర్రకు పరిష్కారం తోచటంలేదు. ఆలోచనలు ఒక అంతానికి రావటంలేదు.

"గుడ్‌మార్నింగ్ సుందర్"

తలెత్తిచూచాడు. రిమ్మ తిరిగిపోయింది. ఆమె రానే వచ్చింది. ఆ విషయమే గమనించలేదు. అనాలోచితంగా, అన్యాక్రాంతంగా వుండటంవల్ల పూర్వపు అప్యాయత, ఆదరణ చూపించలేకపోయాడు. రాగానే ఎదురై, నిలువెల్లా కౌగలించుకొని ఉక్కిరిబిక్కిరిచేసి, ఊపిరే సలపనీయని సుందర్ ఈనాడు అంతగొప్పగా అలంకరించుకొనివచ్చినా స్థాణువులా కూర్చుండిపోయాడు. చలనంలేదు. ఆమెకు అర్థంకాలేదు సుందర్. తనువచ్చాక తలుపులు అంతసేపు తెరిచివుండటం ఏనాడూ లేదు. ఈనాడు తానే తలుపులు గడియవేసింది.

"ఏం సుందర్ అలావున్నావు. ఒళ్లుబాగాలేదా" అంటూ వచ్చి వొళ్లోవాలి నొసలువత్తింది. తలపట్టుకుచూచింది. ముంగురులు సవరించింది గోముగా.

"నీతోకొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి" అన్నాడు దించిన తల ఎత్తకుండానే.

"రాచకార్యాలా.... మనమధ్య?" హాస్యం చిందింది.

"శకుంతలా! విచారంగావున్నానని కదా అన్నావు. నిన్ను ప్రేమిస్తున్నాను కనకనే ఈ విచారం!"

"అదేమిటి వింతగావుంది. నీధోరణి!"

"అవును శకుంతలా! నిన్ను ప్రేమిస్తున్నాను. ఆపాదమస్తకం నిన్నే ప్రేమించాను. హృదయ పూర్వకంగా ప్రేమించాను. కానీ నిన్ను బాధించి ఒకమాటచెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నా అదే నాబాధకు కారణం."

శకుంతల మొహం వివర్ణమైంది. అయోమయంగా సుందర్ కళ్ళలోకిచూచింది.

"ఏమిటీచెప్పు సుందర్. ఎందుకింత ఆలోచన. బాధ...."

"నేను పెళ్ళిచేసుకోబోతున్నాను శకుంతలా?

మిన్నువిరిగి మీదపడ్డది. పిడుగుల వర్షమే కురిసింది. వేయివోత్తుల బల్లుముహంమీద విసిరి కొట్టినంత గాభరా తిన్నది. హృదయం బ్రద్దలైంది. నిట్టూర్పు.... బాధ....

మరి మాట్లాడలేక అలా ఉగ్గపట్టింది.

సుందర్ కల్పించుకున్నాడు.

"ఈనిర్ణయానికి వచ్చేముందు నేనెంతగా బాధపడ్డానో చెప్పినా నీకర్థంకాదు శకుంతలా. నాకు డబ్బులేదు, హోదాలేదు ఇల్లులేదు, ఇల్లాలు లేదు, ఇదినాస్థితి. పైగా ఒంటరివాణ్ని. నాకు ఒకభార్య కావాలనీ, ఆమె సలహామీద నడచుకోవాలని నాకూ కోరికవుండడం సహజం. జీవితంలో సహధర్మచారిణి కావాలని ఏ సామాన్యమానవుడు కోరుకోడు, ఎవరిమనసు ఆరాటపడదు. అలాగే నేను సామాన్యుణ్ని గనక ధర్మపత్ని కావాలని కోరాను. నా స్వప్నసుందరి, మధురమూర్తి నాకులభించింది. ఏవో కుంటి సాకులు కల్పించి మానడం మంచిదికాదనుకున్నాను. వివాహం చేసుకొని ఒకఇంటివాణ్ని కావడం తప్పుకాదని నిర్ణయించాను"

అమెఏదో శపిస్తుందని భావించాడు. కాని నిజానికి గుండెలకు చేతులు అడ్డుపెట్టుకవి విలవిలా ఏడ్చింది....గుండెలు

భారంలో విరిగి క్రిందపడతాడుగా అన్నంత బాధ అనుభవించింది. తలతిరిగిపోయింది, రొమ్ములు విపరీతంగా చలించినయ్ విషాదభారంతో.

ఆమెను తన చేతుల్లోకి తీసుకు ఓదార్చాలనుకున్నాడు. కానీ ధైర్యించాలేదు. ఆమె తనదికాదు అన్న అభిప్రాయం వొచ్చింది, అభిమానం అడ్డొచ్చింది. అయినా అందుకు శకుంతల అంత అవకాశం యివ్వలేదుకూడా.

"హాభగవాన్" అని నిట్టూర్చింది.

ఆమె పాదాల ముందు మోకరిల్లాడు.

కన్నీటితో కడిగాడు ఆ గులాబీలను.

అప్రయత్నంగా కన్నీరుమున్నీరుగా వెలువడింది సుందర్ కళ్లవెంట.

ఆమె ఆ సిడుగులాంటి వార్త వినీ తననుదూషిస్తే, విరుచుకుపడితే, నోటికొచ్చినట్లు దుర్భాషలాడితే శాంతించేవాడు. కానీ శాంతంగా, శోకదేవతలా లోలోన కుమిలిపోయింది, ఏడ్చింది తనలోతను.

అది అతన్ని కోసివేస్తున్న రంపం.

"శకుంతలా నన్ను అపార్థంచేసుకోకు. నేను ఎలాంటివాడినో నీకు తెలుసుగా, నిన్నే వివాహంచేసుకోగల అవకాశంవుంటే మనకీ వియోగం లేకపోను. కానీ ఆఅవకాశం లేదు. ఆ అవకాశాన్ని నీవుకల్పించలేవు. నీవా వివాహితవు, నేనా

బ్రహ్మచారిని. ఎలా సాధ్యం చెప్పు. ఓ క్షణం ఆలోచించు శకుంతలా ... నా స్థితిలో నీవుంటే ఏం చేసేదానివో చెప్పు ?"

ఆమె కళ్ల నుండి ధారాపాతంగా కన్నీరు వర్షించడం తప్ప మరేం లేదు.

"ఏడవకు శకుంతలా ! నీవు ఏడుస్తుంటే నే చూడలేను. నా హృదయం కరిగి కన్నీరై, మున్నీరై, సెలయేరు లౌతుంది.

ఆ మాటలకు అర్థంలేదు. ఆ విషయం శకుంతల గ్రహించ గలిగింది.

"ఎవరా అదృష్టవంతురాలు సుందర్. తెలుసుకోవచ్చా" అడిగింది గుండెలు బిగబట్టి, రాయి చేసుకుని హృదయం.

ఓ క్షణం తటపటాయించాడు. భయం వేసింది. అయినా చెప్పక తప్పలేదు.

"అదృష్టవంతురాలు కాదులే శకుంతలా! ఓ దౌర్భాగ్యురాలే"

"పేరు?"

"లీల"

?!

ప్రళయ ప్రభంజనం లాగా గర్జించిన ఆ మాటకు చలించిపోయింది. పిడుగుల వర్షమే కురిసినట్లయింది. అచేతనం అయింది. తొడమీద తలపెట్టివున్న సుందర్ కళ్లకు అవుపించ లేదు.

అదాటుగా లేచింది. వెళిపోతుందేమోనని, గట్టిగా పట్టుకుని వెనక్కి తీసుకువచ్చి కొంచెం ఓదార్చాలనుకున్నాడు.

"వెళ్లకు శకుంతలా! అలా కోపంతో వెళ్లొద్దు. నా మాట విను. నిమ్మితంగా ఆలోచించుకుందాం కూచో."

ఓ సారి అతన్ని ఆపాదమస్తకం పరీక్షగా చూచింది. నిలువెల్లా కపించిపోయాడు ఆ వాడిచూపులకు. శివుని మూడవ నేత్రం తెరిస్తే.... మన్మధుని గతిఅది. ఆచూపులను బట్టి స్త్రీ దృష్టిలో ఎంతటి తీవ్రశక్తివున్నదో గ్రహింపు అయింది సుందర్ కి. సుకుమారంగా అవుపించే హృదయం ఎంతటి అగ్నివర్షతమో తెలిసింది. ఆ సెగలకు పురుషుడు తట్టుకోలేడు నిజంగా.

ఎండిన చిరునవ్వు పెదాలపైకి తెచ్చుకుని అన్నది.

"నేనేం అనటంలేదు సుందర్. ఏమీఅననుకూడ. నిన్ను ఏమైనా అనేఅర్హత, కాదనే అర్హత నాకెక్కడిది? నేనెవర్ని చెప్పు. నీఅవసరంనీది. నీనిర్ణయంనీది.... నేనెవర్ని కాదనడానికి?"

అంటూనే వెళ్లిపోయింది నిలబడేశక్తి కోల్పోయి. ఆమెను ఆపగలశక్తి అతనిలో లేదు. స్త్రీశక్తి స్వరూపిణి. ఆ అపూర్వశక్తి ఆమెలోకి ప్రవేశించినపుడు, సజీవ ప్రపంచంయావత్తు ప్రయత్నించినా ఎదిరించలేదు. అందుకే ఆమెను ఆపగలశక్తి అతనిలో కంటుపడేంది. ఆగే సహనం ఆమె కోల్పోయింది. అంతే...

శకుంతల వెళ్ళిపోయిన కొన్నినిమిషాలకు గానీ సుందర్ తేరుకో లేదు. తలంతా సమ్మెటలతో బ్రద్దలు కొడుతున్నట్లుంది. బ్రయ్యలై పోతోంది. తనలో తను అనుకున్నాడు:

"పోనీలే. ఒకగొడవ పరిష్కారం అయిపోయింది, ఏ రాద్ధాంతం లేకుండా జరిగిపోయింది. ఇదీ ఒకందుకు మంచిదే నేమో!"

ఆ భావనతో మనసు తేలిక పడ్డది. అదృష్టం తనవేపే వున్నదని అనిపించింది.

లీలాదేవి అడిగితే "శకుంతల ఒప్పుకుంటా" అంటే "సంతోషంగా అంగీకరించింది" అని చెప్పవచ్చు.

నిజానికి అలాజరగలేదు. ఈసువార్త లీలకు అందచేయాలని రోజల్లా ఉవ్విళ్లూరాడు. సాయంత్రం ఆమెఇంటికి బయల్దేరివెళ్లాడు, విషయంచెప్పాడు.

"అయితే శకూ నీమాటవినగానే క్రుంగిపోలేదూ?" అని ప్రశ్నించింది.

"ఏమీకాలేదు. పైగా చాలా సంతోషించింది" అన్నాడు.

"అబద్ధం. అలా ఏ స్త్రీ అంగీకరించదు నాకు తెలుసు. నీవు అబద్దంచెబుతున్నావు" అన్నది పైగా.

"లీలా నీదగ్గరగా రావటంఅంటే ఏమిటో భయంగా వుంటుంది. కారణంఅర్థంకాదు" అన్నాడు.

"అవునుమరి. మిత్రునిభార్యఅంటే అలాగేవుంటుంది." అన్నది నవ్వుతూ .........

"ఇక నాభార్యవు కదా. నీవునాదానివే గదా. నిన్ను వాంఛించే అధికారం నాకున్నది అవునా. అయినా నిన్నుచూస్తే నాకెందుకో అర్థంలేనిభయం."

నవ్వుతూ సుందర్ చేతిలో వాలిపోయింది.

"ఎందుకోభయం. ఇందుకేనేమో" అంటూ దగ్గరగా తీసుకున్నాడు.

"నిన్ను మొదటిసారి చూచినపుడు నీసౌందర్యాన్ని చూచి పిచ్చివాణ్ణయిపోయాను. నీవు నాదానివైతే ఎంత అదృష్టవంతుణ్ణి అనుకున్నా, అయినావు......... సంకల్ప బలం."

"అప్పుడే అయిందేమిటి" అన్నది నవ్వుతూ

"కాదు!"

( శి

# 17

కాలం ఇంకా యిద్దర్నీ దూర దూరంగానే వుంచుతోంది. కనీసం ఆరు నెల లయినా గడవందే లిల ఎందుకూ అంగీకరించ నన్నది. సదానందాన్ని మరచిపోవాలంటే కనీసం ఆరు నెలల కాలం అవసరం. అందుకనే ఒకయింట్లోవున్నా, ఒకచోట మెసిలినా, ఎంత దగ్గరగావున్నా, సదానందం స్థానాన్ని సుందర్ పొందలేదు.

ఈ తెరచాటు జీవితం అయోమయంగా, అర్థ రహితంగా వుంటోంది. అది సంసారంలాగా లేదు నిజానికి. ఏదో వెలితి అవుపిస్తోంది.... లీలనుండి ఆశించిన సౌఖ్యాలు పొందడానికి వీల్లేకపోయింది. ఆనందం ఆకాశానికి ఎగిరి పోయింది. రోజు రోజుకూ ఆమెదూరంగా జీవిస్తోంది. తనుఎంత మక్కువతో దగ్గరకు తీసుకుందామని ప్రయత్నిస్తే, ఆమె ప్రయత్నంగా అంతదూరంగాను జరిగి పోతోంది. దీనికికారణం అర్థంకావటంలేదు. ఎంత ఆలోచించినా పరిష్కారం దొరకటం లేదు. తనంటే ఆమెకు యిష్టం లేదేమో! ఇష్టంలేకుంటే లేదని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పే తత్వమే ఆమెది. అందులో సందేహంలేదు.

ఆరోజు సాయంత్రం ఆఫీసునుండి రాగానే ఏదోపనివున్న దని లీలను దగ్గరగా పిలిచాడు.

"ఏమిటి సుందర్" అంటూ దగ్గరగావచ్చింది.

వచ్చినలీలను పొదవి పట్టుకుని కౌగిలించుకున్నాడు. అతిలా కుతలమైపోయి, విడిపించుకొని, దూరంగాజరిగి నిట్టూర్చింది.

"ఏమిటి సుందర్ మరీన్నీ" అన్నది కోపంగా.

అదిప్రణయ కోపమని భ్రమించిన సుందర్ మరోసారి మీదికి లాక్కొని గట్టిగా కావిలించుకొని ముద్దెట్టుకున్నాడు.

"వదలు సుందర్ వదులు, నాకేంబాగాలేదు" అన్నది.

"ఊహూ నాకుబావుంది"

"వద్దు సుందర్, వొదులు" కోపంగారక్కింది, బలంకొద్దీ దూరంగా నెట్టివేసింది. వెళ్లి దూరంగావున్న సోఫాలోపడ్డాడు. యవ్వనం సవాల్‌చేసింది. కళ్లు నిప్పుకణికలే అయినాయి. కానీ చేసేదేమీ లేక నిట్టూర్చాడు.

"నీ ఆకతాయివేషాలు నాకేంనచ్చవు సుందర్ క్షమించు. నన్ను అపార్థంచేసుకుంటే మన్నించు" అన్నది.

సుందర్ వినిపించుకోలేదు. మృగశక్తి హెచ్చిపోయింది. పురుషత్వం ప్రజ్వరిల్లింది. రెండు చేతుల్లోకి ఎత్తుకుని, విలవిల లాడుతున్నా, విదిలించి కొడుతున్నా లెక్కచేయకుండా, గదిలోకి తీసుకువెళ్ళి మంచంమీద వొదలి తలుపులు వేశాడు. పెదాలు నెత్తురులో తడిసి పోయినాయి.

"ఏమిటి సుందర్ మరిన్ని. చిన్నపిల్లల్లా ఏమిటీ రాద్ధాంతం. నీ ప్రేమకలాపాలు నాకు నచ్చవు."

"నాకు నచ్చుతాయి" అన్నాడు కోపం తెచ్చుకొని.

"నాకిష్టంలేదు" కోపంగానే లీల అన్నది.

"నాయిష్టాలు నావి సుందర్. నాకిచ్చినమాట జ్ఞాపకం వుందా. వాటిని వ్యతిరేకించే హక్కు నీకు లేదు. పైగా నేను నీభార్యనీ, శకుంతలలా నీ ప్రేయసినీ కాను!"

"శకుంతల అయితే ఇలా ప్రవర్తించేది కాదు"

ఛెళ్ళుమని విసిరాడు.

కాని లీలమాటలు స్మరణకువచ్చి, కొరడా ఝళిపించి నట్లయింది. "సరే నీయిష్టం. నిన్ను కాదని నేను సుఖపడిచచ్చేదే ముంది." అని చరచరా బయటకు వెళ్లిపోయాడు.

కాని చేసుకొన్న ప్రమాణాలుకానీ, ఏర్పరచుకొన్న నిబంధనలు గానీ తు. చ. తప్పకుండా అమలుజరపడం మానవులకు సాధ్యంకాని పని. సుందర్ కూడా ఆలాంటి సామాన్యమానవుడే. అందులో వయవంలోవున్న యువకుడు. రాత్రి చాలాపొద్దుపోయి ఇంటికి చేరుకున్నాడు. అప్పటివరకు లీల మెళకువగానేవుంది. ఏదో పుస్తకం చదువుతోంది.

"సుందర్ ........ఒక మాటచెబుతాను వింటావా?"

సుందర్ కి వినాలని లేదు. ఓ క్షణం మౌనంగా అయిష్టాన్ని చూపాడు.

"ఏమిటి?" అనట్లుచూచాడు.

మళ్లా లీలను కాదనే ధైర్యంలేదు.

"నా చిరకాలవాంఛ ఒకటివున్నది సుందర్. బాగా డబ్బు సంపాదించాలి. మంచిఇల్లు కట్టుకోవాలి. ఆయన అదే అనేవారు బ్రతికుండగా. "అందుకే అహర్నిశలు కష్టపడి సంపాదించేవారు. బ్రతికుంటే సాధించేవారేమో. నాకన్న కలలు ఫలించేవేమో!"

"ఎప్పుడూ చచ్చినవాడి సంగతులు తప్ప మరేం దొరకవా నీకు మాట్లాడ్డానికి" అన్నాడు కోపంగా.

"క్షమించండి సుందర్. మీరు అంతగా నొచ్చుకుంటా రని తెలిస్తే, ఆ ప్రస్తావనే తీసుకురా పోదును."

బుద్ధిమంతునిలా కూర్చున్నాడు. సాయంకాలం జరిగిన సంఘటనలు స్మరించుకుంటూ. లీలకు జాలివేసింది స్త్రీహృద యం కనుక అతనిదీనావస్థచూచి.

"అలావున్నావేం సుందర్?"

"ఎలావుంటే నీకేం? నీ పట్టుదల నీది. నీ అభిమతంనీది. నీ అభిరుచినీది. నాతో ఏంపని. నా అభిప్రాయాలతో ఏంపని. నేనేలా వుంటే ఎవరికి కావాలి. తెగిన గాలిపటం ఎటు గాలివీస్తే అటు పయనిస్తుంది. నేను అటువంటి గాలిపటాన్నే. గాలి లేకపోతే, స్థంభిస్తే నేల వాలిపోతుంది గాలిపటం."

"అంటే"

"అంటే ఏమున్నది. అనుభవం కలవారాయె తమరు. కష్టాలు, సుఖాలు తెలిసినవారు. ఏదో మీ అడుగుజాడల్లో నడవలసినవాణ్ణి నేను. అందుకుబద్ధుణ్ణేకదా. పైగా నాకేంతెలుసు లీలాదేవీ. బ్రహ్మచారిని. సంసారం అంటే, సంసారబాధ్యతలంటే ఎరగనివాణ్ణి. మీరంటే కాచి వడబోసినవారు."

గతుక్కుమన్నది లీల.

"ఏం ఎగతాళి చేస్తున్నావా! వ్యాఖ్యానిస్తున్నావా?"

"ఎంతమాత్రంకాదు. మీ అనుభవాన్ని, ప్రశంసిస్తున్నాను. నాకు ప్రేమపాఠాలు నేర్పగలవా లీలాదేవీ?"

"నేర్పగలరా" అని నవ్వింది.

అలాఅని శకుంతలే నవ్వితే పులకరించేవాడు సుందర్. అయినా ఫలితంవుండేది. క్రిందపడ్డా మీదపడ్డా. ఏదోజ్ఞాపకాన్ని చక్కలిగింతలు పెట్టినట్లు, నిద్రాణమైయున్న కోర్కెల్ని రెచ్చగొట్టినట్లు వుండేది. లీల ఏమన్నా ఏమీ చలనం వుండటంలేదు.

ఈమెతో ఎంతచేసినా ఒకనటునిలా నటించవలసిందే. ప్రేమగాని, వాంఛగాని, మరేదైనాగాని నటించవలసి వస్తోంది. నిజంగా అనుభవించటం లేదు.

"ఎంత రుచిగావున్నా వంటకాన్ని అప్పుడొకటి అప్పుడొకటి తింటూ కూర్చోకూడదు. భోజనంతోనే, అన్నీ ఆకలైనపుడే వంట రుచితెలిసేది." అన్నది.

అర్థం చేసుకున్నాడు పాపం సుందర్.

"నన్ను ఎగతాళి చేసి ప్రయోజనంలేదు సుందర్. నేనేమీ కన్నెపిల్లనుకాను. అనాఘ్రాతాన్ని కాను. కొంతకాలం సంసారం చేసినదాన్ని, పైగా అనాథను. కోర్కెలు, మమతలు, మమకారాలు చాలావరకు ఉపశమించినవి కూడానేమో. మరీ బేలనుకాను, అభిసారికను కాను. వయసులోనున్న ప్రౌఢను ముందేనీవు ఆలోచించుకోవలసింది. నన్ను, నా వయసును పోల్చి చూచుకోవలసింది.

ఏ సినిమాలలోనో చూచి అలా ప్రవర్తించదే ఈమె అనుకుంటే ఎలా! నీవాయువకుడివి. నీకు నేనుతగినదాన్ని అవునా కాదా అనియోచించావా? క్రొత్తగా అవుపించిన పుష్పంకదా అని, కోసి వాసన చూడామనుకొన్నావు. వాసన అయిపోగానె విసిరి వేదామనుకొన్నావు. కానీ నేను అలాంటి తత్వంకలదాన్ని కాదుగామరి. యుక్తాయుక్త విచక్షణ వున్నదినాకు. నీకున్నన్ని కోర్కెలు, వాంఛలు, నాకు లేవనికాదు. నీకంటే నిజానికినాలోనే వాంఛలు ఎక్కువ. ఎప్పుడూ పురుషుల్లోకంటే, స్త్రీలోనే వాంఛ దృఢంగా, ఎక్కువగా వుంటుంది. కానీ దాన్ని ఏఆడదీ బయట పెట్టదు. అందులో నాలాంటి స్త్రీ బొత్తిగా వాటికి ప్రాధాన్యత ఇస్తున్నట్లు అవుపించదు. ఏమిటో ఈ సంసారం, ఈ ప్రపంచం అన్నంత వైరాగ్యంగా అవుపిస్తారు.

గదిలో చీకట్లు ముసురుకున్నాయి. ఈజీచైర్‌లో పండుకున్న సుందర్ సిగరెట్ నిషాలో ఆలోచిస్తున్నాడు. ఎంతకీ లీల ప్రవర్తన అర్థంకావటంలేదు. అన్ని విషయల్లోనూ అనుకూలంగా వుంటుంది. కానీ ననేమీ దగ్గరకురానీయదు. తను ఉద్రేక పడదు.

తనను ఉద్రేకపరచదు. పైగా నీళ్ళు కారేలా చేస్తుంది. శృంగారం అంటె ఏమిటో ఆమెకు అసలు తెలీదేమో. శకుంతల లీలకన్న వేయిరెట్లునయం. ఇంత శుద్ధమొద్దు కనకనే సదానందం అంత చప్పగావుండేవాడు. ఏమిటో ఆమెలో లోపంవుంది. అనుభవిం చటం వేరు, ఆనందంపొందటం వేరు. అదే ఇప్పుడు కరువైంది తన జీవితంలో లీలను ఆశించాక.

లీల నడుంచుట్టూ చెయివేసి దగ్గరగా తీసుకుంటే ఎలా వుంటుందో ఊహించి తన్మయుడౌతున్నాడు. ప్రేమ జాలు వారుతోంది. ఆమెశరీరం తనశరీరానికి రాసుకుంటున్న దనుకున్న కొలదీ వాంఛోధృతం ఎక్కువ అవుతోంది.

"ఏమిటి సుందర్ ఆ ఆలోచన. ప్రొద్దుపోయింది నిద్ర పోగూడదూ"!

"చాలాకాలమైంది నిద్రకు దూరమై"

నిజానికి లీల తనదిగా ఏమీ ఆమె కోరుకోలేదు. అంతా సుందర్ కి అర్పించాలనుకుంటుంది సుందర్ చెప్పినట్లువింటే పో యింది లేదు. చిత్రకారుని పోకిళ్లు అతనుపోతుంటే తను చిత్రంగా చిత్రవర్ణాలుగా మారిపోగలదు. రంగులు తొడగగలదు, భంగి మలు పోగలదు. సంతృప్తి నివ్వగలదు.

ఇంకా కాలం రావాలి. సుందర్ తనపరీక్షలకు నిలువ గలిగేదీ లేనిది ఇంకా తేలలేదు. అతను నిలవగలిగిన నాడు ఏ అభ్యంతరమూ వుండదు. తను రతీదేవినే మరిపించగలదు. రంభనే భంగపరచగలదు తను.

ఆమె కురుల్ని సవరిస్తూ అన్నాడు సుందర్.

'ఎందుకు నన్నిలా ఏడిపిస్తావ్ లీలా. నన్ను నమ్మటంలేదా. నా హృదయం ఎంతగాదహిస్తోందో చూడు ...నీ కోసం ఎంతగా పరితపిస్తున్నానో చూడు. ఇప్పటికీ దయ కలగడంలేదా నామీద.

"కాకుంటే ఆ అల్లరి ఏమిటి సుందర్ .... నేను పరాయి దాన్నా చెప్పు. మక్కువ పడితే మనసు కలిగితే, మురిపించలేని మగువ ననుకున్నావా?"

"నిన్ను ఆరాధిస్తాను లీలా...."

"నేను నీలాగా ఆరాధించ లేనేమో సుంద . నీ ఆరాధన ఇలాంటిదేనని ఒకసారి శకుంతలతో అనివున్నావను కుంటా?

త్రుళ్లిపడ్డాడు.

"అవును సదానందంతో అన్నాను" అన్నాడు కోపంగా

# 18

సదానందం నిర్వహించే బాధ్యతల్ని సుందర్ నిర్వహించటంవల్ల, ఉద్యోగంలో హోదా పెరిగింది. రాజకీయాలకు, రాజకీయ నాయకులకు అతి సన్నిహితుడు కాగలిగాడు.

ఒకరోజు సాయంత్రం ఇంటికి వెళ్లేసరికి లీల హడావిడిగా వుంది. టేబుల్ మీద ఫ్లవర్ వేజులు సర్దుతోంది. రేడియో సంగీతానికి తోడుగా పాటుకూని రాగాలు తీస్తోంది. ఎన్నడూ లేని దీచర్య, అంతఉత్సాహం ఆమెలో ఈమధ్య ఎన్నడూ చూడలేదు. చేతిలో వున్న గులాబీలపొట్లం వెనకగా దాచుకుని అడిగాడు.

"ఏమిటి లీలాదేవీ ఈ అలంకరణ.... ఏం విశేషం?"

"ఓహో మీరా ! " అన్నది.

"అవును నేనే. ఎవరనుకున్నావ్. అంతఉలిక్కిపడ్డావు?

"ప్రసాద్ అనుకున్నాను"

"ప్రసాద్ ! ఎవరా ప్రసాద్?"

"ఓ స్నేహితుడు. నా క్లాసుమేటుకూడా .... నిన్ననే హైదరాబాదునుండి వచ్చాడుట.

ఒకపుడు ఫామిలీ ఫ్రెండు.లోగడ సదానందం ప్రతిరోజూ తరుచువస్తుండేవాడు. ఈ మధ్య రావటంలేదు. కాని, ఇదివరకు ఎప్పుడువచ్చినా ఇక్కడే దిగేవారు. ఇవేళవస్తానని కబురు చేశాడు"

గతుక్కుమన్నాడు సుందర్. లీలకుకూడా ఇలాంటి స్నేహాలున్నాయన్న మాట. కనుమరుగు స్నేహితులున్నారన్న మాట. శకుంతలతో తన స్నేహం ఇలాగావుండేది. భర్తను మధ్యపెట్టి నాతో స్నేహంచేసింది. ఆ రహస్యం శేఖర్కి తెలియదు. ఏదో స్నేహితం అనుకునేవాడు. అలాగే లీలకు ప్రసాద్తో స్నేహం అయివుండాలి దాన్ని మామూలు స్నేహంగా సదానందం భ్రమించివుంటాడు.

శకుంతలతోటి తనస్నేహం ఆమెభర్తకు తెలిసిందా? లేదు. తానూ వాళ్ళయింట్లో ఫామిలీ ఫ్రెండుగానే చెలామణి అవుతూ వచ్చాడు. అయితే తను శకుంతలకుమాత్రం ప్రియుడు. లీలాదేవికిఉన్న స్నేహితులు కూడా అలాంటి వాళ్లేమో! సదానందంతో స్నేహితులుగా మసులుతూ లీలతో ప్రేమకలాపాలు సాగించే వారేమో! వాడొట్టి బడ్డు, బూట్, మొద్దు. ఆఫీసులో బండచాకిరీ చేయటమే కాని, ఇంటిదగ్గర జరిగే రాసక్రీడలు సుతరామూ పట్టించుకునే వాడు కాడు.అతనికేం తెలిసేదికాదు. అసలు లీల తెలియనిచ్చేదికాదు. అనుమానానికి ఆస్కారం లేకుండా అన్నిప్రమాణాలు ముందుగానే చేయించుకొని వుంటుంది. బావు ది. అందుకే కాబోలు ఆ శకుంతలకు ఈలీలకు స్నేహం. ఇద్దరూ ఒకే తత్త్వం కలవాళ్లు. భర్తచాటు విరహిణులు. అభిసారికలు....

ఒక్కక్షణంలో ఇన్ని ఆలోచనలు బిలబిలా మదిలో మెదిలినాయ్. 'ఓ అలాగా' అనగలిగాడు.

సుందర మొహం కవళికల్నీ, హావభావాల్ని గ్రహించకుండా, ప్రసాద్ వొస్తున్నా డన్న సంబరంతో గదిని అలంకరించటంలో నిమగ్నమైపోయింది. చేతులోని గులాబీపొట్లాన్ని విసిరి బయట నేద్దామా అన్నంతకోపం వచ్చింది. కానీ నిగ్రహించుకున్నాడు.

"గులాబీలు తెచ్చాను లీలాదేవీ"

"ఊ నాకోసమే! అవంటే ప్రసాద్‌కి ఎంతో యిష్టం. ఎప్పుడొచ్చినా ఇన్ని గులాబీలు తెచ్చేవాడు. సదానందంగారు కూడా ఎప్పుడూ గులాబీలే తెస్తుండేవారు నాకిష్టమని అన్నది" ఆనందం పరవళ్ళుత్రొక్కగా....

అంటూనే చేతిలోంచి పొట్లం అందుకుంది. వాసన చూచింది. గుబాళింపు గుండెల్నితాకిందేమో తన్మయత్వంతో ఒక్కసారి కళ్ళుమూసుకుని గుండెలకు వొత్తుకుంది. అందులో ఒ పువ్వుతీసి తలలో తురుముకుని అద్దంలో అందాన్ని పరికించింది.

"ఆ గులాబీగానైనా పుట్టకపోతిని ఖర్మ" అనుకున్నది సుందరం ఎడద బరువుగా.

"నీ కురుల్లో ముడుచుకున్న గులాబీలుచూస్తే మీ మిత్రుడు ప్రసాద్ తన్మయుడై పోతాడుకదూ .... సదానందమే వుంటే సంతోషించి పరవశించి వుండేవాడుకదూ" అన్నాడు కసిగా కసిగాచూస్తూ నవ్వు తెచ్చుకుని.

"వారేవుంటే మీకీశ్రమ వుండేదికాదుగా" బాణం విసిరింది తిరిగి అప్రయత్నంగానే.

"అవును సుందర్. ఆయన ఎంత సంతోషించేవారనీ, ఇలా వైట్ వాయిల్ చీరకట్టుకుని, తలంటి తలలో గులాబీలు తురుముకుంటే తనలో తనే మురిసిపోయేవారు. పాపం! నిజానికి ఏ మాటకామాటేగానీ, ప్రసాద్ కూడా ఎంతో సంతోషించేవాడు. అయితే అతనికి తెల్లచీర నచ్చదు. నీ వొంటికి లేత ఆకుపచ్చ చీర, తెల్లజాకెట్ నప్పుతుందిలీలా అంటాడు పిచ్చివాడు ఆడవాళ్ల అభిరుచులు తెలిసినట్టు మహా... అన్నట్లు ప్రసాద్‌ని నీవు ఎరగవా సుందర్ .... ఎరిగేవుంటావు. అతను తెలియక పోవటమేమిటి? చాలామంచివాడు. స్నేహపాత్రుడు. అలాంటి స్నేహితులు దొరకటంకూడా పూర్వజన్మ సుకృతమే"

సుందర్‌కి చప్పున శకుంతల స్ఫురణకువచ్చింది. అలాగే అనేది శకుంతల తననుగూర్చి శేఖర్‌తో. అలాఅనిచెప్పగా తనే అనేకతూర్లువిన్నాడు.

ఏమిటో ఈ పజిల్ అర్థం కాకుండావుంది. లీలకు, శకుంతలకు మాటలలో, చేష్టలలో ఏమీ తేడా లేదు.

ఇంతలోనే రావలసిన ప్రసాద్ రానేవచ్చాడు.

లీల యిద్దరికీ పరిచయంచేసింది. కరచాలనం చేసుకున్నారు.

కానీ మల్లయుద్ధానికి సిద్ధమయ్యే ఇద్దరు యోధులు కరచాలనం చేసుకున్నట్లేవుంది సుందర్ వైఖరిచూస్తే.

"మీ ఇద్దరికీ అయిదు నిమిషాల్లో స్నేహంఅవుతుంది" అన్నది లీలనవ్వుతూ "అలా లోపలకు వెళ్లివస్తాను సుందర్. వీరిని ఎంగేజ్ చెయ్యి." అంటూలోపలకు వెళ్లిపోయింది.

ఓ అయిదు నిమిషాల్లో ట్రేలో కాఫీకప్పులు పెట్టుకొని తయారైంది. అప్పటికిఇద్దరూ ఏ లోకాభిరామాయణంలో పడ్డారో పకపక నవ్వుకుంటున్నారు. ఏదో విషయంమీద చర్చసాగిస్తూ.

కొద్దినిమిషాలు గడిచాక ప్రసాద్ వెళ్ళిపోయాడు.

లీల అన్నది సుందర్‌తో "చాలామంచివాడుకదూ .... స్నేహపాత్రుడు అని నేనంటే నమ్మావుకాదు మొదట. చూడు ఎంతప్రేమగావున్నాడో."

"అవును ఎర్రగా, బుర్రగావుంటే ఆడవాళ్ళకు ప్రేమ పాత్రుడు కాడాయేం" అన్నాడు వికటంగా.... ....

సదానందానికుండే గౌరవం, హోదా ఆర్జన అన్నీ సుందర్‌కి సంక్రమించాయి. కాక వాటితో పాటు కీర్తి ప్రతిష్టలు కూడా సంక్రమించాయి. అదీ ఆశ్చర్యం. నిజానికి సుందర్ ఏమంత పెద్దరచయితకాడు. కానీ అదృష్టం అలా కలిసి వచ్చింది.

అందరూ సదానందాన్ని ఆనంద్ అనేవారు. ఆపేరుతోనే అతను వ్యాసాలు, గల్పాలు వ్రాసేవాడు. ఇప్పుడు సుందర్, సదానందం భార్య లీలను పెరదీశాడన్న విషయం, పేపర్లో అయితే ప్రచురించలేదు కానీ, అందరికీ ఇట్టే తెలిసి పోయింది. అందువల్ల ఎదురుగా సుందర్ అని అన్నా పరోక్షంగా సుందర్‌ని ఆనంద్

అనే వ్యవహారిస్తున్నాడు పైగా ఆనంద్ ప్రభావం సుందర్ పై బాగాపనిచేసింది. ఆనంద్ వ్యాసాలు ఎంతఘాటుగా, విమర్శగా తార్కికంగావుంటాయో సుందర్‌వీ అలాగే వుంటున్నాయి

చాటుమాటుగా తనని ఆనంద్ అని సంబోధించటం చాలా సార్లువిన్నాడుసుందర్. విని ఏమీబాధపడలేదు కొత్తలో ఉలుక్కున్నా తర్వాత అలవాటైపోయిందనే చెప్పాలి.

ఆఫీసులో ఎవరికైనా, ఏవైనా అభిప్రాయభేదాలు వస్తే ఆనంద్‌గార్ని అడుగుదాం అని అనడం తన గదిలోకి వినిపించేది. ఎవరన్నదీ తెలుసు. కానీ ఏంచేయగలడు? అలాంటిమాటలే అందరూ అనేవారు కర్మకాలి. అలా తనని 'ఆనంద్' అనడంలో ఎవరూ ఎబ్బెట్టుగా భావించకపోయినా, తనకుమాత్రం ఆమాట ములుకులా తాకేది. బాధపడేవాడు. కించపడేవాడు. "ఆ జీబురు మొహంగాడిపేరు నాకు తగిలించారేమిటి" అనేకునేవాడు, చిరాకుపడే వాడు.

ఆఫీసుకు వచ్చేవారు అప్పుడప్పుడు తన వ్యాసాల మీద అభిప్రాయాలు వెలిబుచ్చేవారు. అనేవారు "ఆనంద్‌గారే వ్రాస్తున్నట్లుంతోంది. అచ్చుగావారే వీరు అనిపిస్తున్నారు "అని

అలాఅని ఎవరైనా తనను శ్లాఘించినా, తనను శపిస్తున్నారనే అనుకునేవాడు. తనబహీనతను వెలికిదీసి వెక్కిరిస్తున్నారని బాధపడేవాడు. తనకి వ్యక్తిత్వమే లేనట్లు, అన్నీతన మీద అనంద్ చాయలే వున్నట్లు మాట్లాడడం బాధగానేవుండేది. లీలను తనుధైర్యంచేసి చేరదీయటంవల్లనే ఈగొడవంతా జరిగింది.

కానీ ఆమెతో తను సంసారంచేయటంలేదనీ, కేవలం ఒక ఇంట్లో అద్దెకు వుంటున్నామనిమాత్రమే ఏం తెలుస్తుంది. తాము ప్రియులు కాదు, అన్నాచెల్లులుకాదు, ఏమీకాదు. ఒక ఇంట్లో బ్రతుకుతున్నారు. ఒకగిన్నెలో వండుకొంటారు. వేరుమంచాల మీద శయనిస్తారు ఇదీవరస. ఎవరికి తెలుస్తుంది. అని ఆమెను వొదలలేను ఆమె రక్షణ భారం తనమీద వేసుకుంటానని సదానందానికి మాటయిచ్చాడు. ఆమాట నిలబెట్టుకుంటున్నాడు. అదీ తన విధి, దుర్విధి.

"ఓహ్, పిచ్చిముండాకొడుకులు. వీళ్ళందరికీ అసూయ నేనంటే. లీలను నేనేదో తెగఅనుభవిస్తున్నానని కళ్లు, ఆమె అసలు మనిషి ఎవరికీ తెలీదుకదా" అనుకునేవాడు.

లీల అందరికీ అందనిపువ్వు. కొందరికి అందినా ఆపువ్వు పరిమళంవేరు. అందరూ ఆఘ్రాణించి ఆఘాటుకు తట్టుకోలేరు. చూస్తుంటే ఆకర్షణకానీ వాసనచూస్తే ఏహ్యం కలుగుతుంది మొదట. కానీ అలవాటుపడాలి. ఆ గగనకుసుమం తనకే లభించిందని అందరిఏడుపు, అసూయ, బాధ. అది ఎలాగో మరోలా వ్యక్తంచేయ వీలుకాక, ముందుఅనలేక, ఇలా ప్రకటితంచేస్తున్నారు" అని నిర్ధారించుకున్నాడు.

అందుకే ఎవరైనా 'ఆనంద్' అని తనను పరోక్షంగా వాకొన్నా ఉడికిపోయేవాడు. అదొక అవమానంగా భావించేవాడు. అంతే "నీగొప్పతనంఏమిటి? ఏమీలేదు. అంతా ఆలీల అడుగుపెట్టిన వేళా విశేషమే. కనుకనే నీకీ కీర్తి ప్రతిష్టలు ఉచితం

గా సంక్రమించాయి. ఆమె లేకపోతే నీప్రతిభకు రాణింపు వుండేదా ఏమిటి" అని వెక్కిరిస్తున్నట్లుండేది.

ఇది, ఈ పరమసత్యం సదానందం విషయంలోనూ వర్తించివుండవచ్చు లీల ప్రభాదీప్తులు అతనిపైన ప్రసరించి వుండకపోతే అతను దమ్మిడీకి కొరకాకుండా పోయేవాడేమో!

కాకుంటే తను ఎరిగున్న సదానందం అంతగొప్పవాడు ఎలాకాగలిగాడు. అంతటి ప్రతిభావ్యుత్పత్తులు ఆయనలో ఏమున్నాయని. అదంతా నిజంగా లీలా మహాత్మ్యం మేలు అయింది. ఈ నాడు ఆ అలవాటుచొప్పున ఆమాటనే తనపైన రుద్దుతున్నారుఅంతా. కానీ నిజానికి తను అంత చేలకాడు. అంత అసమర్థుడు, చేతకానివాడుకాడు.

ఇంటా బయటా, ఎక్కడచూచినా సదానందం స్మరణే ఎక్కువైంది. సుందర్‌కి కూడా ఎక్కడా సదానందమే అవుపిస్తున్నాడు. కళ్లుమూసుకున్నా తెరచినా అతనే అవుపిస్తున్నాడు. అన్నివేపులనుండి తనను వెక్కిరిస్తున్నాడు. ఆయింట్లో ఏ వస్తువు ముట్టుకోబోయినా వాటిమీద సదానందం వేలిముద్రలే అవుపిస్తున్నాయి. లీలను చూచినా, ఆమెలో సదానందం ఛాయలే అవుపిస్తున్నాయి. సూక్ష్మరూపంలో ఆమెహృదయంలో, ప్రతి అంగంలో అవుపిస్తున్నాడు. తనను చూచి నవ్వుతున్నాడు, గేలిచేస్తున్నాడు.

"ఇదో ఇది నాదేసుమా" అన్నట్లుంది.

గుండెలు మండిపోతున్నాయి. బాధ, అవమానం భరించ రానిదిగావుంటోంది. ఏమీ అర్థంకాదు. ఆమె ఎలావున్నా, ఏంచేసినా తనకేంబాధలేదు. ఆమె తనదికాదు కనక ఆమె స్నేహితులు ఎవరైనా తను బాధపడటంలేదు. తనకు సంబంధంలేదు.

ఆమె తనయిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తుంది. అందుకు తను నొచ్చుకోడు, పట్టించుకోడు. ఏ అభ్యంతరంలేదు. కాని సదానందం స్మరణ ఒక్కటే భయంకరంగా వుంటోంది అనుకునే వాడు స్వగతంలో.

నిజానికి ఆ సదానందం ఒక అయోగ్యుడు. ఎలుగుబంటు, దున్నబోతు మార్కు మనిషి, ఉత్తవెధవ, చవట. అతన్ని చేసుకొని లీల గోతిలోపడ్డది పెద్దనేరంచేసింది. ఆనేరానికి శిక్ష లేదు. కాదు వున్నది. అందుకే ఈనాడు ఈ ఏకాంతాన్ని అనుభవించలేక అనుభవిస్తోంది. చేతిలో అమృతపాత్ర వుంచుకొని వాపోతోంది. ఆకలి అయినా అన్నంతినలేదు, అదొక శాపం.

అసలు ఆ బొండు సదానందం ఈమెకు ఎలా నచ్చాడు అన్నది ఒకపెద్ద అంతర్జాతీయ సమస్యగావున్నది. సుందర్‌లో ఏంచూచి వరించిందాఅని. అది అర్థం అవదు సుందర్‌కి.

ఈ అనుమానాలు, మనఃపరితాపాలు రోజురోజుకీ ఎక్కు వవుతున్నాయి గాని తగ్గటంలేదు. మనసుకు వేదన కలుగుతోంది. బరువు, భారంఅవుతోంది బ్రతుకు. అనుమానాల ఇంద్రధనస్సు రోజురోజుకీ, క్షణక్షణానికి రంగుల్ని మార్చుకుంటున్నాయి .... ఈ లీలతో ఇలా జీవించడం కంటే దూరంగా జరిగి స్వతంత్రంగా జీవించడం మంచిదని నిర్ణయించుకున్నాడు. ఎందుకీ వ్యూహంలో ఇరుక్కుపోయి బాధపడటం!

# 19

ఆరోజు ఉగాది.

మహాపర్వదినం. లీల మామూలుగా లేచింది. ఏవో పండుగ వేడుకలు ప్రారంభించింది. పండగయినా ప్రొద్దెక్కి నిద్ర లేచిన సుందర్ పడకమీదనే కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు

లీల దగ్గరగావచ్చి అడిగింది.

'ఈవేళ సంవత్సరాది. లేచి పెందలాడే స్నానంచేయండి'

"ఊఁ" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

"ఉగాదినాడు ఉత్సాహంగా వుండాలి."

" బ్రతుకు తొలి ఉగాదికాదుగా.... చేదు మిగిల్చే ఉగాదులు నా కొద్దులే" అన్నాడు.

"ఈవేళ ఏం చేయమంటారు.... మీకు జిలేబిలంటే యిష్టమేనా" అని అడిగింది.

"ఆహాఁ" అన్నాడు.

"సదానందానికి జిలేబి లంటే మహాయిష్టం. ప్రతి పండక్కు అవే చేయమనేవారు " అన్నది. మధుర స్మృతులను నెమరు వేసుకుంటూ.

సుందర్‌కి కోపం పట్టలేనంతగా వచ్చింది. సిగరెట్ విసిరి నేలకేసికొట్టాడు.

"ఇష్టమయితే కావచ్చు కాని, ఇప్పుడు నిన్నేం చేసిపెట్టమని కోరలేదుగా. ఎందుకాసోది. చచ్చిన ముండాకొడుకుని సుఖంగావుండనీక రోజూఎందుకు పెళ్ళగిస్తావు అతగాణ్ణి" అన్నాడు.

లీల నొచ్చుకున్నది. నొచ్చుకుందని తెలిసి సంతోషించాడు సుందర్.

ఆమె ఆశ్చర్యపోయింది. అంతకోపం రాగా ఎన్నడూ చూడలేదు. పైగా ఇంతకటువుగా ఎన్నడూ మాట్లాడలేదు తన ముందు. సుందర్ మనసులోని భావాలు ఎంతవేడిగా, వాడిగా వున్నాయో గ్రహించింది. నిజానికి అవి తెలుసుకోలేనంత తెలివి తక్కువది కాదుకదా! ఓ క్షణకాలంలో అతన్ని నిలువునా చదివేసింది. మరేమీ అప్పటికి సమాధానం చెప్పదలచలేదు. ఏంచెప్పినాఓర్చుకునే ఓర్మిసహనం సుందర్‌లో లేవనినిగ్రహించింది.

మరోసారి గట్టిగా మందలింపు స్వరంతోనే అన్నాడు సుందర్.

"లీలాదేవీ! సన్నటి ఆడవాళ్లు లావంటి మగాళ్ళను, అందమైన ఆడవాళ్లు, వికృతంగా వుండే మగాళ్ళను ప్రేమిస్తారట నిజమేనా?"

"ఏమో నాకుతెలీదు" అన్నది

"అవునట. ఒకసారి ఏదోమాటమీద సదానందం అన్నాడు నాతో. అందుకే నటగా నువ్వు అతన్ని ప్రేమించింది"

అలాఅని కసితీర్చుకున్నా ననుకున్నాడు సుందర్.

"చచ్చిన వాన్ని చావనీక, మీరురోజు కొక్కసారనన్నా ఆయన్ని హత్యచేస్తున్నారు" అన్నది.

మూరు ప్రతిధ్వనించింది

సుందర్ చాలా సంతోషించాడు. తన మనోభావాలను ఆమె గ్రహించిందని తెలుసుకున్నాడు. అదో వైరిసంతృప్తి. వైరిఆనందం.... ఫలితం లేక పోయినా.

"నీవు అతనికి చాలా అన్యాయంచేశావు లీలాదేవీ". అన్నాడు ప్రసంగం పొడిగిస్తూ.

"నాకు తెలియదు" అన్నది ముక్తసరిగా.

"సదానందం అంటే నీకు యిష్టంవుండేది కాదు అయినా ఇష్టంవున్నట్లే నటించావు"

"స్త్రీని కనక" అన్నది మధ్యలో త్రుంచి.

"కావచ్చు అలా నటించి ఆత్మవంచన చేసుకున్నావు. అతన్ని మోసంచేసావు. నిన్ను మోసంచేసుకున్నావు. అతన్ని చూచినపుడల్లా నాకనిపించేది. ఏదో చెప్పరాని మనోవ్యాధితో బాధపడుతున్నాడని"

"నేను మోసంచేయటం ఏమోగానీ, నీవుమాత్రం మిత్రద్రోహం చేశావన్నది స్పష్టం"

కుక్క కాటుకు చెప్పుదెబ్బలా పనిచేసిందామాట. సుందర్ గుండెల్లో ములుకులా తాకింది. చచ్చినవానికోసం తను సిగ్గుతో తల వంచుకోవలసి వచ్చింది.

"డియర్ సుందర్. అలాంటిప్రశ్నలు ఏ స్త్రీని ఎన్నడూ వేయకు చాలాతప్పు. వాటికి సమాధానం ఎవరూ చెప్పరు. ఎంత నిజమైనా ఏ స్త్రీకూడా తన మొదటి ప్రియుని విషయాలు. రహస్యాలు, నిజాలు మరొకరితో చెప్పదు. ఎవరూ అంగీకరించరు. అదేపురుషుడైతే అదొక గొప్ప ఘనకార్యంగా పదిమందితో చెప్పుకుని జబ్బలు చరుచుకుంటాడు. తనకెందరో ప్రేయసులున్నారని చెప్పుకుంటే సంతృప్తి, గర్వం పురుషుడికి. తనకు ఎవరూ లేరనిచెప్పి, నమ్మించడంలో స్త్రీకి సంతృప్తి, గర్వం ఆనందం వుంటుంది" అన్నది.

పురుషునిలా స్త్రీ ఎన్నడూ మోసంచేదామనుకోదు ఆనీచ ప్రవృత్తి పురుషునిది. నేను సదానందాన్ని మోసంచేశానని నీవు భావిస్తే, నిన్ను మోసంచేయటంలో విపరీతం ఏముండదు, ఆశ్చర్యపడవలసిన పనిగాదు. కానీ ఎక్కడికక్కడే మనస్సును. హృదయాన్ని అర్పించటం స్త్రీ సహజలక్షణం అని గ్రహించు" అన్నది పైగా.

ఎంత చెప్పినా సుందర్‌లో గూడుకట్టుకున్న అసూయ, ద్వేషం తొలగిపోలేదు. పైగా లీలాదేవి చెప్పేమాటలు పురుష ప్రకృతిని సవాల్ చేస్తున్నట్లున్నాయి. కానీ రాజీ పడుతున్నట్లు లేవు.

"స్త్రీని పురుషుడు తనసుఖంకోసం ఉపయోగించు కోవాలికానీ ఆమెచేతిలో కీలుబొమ్మ కాకూడదు ఆమె వ్యామోహంలోపడి" అనుకున్నాడు.

ఆకోపంలో ఏవేవో అనాలని పించింది. కానీ ధైర్యం చాలలేదు. మాటలు పెదాలుదాటి బైటకురాలేదు.

"బగవంతునిదేలోకం. నేను బలవంతునిగా వున్నంత కాలం లోకం నన్నేంచేయలేదు. అన్నింటికీ అతీతుడులా బ్రతకటం నేర్చుకోవాలి" అని నిర్ణయించుకున్నాడు.

లీలఅంటే అసహ్యం వేసింది. ఆమెతనకు కాకుండా పోతుంది అన్ననిర్ణయం, ఆమెను తనుపొందటం దుర్లభం అన్నతలంపు, సుందర్‌ని ఎవరో నిశ్చితాభిప్రాయానికి దోహదం చేసినయ్. అంత కన్నా మీకు అతనిలో స్థానం లేదు.

ఒకరోజు సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి వెళ్ళేసరికి గదిలోంచి రెండు మూడు ఆడగొంతులు అస్పష్టంగా వినబడు తున్నాయి. అందులో ఒకటి లీలదని స్పష్టంగా తెలుస్తోనేవుంది. మిగిలిన గొంతులుకూడా పరిచితులాలే. అలా రెండు నిమిషాలు వస్తాయించి, కిటికీగుండా లోపలకు తొంగిచూచాడు. చూచి గతుక్కుమన్నాడు .... శకుంతల, లీల మరోయువతి కూర్చుని కబుర్లాడుకుంటున్నారు. శకుంతలను చూడగానే సుందర్‌లో కళాకాంతులు ఉడిగిపోయినయ్. శకుంతలతోటి మధురాను భూతులు, స్మృతులు జ్ఞాపకానికొచ్చినాయి ఒక్కసారిగా.

లోపలకు నెమ్మదిగా అడుగులు కదిలించాడు.

"నమస్కారం సుందర్" అన్నది శకుంతల, అంత దూరాన గదిలోకివస్తున్న సుందర్‌ని చూడగనే. సుందర్ విని పించుకోనట్లే వెళ్ళిపోతున్నాడు.

"గుడ్ మార్నింగ్" అన్నది

"గుడ్ మార్నింగ్" అన్నాడు తలెత్తకుండానే. సరాసరి గదిలోకివెళ్ళి బూట్లువిప్పి మరీవచ్చాడు.

"బావున్నారా సుందర్" మళ్ళీ శకుంతలే కల్పించు కున్నది ఎదురుగా కూర్చునివున్న సుందర్‌ని ఉద్దేశించి ప్రశ్నిస్తూ.

మనం కలుసుకుని యుగాలైంది. ఇంతకాలం ఎలావుండ గలిగావు నన్నుచూడకుండా అని దాని అర్థం.

"ఏదో అలావున్నాను" అన్నాడు ముభావంగా.

"మాచెల్లెలు మీకు ఓసారి పరిచయం చేశాననుకుం టాను. లీలను చూడాలంటే వచ్చాను. సెలవులు అయిపో వచ్చాయిగదా. మళ్లీ వెళ్ళిపోతుంది."

ఆ అమ్మాయిని ఓసారిచూచాడు సుందర్. అందానికి అందం, చదువుకు చదువు వున్నాయి. కాలేజీ అమ్మాయిల చిలిపి తనంలేదు, అమాయకత్వం గూడుకట్టుకున్నట్లుంది.

"ఏం బొత్తిగా కనిపించటమే మానేశావ్. రాకూడదను కున్నావా? లేక మా లీల రానీయటంలేదా" అడిగింది.

"అదేమిటే శకూ ... నే వొద్దనటం ఏమిటి?" శకుంతలను చూస్తుంటే ఆమె కళ్లలో ఆహ్వానం కనిపిస్తోంది.

కొంతకాలం అయినాక ఇద్దరూ వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లిపోయాక చెప్పింది లీల.

"ఆ అమ్మాయికి మంచి సంబంధంచూచి పెళ్లిచేయాలని శకుంతల సంకల్పం. ఆ పిల్ల మంచిచెడ్డలన్నీ ఆమే చూడాలిగా మరి. మీలాంటి యోగ్యుడెవరైనా దొరుకుతాడేమోనని చూస్తోంది...."

"నాలాంటి యోగ్యుడా? బావుంది లీలా నాలాంటి అయోగ్యుడు మరొకడుంటాడా ప్రపంచంలో.... నన్ను ఎందుకు పోల్చుకుంటావులే...." నిట్టూర్చాడు.

"ఆ అమ్మాయి చాలా మంచిదిలావుంది. చదువుకుంది కూడా. పోనీ నువ్వే ఎందుకు చేసుకోకూడదు సుందర్. నీ ఉద్యోగానికి, హోదాకి తగ్గ భార్య కాగలుగుతుంది"

"నేనా! ఇంకానయం....నీకేంపిచ్చి కాదుకదా"

ఆ పూట ఎంత కాదనుకున్నా శకుంతల దృష్టిపథంనుండి తొలగిపోపటంలేదు. ఆమెతోటి మధురస్మృతులు, ప్రేమకలాపాలు జ్ఞాపకం వస్తున్నాయి ఆమెతోటి మధుర సంభాషనలు, క్షణాలు, జ్ఞాపకంవచ్చాయి. వాటితో ఈనాటి లీలలు, జీవితం పోల్చుకుంటే చప్పగా, సారహీనంగావున్నాయి.

అనుకున్నట్లుగానే మరునాడు ఉదయం ఆఫీసుకు వెళ్లబోయేముందు శకుంతల యింటికి బయల్దేరాడు. తను నడిచిన ప్రదేశాలు, ముట్టుకున్న వస్తువులు అన్నీకొత్తగా వున్నాయి.

"నిన్నుగురించే రోజూ అనుకోటమే సుందర్ ప్రతిక్షణం నీ స్మరణే" అన్నది శకుంతల ఆహ్వానిస్తో.

"నాస్థితీ అలాగే వుంది శకూ"

సోఫాలో కూర్చున్నారు ఎదురెదురుగా. ఒకరి కళ్లలోకి ఒకరు చూచుకుని నవ్వుకున్నారు. అలాంటి క్షణాలు లోగడ వందలు, వేలు.... ఒక్కొక్కటే జ్ఞాపకం వచ్చి గజిబిజి చేస్తున్నాయి.

"అలాదూరంగా కూర్చున్నావేం శకూ.... ఇలా రాకూడదూ" అన్నాడు ప్రక్కనే చోటుచూపిస్తూ....

"ఆచోటు నాదికాదుగా"

చేయి చాపాడు. చేయి అందించింది ఆమె.

"సుందర్ నాఒక్కకోరికను మన్నిస్తావా సుందర్"

"ఎప్పుడు కాదన్నాను శకూ"

"లీలతో సంసారం ఎలావుంది సుందర్"

"సంసారమే లేదు. ఇక ఎలావుండట మేమిటి?"

"అదేమిటి సుందర్ అలా మాట్లాడుతున్నావు"

"అవును శకుంతలా! లీలను ప్రేమించాను. పెళ్లి చేసుకుందామనుకున్నాను. ఎన్నోకలలు గన్నాను. కాని అన్నీ కరిగి పోయాయి. ఆమె నన్ను ప్రేమించటం లేదని తేలిపోయింది. మొదటినుండి నన్నుచూచి విముఖంగా వుంటోంది. నా పాత్రే

ప్రమాదంగా భావిస్తోంది. ఆమెను వొదిలించు కుందామని చూస్తున్నా కాని వీలుచిక్కటంలేదు.... నాకుగా నేను ఆమెను గాలికి వదల్లేను. సదానందానికిచ్చినమాట నిలబెట్టుకోవాలి. ఆమెగా ఎవర్నినైనా వెదుక్కొని వెళ్ళిపోతే నాఅభ్యంతరం ఏమి లేదు"

"నిజమా సుందర్. నీవనేమాట?"

"నిజం శకూ. నీతోడు."

"నేనంటే కోపంలేదుగా శకూ"

"అదే నేను అడుగుతున్నాను సుందర్"

"నీకుదూరమై నాకు నేనే ద్రోహంచేసుకున్నాను."

"అవుననుకో అయినా ఒకరోజున నీఅంతట నీవే నన్ను వెతుక్కుంటూ వస్తావని నా అంతరాత్మ చెబుతోంది."

"రావాలనివున్నా వొచ్చేసాహసం లేదు. ఏమంటావో, తన్ని తరిమేస్తావేమోనని భయపడ్డాను. అందుకనే రాలేక పోయాను శకూ!... వస్తాను శకూ.... ఆఫీసుకు వేళవుతోంది."

"సాయంత్రం వద్దావు కానిలే సుందర్. కాని ఒకవిష యం ప్రస్తావిద్దామనే నిన్న మీయింటికి వచ్చాను. మాచెల్లెల్ని మీ అభ్యంతరం లేకపోతే మీకిచ్చి పెళ్లి చేదామని అను కున్నాను."

"నాకా శకుంతలా! ఏమిటీ విపరీతం... నీకేం మతి పోలేదుగదా... నా సంగతంతా తెలుసుగదా నీకు. తెలిసే ఈ నిర్ణయానికి వచ్చావా? లేక ఎగతాళి చేస్తున్నావా?"

'ఎగతాళికాదు సుందర్. సప్రమాణంగా చెబుతున్నాను. నీఅంత మంచివాడు నాకు మరదికావటం నా అదృష్టం కదూ.'

"నన్ను ఆలోచించుకోనీ శకూ"

"అలాగే సాయంత్రం రా...."

"శేఖర్ లేరా వూళ్ళో?"

"నిన్ననే మద్రాసువెళ్ళారు".

"అయితే రాలేనుశకూ" మనం ఏకాంతంగావుంటేనే మనస్సు మళ్ళీ చెడు ఆశిస్తుంది. పరిపరి విధాలపోతూంది .... వొద్దులే శకూ. శేఖర్ వచ్చాక ఎప్పుడైనా వస్తాను. ఇంక ఈ పాపంచేయలేను శకూ. లీల నాకు బుద్ధిచెప్పింది. ఏదీ ఆశించ కూడదని నిర్ణయించుకున్నాను".

"అదా .... లేక లీల రానిస్తుందా అనా?"

"రానివ్వక, కట్టివేసి కట్టబెట్టేదేముంది. తనుమాత్రం. ఏం సుఖముందని"

"అదేమిటి సుందర్ లీల అంత పెడసరంగా వుంటుందా?"

"లోకానికి నాకు భార్యగా, ప్రేయసిగావుంటుంది. అందుకు నేనేదో మహా అదృష్టవంతుణ్ణిని అనుకుంటారు. కాని నేనో నానాబాధ అనుభవిస్తున్నాను" అన్నాడు.

ఏలాగైనా లీలతో తెగతెంపులు చేసుకోవాలనే నిశ్చయించుకున్నాడు. మరేదో దారి చూచుకోవటమే మంచిది. శకుంతల చెల్లెలి విషయం ఆలోచించినకొద్దీ అనుమానం పెచ్చు పెరిగిపోతోంది. అది నిజమేనా .... శకుంతల వదినా ....

కొన్నిరోజులు ఈ ముప్పిరిని విప్పటానికి ప్రయత్నించాడు. లీల. శకుంతల .... ఆమె చెల్లెలు .... ఆలోచనవల్ల ఎవరి విషయం పట్టించుకోలేదు. శకుంతలను మరచిపోదామనే ప్రయత్నించాడు.

ఆమె కులట, జారిణి. అవునో కాదో నిజంగా తనకు అనవసరం. తనవిషయంలో ఆమెకాలుజారింది. పతిత అయినా తనేదో పవిత్రురాలన్నట్లు, తనను తూలనాడింది అనేకమార్లు. తన జాణతనం, అభినయంతో, అభినివేశంతో తనను వశపరచుకున్నది.

స్త్రీ చేయగలపని అదే. కానపుడు పురుషుడు స్త్రీకి బందీ కానవసరంలేదు. తాను తప్ప ప్రపంచంలో మరెవ్వరూ తనకులేనట్లే నటించేది. కానీ తన బలహీనతవల్లనే. తిరిగి ఆమె ఆశ్రయం పొందగలిగాడు, ఓడిపోయాడు. అది తనఅలసత్వమో, పురుషత్వంలోవున్న బలహీనతో, లేదా, పురుష ప్రకృతే అటువంటిదో అర్థంకాదు. మోహావేశంతో మన్మధ లోకంలో తనను బందీచేసింది. ప్రేమతో, అపూర్వ అనురాగంతో ముడిపెట్టుకుంది. రోజూఒకసారనా తననుచూడనిదే వుండలేనంటుంది. చేసుకున్న భర్తకుదూరంగా నెలల తరబడివుండగలదు. కానీ ప్రియు

నికి దూరంగా వుండటం .... అనేది ప్రియురాలైన శకుంతల చేయలేనిపని. ఏదో ఒకనెపం.

కబురుచేస్తుంది. పోగూడదనుకుంటూనే పోతాడుతను. ఎన్నో యుగాలఎడబాటు అనంతరం కలుసుకున్నంత ఆప్యాయతగావెళ్ళివాళ్ళోవాలిపోతాడు. అంత ఆ ప్యాయతలో కరిగిపోతుంది తను. చెక్కిళ్ళు, పెదాలు ముద్దుపెట్టుకుంటుంది. కౌగిలిలోంచి ఎంతకీవిడిపోదు. విడిపోవటం అంటే భయం. తిరిగి కలుసుకోలేమన్న ఆత్రుత. తనను జన్మాలుగా ఆరాధిస్తున్నానంటుంది. తాను ఆమెకు లభించటం ఆమె అదృష్టం, వరం, అంటుంది పిచ్చిప్రేమలో.

రోజూ ఓకొత్త ఆకర్షణ కనిపించేది శకుంతలలో. అదొక కోమల సౌకుమార్యం. అదినెరజాణత్వం వయసుకు దీటైన వయ్యారాలతో, వెలయాలిని మించిన అనుభవం చవి చూపిస్తుంది. ఒక్కొక్కసారి ఏమీతెలియని అమాయకపు పిల్లలా వుంటుంది. అంతలోనే రతీదేవిలా మారిపోతుంది. అక్కడే ఆ మధుర క్షణంలో మైమరచి నేను సర్వదా నీవాణ్నే అంటాడు తను. అంతకన్న మరోమాట అనలేదు తను. పదహారేళ్ళ వయసుకత్తెలా, వయ్యారాలుపోతుంటే మత్తెక్కి మరిచిపోయి దాసోహం అనేవాడతను. ఒంటరిగావున్నపుడు ఒకటై ఒక మహాశిల్పి నిర్మించిన రతీమన్మథ శిల్పంలా మారిపోయేవారు. గంటలతరబడి అలా వుండిపోయేవారు.

అప్పుడపుడు శకుంతలను తలచుకుంటే అసహ్యం వేసేది. తల్లిగా మాతృహృదయాన్ని చూపిస్తుంది. భార్యగా,

గృహిణీత్వాన్ని నిరూపిస్తుంది. ప్రేయసిగా, లోకాలనే మర పిస్తుంది. ఒకే వ్యక్తి స్నేహితురాలుగా, ప్రేయసిగా, సఖిగా వుండ గలగడం అసాధ్యమే. అందుకే శకుంతల అంటే రంగుల బొంగరం అనిపించేది.

"సుందర్ నేను ప్రేమించినంతగా నీవు నన్ను ప్రేమి స్తున్నావా" అని ప్రశ్నిస్తే "లేదు. నాకు అలా ప్రేమించడం నీ అంత అకలంక ప్రేమచూపటం చేతగాదు" అనాలనిపిస్తుంది.

"ప్రేమించడం తప్పే అనుకో. కానీ నిన్ను చూచాక, కాదనలేకపోయాను. ఇప్పుడనిపిస్తుంది జీవించినంతకాలం సుఖ పడకపోతే బ్రతుకెందుకు అని, ఏది మరో ముద్దు మళ్లీ ఎన్ని వేల నిమిషాలకో గదా పునస్సమాగమం" అనేవాడు.

ఆలోచనలతో రోజులు గడిచాయి.

కానీ ఆరోజులు తిరిగిరావు. గాలిపటంలా జీవించటం అనవసరం. బ్రతుకు విలువ లేనిదిగా చేసుకోవటం అనవసరం.

"నా జీవితం ఇలాగే గడుపుకుంటాను. నాకు లీలావొద్దు శకుంతలా వొద్దు, పెళ్ళివొద్దు, పెటాకులూవొద్దు, అని నిర్ణ యించు కున్నాడు.

ఆనిర్ణయాని కొచ్చాక మనసు ఊరటచెందింది. ఊపిరి పలిపింది. హాయిగా వున్నది.

## 20

ఆరోజు ఆఫీసుకు వెళ్ళేసరికి ఒక ఉత్తరం టేబిలుమీద ఎదురుచూస్తోంది. సుందర్ పేరవచ్చింది. పోస్టుముద్రలులేవు. ఆ దస్తూరిగుర్తే. ఆత్రంగా, అనుమానంగా విప్పాడు.

డియర్ సుందర్,

నేను సుందర అభాగ్యను. ఎవరాఅని విచారిస్తున్నావా. ఎవరికీ కానిదాన్ని. నీకూ కానిదాన్నేమో! పదిరోజులనుండి టైఫాయిడ్. బొత్తిగా ప్రాణలేదు. బ్రతికే ఆశకూడా లేదు.

మీరు ఇంకా వస్తారు, ఇంకా వస్తారు అని సంవత్సరం నుండి ఎదురుచూస్తూనేవున్నాను. స్త్రీ ఒకపురుషున్నే ప్రేమి స్తుంది. ఒకరికే మనసిస్తుంది. ఒకరికిచ్చిన మనస్సు మరొకరి పైకి మళ్లించటం చేతకాదు. అలాచేయడానికి ప్రయత్నించినా అదంతా నటన. నా స్థితీ అంతే. నాహృదయాన్ని మీకు అంకితంచేశాను ఏ నాడో సుందర్. ఆవిషయం మీకూ తెలుసు. అదే నా తృప్తి. అంతిమ ఘడియల్లో మరొకమారు మిమ్మల్నిచూడాలని కోరి

కగా వుంది. జీవితంలో నేను కోరదగింది మరేమీ లేదు. మీ రాకకు ఎదురుచూస్తుంటాను. ప్రాణంవుండగానే ఒకసారి రాగలరు కదూ!

—ర జని.

ఉత్తరం పూర్తయేసరికి కళ్ళలో నీళ్ళు తిరిగినాయ్. తల తిరిగి పోయింది. ఆలోచనలే స్థంభించినాయ్. అపూర్వ అనుభూతి కలిగింది. ఉత్తరం మరోమారు ఆత్రంగా, విపులంగా చదివి జేబులో పెట్టుకున్నాడు. ఇంక పనిచేయ బుద్ధికాలేదు. ఇంతకాలం రజని విషయమే జ్ఞాపకం రాలేదు. శాపగ్రస్థుడైన దుష్యంతునిలా వుంది తనస్థితి.

వెంటనే రజని యింటికి బయల్దేరాడు.

రజని పరస్థితి చాలా ప్రమాదంగావుంది. ఎంతో నీరసపడి పోయింది. పరిస్థితి అయోమయంగా వుంది.

«వచ్చారా! రారేమో ననుకొన్నాను» అన్నది లేనినత్తువ తెచ్చుకొంటూ.

«రాకుండా వుండగలనా రజనీ.»

“ఇంతకాలం రాకపోయినా బాధపడలేదు. కాని చివరి ఘడియల్లో రాకుండావుంటే పిచారించేదాన్నే, వొచ్చారు. అంతే చాలు. సంతోషం, ఇంక బ్రతకను, బ్రతికినా జీవితానికి విలువ

లేదు. మీకుకాని నేను ఎందుకు బ్రతకాలి. ఎండిన మోడులా జీవించి ప్రయోజనం ఏముంది? ఏం ఆశించి బ్రతకాలి, చెప్పు సుందర్. మీకు తెలియని ఒక రహస్యంవుంది సుందర్. మా అమ్మ చనిపోతూ నాపేర తన ఆస్తి ఇరవై ఎకరాలు వ్రాసి పోయింది. నాకు ఎవరూ లేరు. నేను చనిపోతున్నాను. అది మీ పేర వ్రాయించాను. ఇదుగో వీలు.... మీాయిష్టం. కాదనకండి. నా ఆత్మ సంతృప్తి కోసం చేసినపని అది. అదే నా ప్రేమకానుక కాదనకండి" అంటూ తలగడక్రిందవున్న వీలునామా తీసి యిచ్చింది.

సుందర్ కళ్ళు అశ్రుపూరితాలైనాయ్. నోటమాట వెలికిరాలేదు.

"రజనీ! నేనంటే నీకింత ప్రేమ ఎందుకు?" అన్నాడు తడబడుతున్న గొంతుకతో కంటి నీటికి కరకట్టలువేస్తూ.

"దానికి కారణంమీరే" అన్నది. అని సిగ్గుతో కుంచించుకు పోయింది.

బరువుగా నిట్టూర్చాడు సుందర్.

శకుంతల, లీల, వీరిద్దరిలో ఇలాంటి సౌకుమార్యంలేదు. కుసుమశిరీషలు కారు వారు.

"నన్ను క్షమించు రజనీ. నీకు, నీ ప్రేమకు ద్రోహం చేశాను. నీకు అన్యాయమే చేశాను. నిన్ను, నీ హృదాయన్ని అర్థం చేసుకోలేక పోయాను. ఎండమావుల్ని చూచి తటాకాలుగా భ్రమించి మోసపోయాను. నేను ఎన్నటికీ నీ వాడినే రజనీ!" నిశ్చయంగా అన్నాడు రజనీ రెండు చేతులు పట్టుకుని

ఆమె కన్నులు అశ్రుతర్పణం చేశాయి.

శరీరం అంతా చెమటపట్టింది.

చెక్కిళ్ళమీద కన్నీటి చారికల్ని తుడుస్తో కూర్చున్నాడు.

"మరణశయ్య మీదవున్న రజనికి మాట యిస్తున్నారా? జీవితంమీద ఆశ కలిగిస్తున్నారా?"

"మరణశయ్యకాదు రజని తూలికా తల్పం"

"నేను నిజంగా చనిపోతున్నాను సుందర్"

"అలా అనకు రజనీ, నీవు చనిపోకూడదు. నేను చనిపోనివ్వను నాకోసం బ్రతకాలి"

"మీకోసమనే, మీసుఖంకోసమనే చనిపో నిశ్చయించుకున్నాను"

"వద్దు రజనీ, అంతభయంకర నిర్ణయం చేసుకోకు ఆరోజులువేరు ఈరోజులువేరు. నేను నీవాణ్ని. నీవు నాకోసం బ్రతకాలి. మనం మనకోసం బ్రతకాలి".

చెక్కిళ్ళపై జారే ఆనందాశ్రువుల్ని మునివ్రేళ్ళతో తుడుస్తూ లాలించాడు. హృదయంలోనే బరువుల్ని, బాధల్ని కరిగించుకొని, వాటిమీద సింహాసనం రూపొందించుకున్నాడు. ఆసింహాసనం మీద రజనిని కూర్చోబెట్టి పట్టంకట్టాడు.

ముసిరిన మబ్బులు క్రమంగా ప్రిడిలిపోయినాయ్ క్రమ్ముకున్న కారుమబ్బులు కలగి, చెలగి, చెరగిపోవటంతో వస్తున్నదనుకున్న వాన రాకుండా ఆగిపోయింది. కారుమేఘాలు దూది పింజల్లా ప్రిదిలిపోయినాయ్. ఆకాశం__ ప్రశాంతమైంది.
ఇంద్ర నీలాద్రి వెనుకగా ఉదయించిన బాలచంద్రుడు, ముసిముసి నవ్వులు నవ్వాడు. ప్రక్కనేవున్న రోహిణి సిగ్గుపడి పోయింది నవ వధువులా.



వి. జె. ప్రెస్, చిత్తూరు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B164 |
| పుస్తకం పేరు | మహర్షి టాగూరు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 221 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |